# నీలాపనింద

(జమీందారుల కథ)


గ్రంథకర్త:

దిగవల్లి వేంకటశివరావు, బి. ఏ., బి. యల్,

(దక్షిణాఫ్రికా చరిత్ర గ్రంథకర్త)



బెజవాడ:

ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

క. కోదండరామయ్యగారిచే

ముద్రింపబడినది.

1929




[వెల ఒకరూపాయి

విషయసూచిక

# విషయసూచిక.

# నీలాపనింద

## మొదటి ప్రకరణము.

—◆ పదేండ్ల క్రితము ◆—

పాపము! రాధాదేవి చిన్ననాటనే యామెతలిదండ్రులు-
గతించిరి. ఆమెతండ్రి మొదట ధనికుడగు మొఖాసాదారుడే
గాని చెన్నపురిలో వ్యాపారముచేసి తన సర్వస్వమును గోల్పో
యెను. ఈమె యుదయగిరిలో తనపినతండ్రియగు నుదయగిరి
శ్రీధరరావుగారియింట పెరుగుచుండెను. శ్రీధరరావుగారికి
పుత్రాదులు లేమి రాధాదేవి నల్లారుముద్దుగ పెంచు
చుండెను. నీలపురపు జమీందారుగారగు గంగాధర రామా
రావుగారి కొమారు లీమెకు మేనరికమేగాని జమీందారుగా
రి సంబంధముమాట తలపెట్టరైరి. ఆయన పెద్దకుమారుడగు
రామారావు చెన్నపురిలో జమీందారులబిడ్డలు చదువుకొను
టకు స్థాపింపబడిన న్యూయింగ్టన్ కళాశాలలో చదువుచుండెను.
ఇతని నడవడినిగూర్చి శ్రీధరరావుగారనుమానపడి యిదియు
మేలే యని తలచిరి. జమీందారుగారి రెండవ కుమారుడు
కృష్ణారావు. ఇతడు చాల బుద్ధిమంతుడు. ఇతనికి చెన్నపురిలో
నారోగ్యము పరిపడనందున నింటనేయుండి చదువుచుండెను.

ఇతనికి రాధాదేవియన్న బాణిణము. వీరి యాటపాటలు, నన రాగమును జూచి శ్రీధరరావుగారు ముచ్చటపడి బహిరంగముగ నడిగినచో చేసికొనరేమో యని భయపడి కాబోలు నొక సుముహూర్తమున రహస్యముగ గుడిలో ముడివెట్టిరి. రాధాదేవికి యుక్తవయస్సు వచ్చునప్పటికి జమీందారుగారు దివంగతులగుటయు, రామారావు జమీందారుడగుటయు తటస్థించెను. ఇంతలో శ్రీధరరావుగారికి నవసానకాలము నమీపించెను. శ్రీధరరావుగారు తనసర్వస్వమును రాధాదేవికి నామె పిల్లలకు చెందునట్లు శాసించి మరణించిరి. కృష్ణారావుగారు వివాహమును బహిరంగపరచిరి. రామారావుగారికి నితర బందుగులకు నీయనపై ననిష్టము కలిగెను. అంతట కృష్ణారావుగారుదయగిరిలో కొన్నాళ్లుండి చెన్నపురికి బోయి సుఖముగ గాలక్షేపము చేయసాగిరి. ఈదంపతుల కనిరుద్ధుడను బాలుడును, శకుంతలయను బాలికయు గలిగిరి. అంతట రామారావుగారి పెండ్లి నిశ్చయమైనది. పాతవైరము మాని ఆయన వీరి నెల్లరను నెల్లూరికి రమ్మని పిలచిరి. అంతట పదేండ్లకిత్రము, ఆగష్టునెలలో నొకనాటి ప్రాతఃకాలమున భర్తతోను పిల్లలతోను రాధాదేవి తనయత్తవారింటికి వచ్చెను.

మొదటి కొన్నిదినములు సంతోషముగ గడచెను. తరువాత నెడమొగములు, పెడమొగములు. మగనికిని భావగారికిని గునగునలు తగవులుకూడ బయలుదేరెను. తరువాత

నా దుర్దినము వచ్చెను. ఆనాటి ఘోరహత్యను గూర్చిన నీలాప నిందను, ఆమె గతించినపిమ్మట భగవంతుడు ప్రసాదించు నిష్పక్షపాత మగు న్యాయముతప్ప వేఱొండు పోఁగొట్టఁజాలదు. ఇప్పటికిని విముక్తి రాలేదు. ఆదినము పగలెల్ల రాధాదేవికి రాఁబోవు నాపదకై దుఃఖించుచున్నదో యన గుంభవృష్టిగ గురియుచుండెను. అనిరుద్ధుఁడు పోయి చినుకులలో తడిసెను. అందువలన జీకటి పడునప్పటికి జ్వరపీడితుడయ్యెను. ఆసా యంతనము జడివాన తగ్గెనుగాని సన్ననిజల్లు పడుచునే యుం డెను. ఈజ్వర మంత కంతకు హెచ్చగుచుండెను. పాపము చిన్నతనమునం దిట్టి యొడుదుడుకులు చూడ రాధాదేవికి భయము గలుగుట సహజమేకదా. ఆభవనము దొడ్డివెనుక కాపురముండు నొకముదుసలి అయ్యవారింట నేవోమందు లున్న వని ఎవ్వరో యనుచుండగ వినిన దగుటవలన తొందర దిగంటలు దాటి పదియగుచుండ నిక నాగలేకపోయి, తానే యామందుల నడుగ నిశ్చయించుకొని, బావగారింటి సేవకుల కేల పనిచెప్పవలె నని తలచి, మోమోటమిచే రాధమ్మతానే పోయెను. ఆదొడ్డిలోనుండి పోవుచుండెను. ఆదొడ్డినంటియే యుద్యానవనము కలదు. ఆయుద్యానవనము నుండి యొక మనుజుఁడు తటాలున నేవంకకో పోయినసందడి యయ్యెను. ఆపోయినది నారాయణరావని యీమె పోల్చగల్గెను. ఇతడు రామారావుగారికి బంధుగు డగుటచే గాక ఆయనకు ప్రాణ

స్నేహితుడు. అందువలన నీతఁ డట్లు పోవుచుంటకు శంకింపక యామె తనదారిని తాను పోవుచుండెను. అయింట-దీప మప్ప టికే యారిపోయి యుండెను. ఇల్లు నిశ్శబ్దముగ నుండుటవలన నెల్లరును నిద్దురఁ జెంది రని తెలియవచ్చుటచే వారల నెట్లు లేవఁగొట్టుదునాయని వితర్కించి సందేహించియు రెండుమూడు మాఱులు తలుపుఁగొట్టి వారు పలుకకుంటవలన నిరాసఁ జెంది, గిరుక్కున మఱలి వెనుకకు వచ్చుచుండెను. ఆమె యిట్లు వచ్చుచుండ నీసన్నని జల్లు మఱల దట్టముగ పడుచుండెను. అప్పుడెవ్వరో ఇరువురు అన్యు లాయావరణమందుండి యుద్యా నవనము దాటి వేగముగ పోవుచుండుట నీమె చూచెను గాని పోల్చుకొన లేకపోయెను. ఇంతలో వారు మాయమైరి. ఎవ రో వర్షమునుండి త్వరగ నావలికిబోవుచున్నా రనుకొని యీమె యూరకుండెను. చాల భయపడెను. చీకటి - వర్షము - ఒంట రిది - ఆడుది. అందువలన నీమె గుండియ లదరుచుండ భవన ముకైవునకు వడివడిగ పోవసాగెను. తనకొమరునకు జ్వరమె ట్లుపోవునాయనియు, తన యత్తవారింటి పొత్తు కుదురునెట్లా యనియు నాలోచించుచు పోవుచుండెను. అంత నామె తటా లున నదరిపడెను. కాలి కేమో తగిలినది. గట్టిగ నున్నది. చేతి తో దీసి చూచినది—ధగధగలాడుచున్న బాకు! ఆమెకు ముచ్చె మ్మటలుపోసెను. ఆమె గజగజవడకి అయ్యో యనియార్చెను. నాల్గు ఉంగులలో భవనపుచావడి చేరెను. అనంగతి తలచి

కొనినచో నిప్పటికి నొడలు పులకలెత్తును. దానికి రక్తమంటు కొని యుండెను. ఎవరి రక్తము? అనువార్త భవనమున ప్రబలెను. ఎల్లరు నాశ్చర్యపడిరి. డిల్లవోయిరి.

కృష్ణారావుగా రొకగంటనుండి తమయన్నగారిని చూడలేదు. వెంకయ్య ఆయన శయనమందిరమున నుందు రనెను. కాని యచ్చట లేరు. తొమ్మిదిగంటలనుండి యెవ్వరును చూడనే లేదు. సేవకు లెవ్వరు నిట్టియాయుధము నీయింటం జూడలేదు. ఇది రామారావుగారిది కాదు. రామారావుగారికొరకు నెల్లరు వెదకిరి. వెదకి వేసారిరి. ఎచ్చటను గాన్పింప లేదు. దొడ్లనుద్యానవనములను వెదకు మనిరి. వెదకిరి. అంత నాయుద్యానవనము ప్రక్క నాల్గుదారులు కూడుచోట నడుమ, భవనమునకు వెనుక ప్రక్కనే యాజమీందారుని శవము పడియుండెను. ఆయన వక్షమునందు కత్తిపోటు తగిలియుండెను. ఇక హత్యచేసిన దెవరు? దేవుం డెఱుంగును. అనుమానముమాత్రము రాధాదేవిపైం బడెను.

ఎల్లరకు నీసంబంధమువలనతగవులు కలిగిన వని తెలియును. జమీాందారుగారికి మఱఁద లన్నచో నిష్టము లే దని తెలియును. సేవకు లీమెను గూర్చి గుసగుసలాడ సాగిరి. ఇది యును గాక బాకు నీమెయే చూచినదికదా! జిత్తులమారి హత్యగాండ్రు తమమీాద ననుమానము పడకుండుటకై హత్యవార్తను తామే తెలుపుచుండుట సహజమే. ఇంతకు నీజమీాందారుని

చంపుట కెవరికి పట్టినది? ఎవరి కేమి లాభము? ఈ దరిద్రు రాలొక చిన్నిహత్యవలన జమీందారిణి కాఁగలదు కదా. జమీందారిణి పదవి, ధనధాన్యములు, వస్తువాహనములు, సేవకులు, అధికారము, ఎల్లను కలుగునుకదా. ఈకారణములు పురస్కరించుకొని ఎల్లరీమెపై ననుమానపడిరి. వార్తలు బయలు దేరెను. భవనమునుండి పురవీధులఁ బడెను. రక్షక శాఖవారు వచ్చిరి. సత్యాన్వేషణ చేసి న్యాయముగ ద్రోహి నారయుటకు బదు లనుమాన మున్నవారిపై కల్పిత సాక్ష్యములతో ద్రోహము స్థిరపరుప దలంచుట వారి కలవాటు. బలి కొఱ కెవరో యొకరు దొరకిన చాలు నని వారి యూహ. అన్నిటికన్న నీమె బీదవారిపిల్ల యగుట యొక ప్రబల కారణము. పోలీసువా రీమెకును బాలునకుగల సంబంధము స్థాపింప లేక పోయినను, ఈమె తనకును బాలునకును సంబంధములే దని స్థాపించుకొనలేదు. ఈ యసమర్థత యొక నిదర్శనము. వే రెవ్వరు నాప్రదేశమున లేకుండుటింకొక కారణము. అక్కడ నెవ్వరనో చూచితి నని యీమె యన్న నమ్మువా రెవ్వరు? కాకతాళన్యాయముగ నీమె కన్యాయము జరిగెను. అచ్చటి పాదచిహ్నము లీమెవానితో సరిపోయిన వట. ఆమెత్తని నేల పై నడుగులు బాగుగ కనబడిన వట. ఈమె శవముప్రక్కనుండి చూడకయె పోయిన దనినచో నెవ్వరు నమ్ముదురు? భవనము వెనుక గాపురముండిన ముదుసలియయ్యవారు తాను పది

గంటల వఱకును మేల్కొని యుంటి ననియు తనతలుపు నెవ్వ రును కొట్ట లేదనియు సాక్ష్య మిచ్చెను. ఈ ప్రమాణములో దోష నిర్ధారణము పూర్తి యయ్యెను. ఆమె ముదుసలియాయన యింటికి పోవుట నెప మనిరి. ఆయుధమును జూచి పొందిన భయమును, ఒంటరిగ నా చీకటియందు పొందిన వడకును, నేరగాండ్రు తమ దోషమునకై పొందు తహతహ యనిరి. హత్యజరిగిన యిరువదినాల్గు గంటలలో విచారణ చేయవలసి యున్నది గాన భవనము విడిచి యెచ్చటకును బోఁగూడదను నుత్తరువు రాధాదేవికి వచ్చెను. తరువాత విచారణ జరిగినది. రాధాదేవికి రామారావుగారికి పూర్వమునుండి విరోధము లున్నట్లును, రామారావుగారిని వధించి పగదీర్చికొని జమీం దారి తనవంశమున నిలుపు నుద్దేశ్యముతో రాధాదేవి బాకుతో పొడిచి చంపినట్లును, బాకు ఆమెయే చెన్నపురినుండి తెచ్చినటులను ఆరాత్రి రామారావుగారితో నామె యా యుద్యానవనమున నాప్రదేశము వైపునకు బోయినట్లును, నింక ననేకములగు విషయములును పోలీసువారు తమ సాక్షుల చేత చెప్పించిరి. రాధాదేవిపక్షమున నియమింపబడిన న్యాయ వాదికితగిన సంజాయిషీల నిచ్చువారు లేనందునను క్రిందికోర్టులో కేసు పాడైనది. ముద్దాయివాదన నమ్మక పోలీసు కథనే కోర్టువారు నమ్మిరి. రాధాదేవిమీద మొదటనుండిన సాను భూతి తుద కెందరికిని నశించినది. అంతట నెల్లూరు సెషన్సు జడ్జి

కోర్టులో రాధాదేవి దోషి యని తీర్మానించి శిక్షించిరి. పోలీసువా రనుమానించినను విచారణజరుగుచున్నను కృష్ణా రావుగారు ఈమె దోషి యని నమ్మలేదు. మఱియు నెల్లర తోడ నీమె నిర్దోషి యని వాదించుచుండును. ఎంతో దుఃఖము జెందుచుండును. అయిన నీమె న్యాయస్థానమున శిక్ష పొంద గనే ఆయనకు ననుమానము కలిగెను. తన బావగారైన పద్మ నాభరాజుగా రీమెపైన చెప్పిన సాక్ష్యము తక్కిన పోలీసు సాక్ష్యములు వాస్తవములే యని కృష్ణారావుగా రనుకొనిరి. తన బంధుగులమాటలు, నిష్ఠురములు, కొండెములు నీయనకు తల కెక్కెను. అంత మెల్లగ దుఃఖముతో, బాధతో తనహృదయ కవాటమునుండి యీశిక్షిత నావలకు దోసివైచెను. రాధా దేవికి శిక్షాస్మృతిప్రకారముగ హత్యగాండ్రు పొందు పూర్ణమ గుశిక్ష విధించిరి. అది మరణదండనము......ఈకథ తలపునకు వచ్చుచుండగ 1912 వ సంవత్సరమున నొకనాటి సాయం త్రము నెల్లూరు వైద్యాలయోద్యోగిని యగు సుశీల దీర్ఘమగు విచారమ్ము, ధుఃఖమును దెలుపు సుందరవదనమును వంచుకొని కన్నీరు తుడుచుకొని వేడినిట్టూర్పు నూర్చుచు మెల్లగ నడచు చుండెను.



# రెండవ ప్రకరణము

## తరువాతి కథ

ఆమె యట్లు నడచుచుండగ కాలుసాగుటలేదు. ఆదిని మఃలు జ్ఞాపకము వచ్చుచుండెను. అవి యురితాడు పాలబడ వలసి వచ్చునను కొనుచు ననుక్షణమును భయముతో గడిపిన దినములు. ఆ వేదన, బాధ, ఆరాటము, ఆతురత, ఎన్నటికిని మఱువఁ జాలదు. కర్మ మనుభవింపవలసిన కాలము దగ్గరించుచుండెను. ఇంతలో మరణదండనశిక్షయందించుక మార్పు వినవచ్చెను. చెన్నపురి ఉన్నతన్యాయస్థానమువా రీమెకు మరణదండన తప్పించి [illegible]వరకశిక్ష విధించిరి. ఈమార్పున కీమె మొదట సంతసించెనుగాని ఇప్పుడీ యనుభవముల తరువాత, అనేక వత్సరములు యమయాతన పొందుటకే యీ క్షణభంగుర దేహమునుండి విముక్తిపొందలే దని తోఁచినది. వధ్యశిలపైఁ జచ్చుట, యనేకదినము లీ శరీరముతోడనే అనేకులగు అధమాధములగు మానవులతో జీవించుటకన్న, నవమానకరమా? ఆదుర్గతి ప్రయాసము కఠినవరకము నీమె యెఱుఁగదు. అయినను పిచ్చిభ్రమతో ప్రేమతో తనయందు నమ్మకముపోయిన భర్తపైనను, తన్నెడబాసిన పసికూనలపైనను పంచప్రాణములు పెట్టుకొని యావరకమునఁ బడియుండెను. గోరుచుట్టుపై రోకటిపో టనునట్లు కష్టములపైఁ గష్టములు వచ్చెను. భర్తదగ్గర

నుండి లేఖలు రాలేదు. తనబిడ్డల క్షేమసమాచారమైనఁ దెలి
యుట లేదు. కారాగారము ప్రవేశించినదిమొదలు ఏ రెటు
లున్నదియు నీమె యెఱుఁగదు. కాలమతిభారముగఁ దోచెను.
ఆబిడ్డలు తమజనని గతించిన దని యెంచుకొందురని యామె
గ్రహించెను. మొదటి కొన్ని నెలలవరకును, ఏకాకియై
యుంట యీమెకు దుర్భరమయ్యెను. అంతఁ దనభర్త తన్ను
మఱచి వేఱొకస్త్రీని చేపట్టెనను ఘోరవార్త యీమె చెవిని
బడెను. అప్పటి కేమియు నెఱుఁగని ముగ్ధ. కష్టములు నాటిన
ఇప్పటి వీరమాత కాదు. ఇదియె యీమెను దుఃఖసముద్ర
మునఁ దోసెను. తనదుఃఖమున అసహాయురాలై తన్నురక్షిం
చుకొనుట కేయత్నమును చేయలేకపోయెను. కష్టములవలన
మొరటుదేరిన యిప్పటి బలమును ధైర్యము నప్పుడుండినచో
తనకొఱకు తన బిడ్డలకొఱకు నీమె పోరాడియుండును. అది
యుఁగాక నీమె పంజరబద్ధమగు పక్షి. ఏమిచేయఁగలదు? తన
సర్వస్వమును నాశనమై పోవుచుండ తా నేమియుఁ జేయలేక
పోయెను. హృదయవేదనకు కాయకష్టములోడ్పడగ నీమెకు
ప్రబలవ్యాధి వచ్చెను. చావుబ్రదుకులతో కొన్నివారములు
మంచముపైనఁ బడియుండెను. ఈవ్యాధి కుదిరి లేచునప్పటి
కీమె పూర్తిగ మారిపోయెను. తేజోవిహీనయై తొంటిసౌం
దర్యముఁ గోల్పోయి, బలముకూడ లేక వెల్లదనముతో నీర
సముతో మఱల నరకశేష మనుభవింపఁ దొడంగెను. ఈమె

మరణమును కెదురుచూచుట తక్క వేఱేదియు తలంచుట లేదు. కారాగార వైద్యశాలలో దాది పనిచేయువంతు వచ్చెను. ఈమె సుకుమారి యయ్యు విద్యావతియయ్యు కాయకష్ట మున కోర్చెను. దృఢనిశ్చయముతో పనిచేయఁ జొచ్చెను. ఈవర కెన్నఁడిట్లు యావచ్ఛక్తిని వినియోగించి పనిజేసినవారు లేరు. ఈమె కష్టమనక, అపాయమనక, ప్రాణములపై నాశను ద్రోసిపైచి సాహసముతో- నేర్పుతో వైద్యశాలయందు పనిచేయుచుండెను. ఈమెకు త్వరలోనే యచ్చటి పనుల యందు నేర్పలవడెను. పైయధికారు లీమెత్యాగమును శ్రద్ధ యునుచూచి శంతసించిరి. ఈమెసద్వర్తనము మెప్పువడసెను. ఇదిగాక నాకారాగారమున ఖైదీలమధ్య నుదయించిన తిరుగు బాటు ఈమెయొక్క మంచిబోధలవలన నడంపఁ బడుటవలనను, ఈమెగుణాతిశయములను కారాగా రాధికారులు పైయధి కారులకు మెచ్చుకొనుచు వ్రాసిరి. ఇంతలో జార్జిచక్రవర్తిగారి పట్టాభిషేకమువచ్చినది. అంత నీమెవరకమున పదివత్సరములు పూర్తిగాకమునుపే, ఆమెకు విడుదలపత్రిము ౹దయచేయఁ బడెను. అంతట నామె పూర్తిగ మారిపోయినదై, చిక్కిశల్యమై పోల్పవీలులేనట్లు అకాలముగ ముసలిదై ఎల్లరకును గొత్తదై జీవచ్ఛవమై యీవలఁబడెను. ఆమెజవ్వనము గతించినది. సౌందర్యము పోయినది. దీనికిబదులు గుణసౌంద ర్యము వచ్చినది. పరోపకారపరాయణత్వము, ఈశ్వరభక్తి,

స్వయంసాహాయ్యము నీమె సంపాదించుకొనగల్గినది. పూర్వ
మువలె దీనమగు సుకుమారియు ముగ్ధయు నగు నబలగాక గం
భీరహృదయయగుస్త్రీయైనది. ఇప్పు డీమెనిర్ధన, అసాహాయ్య.
ఏమిచేయవలెను? ముందుగ సుశీలయనుపేరు పెట్టుకొనెను.
ఈమెకు దేవునివలె దినవహి శివరామయ్యగారు కనఁబడిరి.
ఈయన నెల్లూరులో దండవిధాయి. సద్బ్రాహ్మణుడు. కరు
ణార్ద్రహృదయుడు. చెన్నపురి వైద్యశాలయందు ఈమెకు పని
సంపాదించిపెట్టిరి. ఈమె యచ్చట కొన్నిదినము లున్నతరు
వాత నీమె కొక కోరిక కలిగెను. నెల్లూరుపురమునకుఁ బోయి
బిడ్డలను చూచుకొనుచు సంతసింపవలె నను కోరిక ఈమెకు
కల్గెను. శివరామయ్యగారు పలుకుబడి కలవారు. అందువలన
నెల్లూరి వైద్యశాలలోనే శీఘ్రముగ పనిని సంపాదించిపెట్టిరి.
కొన్ని నెలలైనది. ఇంత స్వల్పకాలములోనే, ఈమె తనసహజ
చాతుర్యముతో-ఓర్పుతో-పాటుపడి పనిచేసి ఖ్యాతి గడించెను.
అపాయమన్న భయపడదు. శ్రమయన్న వెనుదీయదు. కష్ట
మున కోర్చి రాత్రింబవల్లనక ఉపచారములు చేయును. రోగుల
కీమెయన్న ప్రాణము, ఉద్యోగుల కీమెయన్న గౌరవము.
ఎఱిగినవారి కీమెయందుభక్తి. ఈమె మెచ్చుటకిబోయినను
మ్రొక్కులిడువారె. ఈమె జన్మరహస్యము నెల్లూరుపురమునం
దెవ్వరికిని దెలియదు. ఎవ్వరు నీమెను రాధాదేవి యని పోల్ప
లేదు. శివరామయ్యగా రొక్కరుమాత్రమే ఈమెగుట్టు

నెఱుఁగుదురు. ఈరహస్యమును ఆయన కడుపులో పెట్టు కొని తండ్రివలె కాపాడుచుండిరి. ఆయనయే దండవిధాయి యగుటవలన నీమె తనయునికి నాయనకు దెల్పినచో జాలును. అందువలన నితరున కెవ్వనికో ప్రత్యక్షముగ పోయి తనసంగ తిని ఉనికిని నల కొకమారు తెలుపుకొనవలసిన లజ్జాకరమగు నవస్థ తొలగిపోయెను. ఆమె యిప్పుడందులకే యిట్లుపోవు చుండెను! ఇంతలో నొకగుఱ్ఱపుబండి యాదారిని వచ్చెను. ఇందు పసిమివన్నె కలదేహము, కాటుకకన్నులు, రాజతీవి కల యొక నడివయస్కుఁడు మెలిదిరిగిన మీసములతో, దీర్ఘవిచా రమును తెలుపు విశాలఫాలముతో కూర్చుండి యుండెను. ఆయన కెట్టయెదుటనే, కళావంతమగు మోముతో, నూనూ గు మీసములతోడి పదునారేండ్ల బాలుఁడొక్కరు డుండెను. సుశీలమ్మ అప్రయత్నముగనే, "నాథ ర్తయు, కొమరుఁడును!!" అని పలికెను. బండి వెడలిపోయెను. సుశీలమ్మయు నిట్టూర్పు నూర్చి వెడలిపోయెను.

# మూడవప్రకరణము



## —♦ జమీందారుగారిభవనము ♦—

ఆగుఱ్ఱఁపుబండి యట్లానెల్లూరు పురవీథులనుండి వడి వడిఁ జని ట్రింకువీధియందు కొంతదూరము పోయి యద్దుదా

రులలోఁ బరువెత్తి శ్రీరంగరాజపురమున కించుకదూరమున విశాల ప్రదేశమునగల జమీందారు గారి హర్మ్యపు సింహ ద్వారము నెదుట నిలిచెను. దారిలో కనబడినవారివంక జూచి అనిరుద్ధుఁడు మందహాసము చేసెను. కాని కృష్ణారావుగా రేమియు మాటాడక మౌనముతో గంభీరముగ నాశకటము నందు నిశ్చలముగఁ గూర్చుండియుండిరి.

ఆమర్దినమున నేపప్రదేశమునుండి రాధాదేవి నడచిపో యెనో, ఆప్రదేశమందే ఇప్పుడీబండి నిలిచెను. సాయంతన మయ్యెను. సూర్యుఁడు అస్తమించెను. ఆసంధ్యయందా కట్టడ మంతకంతకు కంటికి గోచరించుటలేదు. చీకటి, చెట్లనీడ, యివి యెల్ల చేరి దాని నదృశ్యముగ జేయుచున్నవి. అందలి గవా క్షములనుండి మినుకు మినుకు మను పెద్ద కాచదీపములకాంతి మిలమిల యీవలకుఁ బ్రసరించుచుండెను. రాత్రియగుచుండ మందమారుత మాభవనముచుట్టు నుండు చెట్లను గదల్చుచు, పండుటాకులను రాల్చుచు, నెండి భూమిపైఁబడినవానిచే మర మరధ్వనులు చేయించుచుండెను. పక్షులెల్ల తమతమ నెలవులు చేరినవి. గబ్బిలములు మాత్రము తమకు బ్రియమగు రాత్రి యేతెంచుటకు సంతసించి రెక్కలఁ దటఁదటఁగొట్టుచు, గిరుప్రన నెగురుచు గవాక్షముల నుండి ప్రసరించు దీపకాంతులకు తప్పుకొనఁ గ్రిందికిని మీదికి నెగురుచుండెను. కుక్కలు "భౌఁయుఁ" యని మొరుఁగుచుండెను.

ఆభవనమునందు సేవకులిటునటు పోవుచు సందడిసేయు చుండిరి. బండి వచ్చి యాగినంతనె సింహద్వారమును దెఱ చిరి. ప్రజ్వలించుచున్న దీపముల కాంతి మెట్లపైనుండి ముం దున్న భూమినెల్ల కాంతివంతముగ జేసెను. ఇంటిలో కలకల మున్నదిగాని కలకల లాడుటలేదు. ఏలాకో యొక విషాద భావము చూపరులకు కలుగుచుండెను. బండివచ్చి యాగినంతనే సందడి యధికమయ్యెను. అంత నొక యరగంటకు మరియొక బండి వచ్చి నిలిచెను. అందుండి నెల్లూరి వైద్యాలయమున డాక్టరగు విజాపురపు రామారావును, అతని చెలియలగు శ్యామలయు దిగి లోనికిఁబోయిరి. ఈమె యొక క్రొర్నాడు పట్టు చీరెను ధరించియుండెను. ఈమెకును శకుంతలకును స్నేహము. చిన్ననాటనుండియు ఎఱిగియుంటనో నిశ్చయముగ ప్రేమమొల కలెత్తుటనో అనిరుద్ధునకు శ్యామలయన్న ప్రాణము. శ్యామల చిరునగవుతో "అన్నయ్యా! నన్ను దిగబెట్టుటకువచ్చితివా, శకుం తలను జూచుటకు వచ్చితివా?" అనెను. రామారావు సిగ్గుతో చిరునవ్వు నవ్వెను. రామారావునకిరువదిరెండేండ్లుండును. అతని చక్కదనమునకు విద్యతోడ్పడి, బంగరునకు తావియబ్బి నట్లుండెను. ఇతడును శకుంతలయు అనిరుద్ధుడును చిన్ననాటి స్నేహితులే, కాని ఇప్పుడు మోమోటమిని కాబోలు ఇత డీయూరిలో డాక్టరైనది మొదలు భవనమునకు వచ్చుట మానెను. తనకు తీరుబడియే లేదనుచుండును. నేడు తండ్రి

కిని తల్లికిని కూడ వీలులేక పోవుటవలన నీవు వచ్చిన గాని పోవ నని శ్యామల పట్టుఁబట్టియుండెను. శకుంతలను చూచి మఱల తనకు దుర్లభమని నిరాసచేసికొన్న ఆస లను, వెఱ్ఱితలంపు లనుకొన్న ఆలోచనలను కలగనుట కీయు కొనవలసివచ్చెను. శ్యామలయు సీతఁడును జిన్ననాటినుండియు జమీందారుగారి పిల్లలతో నాడుకొనుట కలవాటు పడియుం డిరి. వీరితండ్రి రంగయ్యగారును మర్యాదగల సాటికుటుం బములోనివాఁ డగుట జమీందారుగారును ప్రేమించిరి. వీరి కొండొరులయం దనురాగము వృద్ధియైనది. అది క్రమక్రమ ముగ గాఢమగు ప్రేమగ మాఱినది.

రామారావట్లు శ్యామలతో మఱల జమీందారు గారిభవనమున బ్రవేశించినప్పు డేలొకో మునుపటివలెగాక నూతనభావములతో తత్తరఁ జెందెను. అయినను తనహృదయ కల్లోలమును, ఆరాటమును, ముఖమున గనుఁబరుపలేదు. గంభీ రహృదయుఁడై నిలిచెను. రామారావుకు ఒక్కటేతలంపు, ఒక్కటేభావము. శకుంతల! శకుంతల! సర్వమును శకుంతల! భవనపుటందము శకుంతలది. తండ్రియొక్కటీవి శకుంతలది. చంద్రునిచల్లదన మామెదే. ఆగృహలక్ష్మి శకుంతలయే. ఆతని కెల్ల శకుంతలామయము.

కృష్ణారావుగా రిప్పటికి నందగాడె. ఆజానుబాహుఁడు. ఇతడు గంభీరుడు. ఈయనహృదయము నొరులెఱుగజాలరు.

ఈయనయొక్క విశాలఫాలమునకు వంపుదిరిగిన నాసికయు మెలిదిరిగిన మీసములును తోడై, రాజఠీవిని గల్పించు చుండెను. ఈయన శాంతవదనము చూడ దుఃఖము లనుభ వించుచున్నట్లును, ఏకాంతవాసమున కలవాటుపడిన వాని వలెను తోచుచుండెను. ఈయన మౌనమునకు నేకాకిత్వ మునకును కారణము, తన కాపురము సరిగ లేకపోవుట యని జనులు గుసగుసలాడిరి. ఎట్లైన నేమి? ఇతరుల కీయనను గూర్చి యేసంగతియు సరిగఁ దెలియదు. ఇంట నుండువారు నీయనగుట్టును బాగుగఁ దెలిసికొనలే రని వీరియింట చిర కాలమునుండి సేవకుఁడుగనున్న వెంకయ్య యనుచుండును.

ఈయన ద్వితీయకళత్రిమగు సుందరమ్మగారు ప్రస్తు తపు జమీందారిణి. ఆయనకన్న నీమె రూపసికాదు. ఆయన యంతపొడ వుండును. మంచివస్తులను నగలను ధరించుచుం డును. రామారావీమెను వింతగఁ జూడ నారంభించెను. ఏల నన నీమె యమితమగు వ్యయములనుగూర్చి నెల్లూరుపురమున గల వార్తలను పలుమరు వినియుండుటచే నీమె యిట్లగుటకు కారణ మేమని వింతపడుచుండెను. ఈమె యిప్పుడెంతో విలువ దగు జిలుగువలువను గట్టియుండెను. వింతనగలను ధరియించి యుండెను. సంసారియగు జమీం దారిణికి సంతత వేషధారణ మేల? నని రామారావనుమాన పడఁజొచ్చెను. ఈమె సుకుమారి. సాధారణ స్త్రీలకన్న సొగసు

కన్నె. దక్షిణదేశపు పోలికలెన్నో కనబడుచుండును. మన తెనుఁగు దేశపువారికన్న నెక్కుడు మాటకారి. సింగారమున నేమి, నడకతీరునందేమి, స్వభావమునందేమి, ఈమె యొక్కొక్క నిముసమున కొక్కొక్కవింతను చూపుచుండును. మోమున నందమునకు మెఱుగుపెట్టుటకు కాబోలు మోమున కిప్పుడు పౌడరు నలదుకొనియుండెను. ఈమె కాటుకకన్నులు మిలమిల లాడుచు వింతగనుండెను. ఈకన్నులు విశాలములై రమణీయములయ్యు చంచలములు. సోయగములగు కన్నులీమధ్య మఱింత చంచలములయ్యె నని రామారావుకూడ తలంచెను. ఈమె యెవ్వరు? యెక్కడిదని మొదట సేవకుల నూరిలోని వారు ప్రశ్నించిరికాని తెలియలేదయ్యెను. కృష్ణారావుగారికీమె భార్యగాదనియు, నుంపుడుకత్తె యనియు జనులు గుసగుసలాడిరి. అయినను పలుమరు చెన్నపురికి పోవుటయు నిచ్చట నీదుర్వ్యయముతప్ప వేరే యవగుణము లీమెయందు కనబడవు. ఈమె ధర్మగుణమంతగ కలదికాదనివాదుక. అయినను జమీందారిణియగుట నెల్లరు గౌరవించుచుండిరి.

శకుంతల సుందరిమాత్రమేగాక బుద్ధిమంతురాలు. రవివర్మ చిత్రించిన శకుంతలచిత్తరువు పోలిక యనిన కొంచెము ఇంచుమించుగ నీమెను సరిగ వర్ణించితి మనవచ్చును. ఈమెయంత పొడగరియు కాదు, పొట్టియుకాదు. ఈమె వంకర వెండ్రుక లతిమృదువులై వెనుకకు జడవేయఁబడి యుండెను.

ఒక సాధారణమగు వస్త్రమును గట్టుకొనియుండెను. పెండ్లి యీడు వచ్చినదికాని, సింగారము, సంరక్షణమును సరిగ లేదు. అయిన నీమె సహజసౌందర్యమే యామెకు చాలును. నవతీతల్లివలె మెఱుగులును పొడులును నగలు నవసరము లేదు. ఆమె దేహచ్ఛాయ బంగారువలె నుండి కోమలమై యుండెను. ఆమెమందహాసపుసొరును జూచి భూమియం దిట్టి మనోహరమగు మందహాస మింక నే మోమున జూడఁబో నని రామారావనుకొనెను. హాస్యచ్ఛాయయు నీలాపనిందయు నీశకుంతలనుగూడ నావరించి యింకను పెండ్లిమాటలైన వచ్చుటలేదు. ఈ నీలాపనింద యానిరుద్ధు నించుకయైన నాచ్ఛాదిపలేదో యను నట్లు లనిరుద్ధుఁ డుత్సాహముగ నవ్వుచుండెను. ఇతఁ డెల్లప్పుడును చురుకుగ నిటునటు తిరుగుచు నలుగురితోడను ప్రీతితో సంభాషించుచు కళావంతమగు మోముతో మసలుచుండును. ఆ చుట్టుపక్కల నుండువారికెల్లర కితఁడు తలలోనాలుకవలె నుండును. ఎవ్వరను బోనాడఁడు. ఇతఁ డెల్లరకు నిష్టుడే. ప్రజ్ఞ తవచ్చుచున్నబాలుఁ డగుటవలన నితని బాధపెట్టిన తనగౌరవము నిలుపఁడనిమో, ఇక శీఘ్రముగ జమీందారీలెఖ్ఖలను చూచుకొందు నని పోరాడుననియో జమీందారిణికి అనిరుద్ధుఁ డన్న కొంచెము భయముగనే యుండెను. అయినను నవతితల్లు లెల్లరవలెనే యీమెకును అనిరుద్ధుఁడన్నను శకుంతల యన్న ననిష్టము. తనకు బిడ్డలులేకపోవుటవలన కొంచెము

సహించుచుండెనుగాని లేనిచో వీరిక పుట్టగతులులేకుండ బాధలు పెట్టియుండు నని యూరిలోనివా రనుకొనుచుండిరి. రామారావన్నచో ననిరుద్ధునకు ప్రాణము. అనిరుద్ధుడు చెన్నపురిలో జమీందారుబిడ్డల కేర్పడిన న్యూయింగ్టన్ కళాశాలలో చదువుచుండెను. అనిరుద్ధుని వేషభాషలు నేటినాగరకుల సాంప్రదాయము ననుసరించి ఆంగ్లపద్ధతిగ నుండెను.

ఇంతలో నారాయణరావిచ్చటికి ప్రత్యక్షమయ్యెను. ఈతడు కృష్ణారావుగారికి మేనత్తకొడుకు. ముప్పదియైదు వత్సరములుండును గాని కొంచెము వయసుమీరినవానివలె కనబడును. ఈయనకు విద్యావయోరూపములు కలవు కాని కొందఱీయన స్నేహపాత్రులుగా నుందురు. నాల్గేండ్లక్రిందట ఇతనిభార్య చనిపోయినది గాని మరల పెండ్లాడ లేదు. ఇతడు ధనవంతుడు. గొప్పకుటుంబములలోనివాడు. నవాబుపేటలో నొక సుందరహర్మ్యమున వసించుచుండును. ఆనాడు అనిరుద్ధుని పుట్టినదినము; వీరెల్లరు భోజనమునకు వచ్చియుండిరి.

"సుందరీ! సుందరీ!!" అని యొకదాసి తనయమ్మగారి నీప్రకారము పిలుచుట వింతకదా? అయినను జమీన్దారిణిగారి చెలికత్తె మందారవల్లి యనునది చనవునఁగాఁబోలు నిట్లు లామెను అతురముతో బలుకరించు చుండెను. మందారముందుగ నెవ్వరును లేరుకదా యని తొంగిచూచి లోన బ్రవేశించుచు నిట్లు పిలిచెను. జమీన్దారిణియు నిట్టి ముద్దుపేరి

తోఁ బిలువఁబడుట కేమియు ననుకొనక, లేచి ఏమే! యనుచు మందారతో తనసొంతగదిలోనికి పోయి తలుపు వేసి "ఏమే సమాచారము?" అనెను. మందార "ఏమున్నది? ఒకదయ్యము కనఁబడినది మనదొడ్డిలో!" సుందరికి మోము విపర్ణమయ్యెను. మెఱుఁగులనడుము మోము ముడుతలు పడెను. ఒడలు కంపించెను. తటాలున మందారను పట్టుకొని యానుకొని నిలచి, "అతడు కాడుకదా!" మందార "కాడు. కాడు. రాధాదేవి" సుందరి 'ఏమీ! ఆమెయేనా!!' అని తన కత్యంతప్రియురాలగు దాసిమోము నిదానించి చూచెను. మందార యన్నివిధముల గొప్పయింటి పరిచారికయని తెలియఁ జేయుచుండును. ఈమెకూడ జమీందారిణియంతయె త్తుండును. కొంచెము పరీక్షించి చూచినచో ఆమెపోలికయే. ఆవంక వెండ్రుకలే. ఆసోగకన్నులే. అనుదురే! మెఱుఁగులు నగలుమాత్రము లేవు. ఈమెయు నిప్పుడు యజమానురాలి వలెనే వెఱ్ఱిచూపుఁ జూచుచుండెను. సుందరమ్మ క్రమక్రమముగ తెప్పిరిల్లి, "కాదు. నీవు పొరబాటు పడుచున్నావు. కలగనుచున్నావేమో? కనులు నులిమికొనుము. తిన్నగ చెప్పుము. ఆమె యెట్లు వచ్చును? పరకములో లేదా? చచ్చి బ్రదుకులే? వట్టిమాట." మందార కొంచెము తడబడెను కాని మఱల మనసు కుదుటఁ బెట్టుకొని, "ఏమో నాకు తెలియదు. అచ్చముగ నామెయే. సందియము లేదు." అని గది నలుమూలలు చూచి, "ఉత్తరపుగదివంక వీధిగుమ్మమునుండి నేను

చూడగా ఆమె గదిలోనికి తొంగిచూచుచుండెను. ఆమోము బాగుగ చూడలేదుగాని ఆవిగ్రహమును చూచితిని. నేనొక్క మారు చూచిన మఱచిపోను. అచ్చముగ నామెయే. సాధారణవస్త్రముల గట్టినది. చూచినమటుకు మోము మారిపోయి యున్నది. ఎంతో ముదుసలి యైపోయిన ట్టున్నది. అయిన నామె రాధయే. ఆయందము మాఱిపోలేదు" అనెను.

సుందరి వెకవెక నవ్వుచు "ఏ మంటివి? అందమా! అట్లయిన ఆమె కానేరదు. 'ఈమెను కృష్ణారావుగారేమి చూచుకొని పెండ్లియాడినా' డనెదువా రట. ఇదియుగాక ఆమె భూలోకనరకమున బడియున్నది. శిక్షితులు పరారులై పారి పోవు టరుదు. విడువబడుట మిధ్య. నీవు పొరపాటు పడుచు న్నావు. భ్రమ జెందుచున్నావు. పోయి పండుకొనుము. నీవు చూచిన స్త్రీ యెవ్వతెయో యిచ్చటి మనసేవకుల కొఱకు వచ్చియుండును. ఇటువంటి యనవసరములగు పిచ్చిభయము లను నేను పెట్టుకొన దలచలేదు. మన కీవఱకుగల భయములే చాలును". అని యున్న రనుచు, మేజాపై గడియారమును చూచి, "అబ్బో, చాల నాలస్యమైనదే! వారముదినములనుండి జాబులేదు. కొంప ముంచడుగదా!" మందార "ఏమో" యని నిట్టూర్పు నూర్చెను.

# ౪ లుగవ ప్రకరణము.

## ఋణదాత అన్నప్పగారు

హిందూదేశమునం దూరూరను, పల్లెలయందు, పట్టణ
ములందును రూప్యములసంచులకు మూతుల బిగించుకొనుచు
లెఖ్ఖల పుస్తకములను జాగ్రత్తగ జూచికొనుచు పుచ్చుకొను
వారి కిచ్చుచు, ఇచ్చువారినుండి మరల పుచ్చుకొనుచు, నూ
టికి నూరువంతున లాభములు దీయుచు, కష్టమునకు, గడపల
నెక్కుచు, దిగుచు, న్యాయస్థానములచుట్టు దిరుగుచు,
రాత్రింబవళ్లు ధనపూజలతో వడ్డీబేరములతో కాలము గడపు
ధనలుబ్ధులు కుబేరకుటుంబములోనివారు చాలమంది కలరు.
ఆంధ్రదేశమందు కూడ నిది యొకవృత్తి. ఇది ధనికులకు
నీచమైనదిగ కనబడును. అయినను అవసరము వచ్చినప్పుడు
అత్యుత్తమ మైనదిగనే తోచును. దూరమునుండి ఛీ యను
వాడే దగ్గరకు వచ్చి చేజాచును. ఋణదాత మిగులఘనుడు.
ధనము నిచ్చునప్పు డెంతో యాదరమున మాటాడును.
పుచ్చుకొనునప్పుడు దమ్మిడీలతో గూబలు 'నులిమి, ఇల్లు
దులిపి, రచ్చ కీడ్చి గ్రహించును. భర్తను జైలునకంపి
భార్య పుస్తెను దెంపి బిడ్డల వత్తులు లాగిన ఋణదాతలును,
సొమ్మిచ్చువరకు నుపవాసము లుండి గృహస్థులను బాధిం
చిన ఋణదాతలును గూడ కలరు. ఋణదాత యచిరకాలము

ననే ధనికు డగును. ధనికుడగు ఋణదాతలలో అంగవస్త్ర
మునే గట్టుకొని మామిడాడ చెంబుతో నీరు దాగ్రుచు
చారునీళ్లే కతుకుచు తమ దారిద్ర్యమునకు వగచువారు చాల
మంది కలరు. కొందరుమాత్రము తమ పాత్రస్థితిని మరచి
గౌరవ మాసించి సుఖముల బడయగోరుదురు. ఋణదాతల
పిల్లలుమాత్రము సకలగుణాభిరాములుగ నుందురు. గొప్ప
గొప్ప మేడలుగట్టిన వారిలో, జమీందారులలో, రూపవతుల
పెండ్లాడినవారిలో నెందరు ఋణదాతల కుటుంబమునకు
చెందినవారో యూహింపుడు.

ఆంధ్రదేశమున కృష్ణా గోదావరీ మధ్యదేశమున నన్న
ప్ప యనుపేరు ఋణదాతలకు ప్రసిద్ధి జెందినది. కృష్ణా
పినాకినీమధ్యదేశమున కెల్ల నొక్కడే యన్నప్పగారు.
అయనయే మనకథలో ప్రధాన పురుషుడు. మన యన్నప్ప
గారు మొదట కోమటి గుమాస్త. కోమటి దివాలా
తీయగా కొన్నాళ్ళు కిత డొక ప్లీడరుదగ్గర కుదిరెను. ఆప్లీ
డరుపైన నేదో క్రిమినలు కేసు రాగా నితడు స్వతంత్రుడై
వడ్డీవ్యాపారము మొదలిడెను. పెట్టుబడి బెట్టుట కితనికి
సొమ్మెచ్చటనుండి వచ్చిన దని కొందరు వితర్కించిరి.
గాని ఇత డచిరకాలముననే వడ్డీవ్యాపారమున సుప్రసిద్ధుడై
మార్వాడీలను తల దన్నెను. రు. 1-9-6 సాలునరి కాంపౌండు
వడ్డీ యితనిదగ్గర సాధారణపు మరతు. ఇతని పత్రములందలి

విషమవిషమరతుల జూచి బీ. సీ. నాటి ప్లీడర్లుకూడా ముక్కులపై వ్రేలిడికొనువారు. ఇతనిదగ్గర బదులు పుచ్చుకొనువాడు బయటపడు టరుదు. ఇతని బుద్ధికౌశలము, పన్నాగములు నిరుపమానములు. దావాలు వేయుటలో నితని నేర్పును జూచి మునసబ్బులాశ్చర్యపడుచుందురు. నెల్లూరు జిల్లాలో అన్నప్పగారి పేరు మోగుచుండెను. ఇతడు మెల్లగ నొక మేడ గట్టెను. ఇతర ఋణదాతలవలెగాక గౌరవముల నాసింపసాగెను. మునిసిపలు కవున్సిలరుపదవి, బెంచి మేజస్ట్రేటుపదవియు సంపాదించెను. రావుసాహెబు బిరుదుకు దోహదప్రక్రియలు సలుపుచుండెను. అన్నియు బాగున్నవిగాని జమీందారుగారి వ్యవహారములు తనచేతఁ బడలేదను చింతమాత్ర మితనికి గలదు. రెండేండ్లక్రిందట నదికూడ ఫలించెను. ఇది యీతనికి మహోపకార కారణ మయ్యెను. ఇదియే జమీందారికి మహోపద్రవ కారణమయ్యెను. ఈతని కృత్రిమములతో కల్పనలతో - వ్యూహములతో - జమీందారి యప్పులపాలై పోవజొచ్చెను. ఈతఁడీ జమీందారినిక్రింద బెట్టి మీఁద పెట్టి చిక్కులలో దింపివైచెను. తాకట్టుపై తాకట్టు బెట్టి మఱల విడదీయలేని చిక్కులలో బడవైచి తనకు పూర్తిగ లోబరుచుకొనెను. అన్నప్పగారికి స్వలాభముకన్నను పదిమందిలో గొప్పవాడని పించుకొనవలెనను నాస యధికముగ నివ్వఁ డుండెను. గొప్పవారిలో మెలగుటకెట్టులైన యదనుచిక్కిన బాగుండు నని

యయిన్ని [ప్పాళి]
~~తమాతటా లాగు~~చుండెను. తానుకూడ జమీందారుగారి కులపు వాడ నని గర్వపడుచుండును. ఈయనకు నలుబదివత్సరము లున్నవి. దృఢమైన కాయశరీరమున కీతడు పరిపరివిధముల సంరక్షణము చేసికొనుచుండును. మంచిసబ్బులతో రుద్దుకొని, వాసననూనెల రాచుకొని, చలువవస్త్రముల ధరించి దిద్దుకొని త్రిప్పుకొనుచు నడచును. ధనార్జనమే తనకు ప్రాణ సమానమగు పనియయ్యె గొప్పతనము తెచ్చిపెట్టుకొన నిప్పుడెన్నిపాటులైన పడుచుండెను. నాల్గురూప్యములు గలగల మని సంతనే ఎంతవానికైన నీడంబాచార మెక్కు డగునుకదా! తన పేరింపుక పూర్వకాలపుదిగను మోటుగ నున్న దని యెంచి అట్టినామకరణముచేసిన తల్లిదండ్రులను నాల్గు తిట్టి, ముందు శ్రీయు వెనుక రావును జేర్చుకొనప్రయత్నించి కొంతకాలము చూచెనుకాని అదిసాగక విసిగి తుద కీప్రయత్నము మానెను.

క్రిందటిప్రకరణములోని సంగతులు జరిగిన నాలుగు రోజులకు అన్నప్పగారు ప్రాతఃకాలమున కాకితముల జూచుకొనుచు, తన.కెదుటనే వీధిలోనిసంగతులెల్ల ప్రతిబింబితములగునట్టు కట్టినయద్దమువైపున కన్నెత్తిచూడ జమీందారు గారిజవాను వచ్చుట కనఁబడెను. అంత అన్నప్పగారు తత్క్షణమే లేచి మీసములను సవరించుకొనిరి. మఱల ధన మావశ్యకమైనదనియు, మఱల నీదినము జమీందారిణిగారు తన కొరకు కబురంపుననియునత డెరుగును. అట్లేజరిగినది. అన్నప్పగా

రుభవనమునకు పోయిరి. జమీందారిణి వేచియుండెను. అన్న
ప్పగారూ! ఈదినము నాకొక వేయిరూపాయలు కావలెననెను.
ఆయన తన విషపూరితమగు దృష్టి నామెపైన బఱపిరి. ఈ
జిత్తులమారి, ఈపయోముఖ విషకుంభము మెల్లన తన
నోరు దెరచి 'దానికేమి గాని నిన్న- సింహళమునుండి
మీ కొకలేఖ వచ్చినదికదా? మీ రాజాబు నెవరువ్రాసినా
రండీ!' అని మెల్లగ నిదానముగ చూచుచు ననెను. జమీం
దారిణి నిర్ఘాంతపడెను. కంపముఁ జెందెను. మోము వెల్లదన
ము చెందెను. ఇంతలో తెలివిఁదెచ్చుకొని ఆలేఖనుగూర్చి
యెంత సరుకుచేయని దానివలె నేదో యసంపూర్ణమగు నతృ
ప్తికరమగు ప్రత్యుత్తరము నొసగెను. ఆమాట వదలి యనే
కములగు నితరవిషయములగూర్చి మాటాడుకొనిరి. దీనితో
మనకు సంబంధము లేదు. అయిన నీసందర్శనమువలన నొక
ఫలము చేకూరినది. జమీందారిణిగారు అన్నప్పగారి వ్యూ
హములో పడిరి. జమీందారిణిగా రన్నప్పగారిని గారవించి
భోజనమునకు బిలువవలసి వచ్చెను. ఆయన నొక చిన్న ఋణ
దాత యని త్రోసిపుచ్చ వీలులేదు. ఇప్పటికే యీమె యా
యనదగ్గర ననేకవేలప్పుపుచ్చుకొని యుండెను. అవి యెచ్చ
టికి బోవుచుండెనో, జమీందారి రాబడి యెక్కడ పడిపోవు
చుండెనో, అన్నప్పగారి తనఖాలు ఋణపత్రములు, వడ్డీలు,
అసళ్ళు పెరుగుటయేకాని తీరుటయే లేదు. నిజముగ వడ్డీలపై

వడ్డీలు చేర్చి జమీన్దారీ తాకట్టు అన్నప్పగారికి వాకట్టయిపోవ సిద్ధముగ నుండెను. పేరునకు కృష్ణారావుగారు జమీన్దారు కాని, నిజముగ నేనే జమీన్దారీ కధికారి నని అన్నప్ప గ్రహించుకొనెను. ఈసంగతి యెవ్వరికిని తెలియదు. జమీన్దారిణి కొక్కరితకు మాత్రమే తెలియును. ఒకవేళ తానే యధికారి యైనను వారి కుటుంబముయొక్క గౌరవమును సంపాదించుటెట్లా యని యాతఁ డింతవఱకుఁ బాధపడుచుండెను. 'భోజన ప్రతిభోజనమైన లేదే! నే నంత నీచుఁడనా? ఏమి దురంత'మని మండిపడుచుండెను. ఇప్పటికి తనకోరిక నెరవేరిన దని తృప్తితో లేచిరి. అన్నప్పగారు కృతార్థులైరి. ఇంటికిపోయి మఱల నొకమారు తమ ప్రతిబింబము నద్దములో జూచుకొనిరి.

---

# అయిదవ ప్రకరణము.

## —♦ అన్నప్పగారి చౌరవ ♦—

"మందారా! చాలును. ఇఁక జడను నేను చుట్టుకొనగలను. నీ కేమయినఁ బనియుండును. పోయిరమ్ము" అని యద్దముదగ్గర నిలిచి శకుంతల పలికెను. శకుంతల యిప్పుడు తా నాదినము వైద్యాలయమున సంతసముతో కడపిన యారగంటనుగూర్చి తలంచుకొనుచుండెను. ఈమె బాధపడుచున్న

దురదృష్టవంతులగు రోగులననుమ కొంతకాల మాగి వారలతో మంచిమాటాడి తాను తెచ్చిన ఫలములనిచ్చి తన యౌదార్య గుణమును, కరుణయు దెలిపెను. వారలదురవస్థ యీమె జాలి గుండెల గరగించెను. రామారావు పరోపకారపరాయణుం డగు నుత్తముండని యీమెకు తోచెను. అల్పోపకార పారీణయు నార్తజనరక్షణాశీలయు నగు సుశీలయు నీమెకు గౌరవ నీయయయ్యెను. ఆమె యోపిక, దయార్ద్రహృదయము, చికిత్స చేయునేర్పు, ఉపచారములు, మందుల నిచ్చుట చూచి శకుంతల ఆశ్చర్య పడెను. ఆమెయం దొకవిధమగు గౌరవ ముదయించెను. ఈమె తనతో మాటాడు నప్పు డేలనో గద్దికయయ్యె నని శకుంతల తలచెను. ఈభావములలో, నాలోచనలలో, రామారా వెక్కుడుకాల మాక్రమించు కొనెను. అతనిని చూచి శకుంతల సతతము తలంచు కొనుచుండెను. అతని సుందరవిగ్రహ మామెకన్నులకుఁ గట్టినట్టు లున్నది. అతని నగు మోము, శ్రావ్యమగు కంఠస్వరము నీమె కిప్పుడును గోచరించుచున్నవి. అత డీమెతో వైద్యశాలయందు మాటాడుచున్నప్పు డత డీమె నెంతో ప్రేమపురస్సరముగ జూచుటయు, తా నాతనివంకకు చూచినప్పు డాతనిచూపులు నేలను వ్రాలుటీమె గుర్తించెను. ఇవి జ్ఞాపకము రాగనే యీమెకు లజ్జయుదయించెను. తనయందాతని కనురాగము లేకపోలే దని యీమెకు తోచగ నొడలు పులకలెత్తెను. తా నాతని బ్రేమించుచున్నదా?

ఆసంగతి తనకు తెలియదు. ఈప్రశ్నమున కామె ప్రత్యుత్తర మీయఁజాలదుకాని, ఏమనుజుని జూచిన నుదయింపని భావములు, ఆనందము, పులక లాతని జూచిన కలుగుచుండుట మాత్రము నిక్కము. అతనిని చూచుట మనసు. అతనికి దగ్గరగనుండు టానందదాయకము. అతనితో మాటాడుట సంతోషకరము. ఆమెకొన్నిక్షణములు లాగదిలో గవాక్షము దగ్గరగనిలిచి యేమో యోజించుచుండెను. ఎల్లప్పుడు నామెసగుమోమున గానవగు దీర్ఘాలోచనము ను దైన్యమునీదినము మఱియు బాగుగఁ గనపడుచుండెను. పాప మీయామె ముగ్ధయగుటవలన సవతితల్లి పెట్టుబాధలకు, అను మాటలకు నెంతో లోలోన దుఃఖించుచు గృశించుచుండును. చిన్నపొరపాటునకు గూడ ఆమె గట్టిగా మందలించుచుండును. ఆదినము శకుంతల పరియాచకముగ నీగారెల్లప్పు డేదో జాబుకొఱకె దురు చూచుచునే యుందురనగా సవతితల్లి కోపించి కొట్టినది. ఈ మాటకే యిట్లేలకొట్టెనా యని శకుంతల వితర్కించుచుండెను. అయిన నామె కొట్టెనందుల కీమె కంతకష్టముగ లేదు. "ఆతల్లి పోలిక ఎక్కడికిపోవు" నన్న యెత్తిపొడుపుమాటల కర్థ మేమి? ఇది యీయామెనెంతేను బాధించుచుండెను. రెండువత్సరములనుండి తనతల్లిచారిత్రమును గూర్చి శకుంతల యనుమానించుచునే యుండినది. ఆమెనుగూర్చి యింట నెవ్వ రేల మాటాడరు? మాతండ్రియైన నేల పలుకఁడు? ఇచ్చటికి వచ్చినవారు నొక్కమారైన

# అయిదవ ప్రకరణము

నామెపేరైన నేల నుచ్చరింపరు? ఆమె గుణాతిశయమును గూర్చి కాని, రూపమును గూర్చికాని మాటాడ రేమి? "తల్లి పోలిక" యన నేమని యీమె వితర్కించుచుండెను. ఈ అనుమానమును సందేహమును బోగొట్ట నింట ననిరుద్ధుఁడుకూడ లేకుంట నీయామె దుఃఖమును వృద్ధిచేసెను. ఈ తలంపులు కలుగుచుండగ వెంకయ్య యీమెకు కనబడెను. అంతట నీమె "వెంకయ్యా! నీవు మాయమ్మ నెఱుఁగుదువు కదా? ఆమె యుండునప్పుడు నీ విచ్చట నే యుంటివికదా, ఆమె చారిత్రమెట్టిది? నాకు చెప్పుము" అట్లు ప్రశ్నింప వెంకయ్య తత్తరపడెను. మోము వెల్లనయ్యెను. అతడు నీడలో ప్రక్కగ నిలచియుండను కాని లేనిచో నాతని భయాశ్చర్యములు, వివర్ణవదనము, నామె కనుమానము కలిగించి యుండెడివి. అతఁ డింకను ప్రత్యుత్తర మివ్వకుంటఁ జూచి యీమె మఱల బిగ్గరగ 'ఏమి వెంకయ్యా చెప్పవేమి? ఆమె మంచిమనిషి కాదా!' వెంకయ్య:— "అమ్మా! ఆమె మంచివారు కాకేమి? ఆమె చాలామంచివారు. ఆమెవంటివారు పెక్కండుండరు. ఆమె సాక్షాత్తు దేవతాస్త్రీవంటిది" అనెను. అతని కంఠము మఱింత గద్గదిక మయ్యెను. అతఁ డింక నేమో యనుచు మెల్లగ జారెను. శకుంతల యాతనివింత ప్రవర్తన కచ్చెరువొందెను. గాని యామెబాధ కొంత తగ్గెను. అన్నప్పగారు భవనమునకు పెందలకడనే వచ్చిరి. వేళయైనను కాకపోయినను, ఎవరైన

వచ్చినను రాకపోయినను అన్నప్పగారుమాత్రము ముందుగనే వత్తురు. ఆయన జాగ్రత్తగ నబ్బురుద్దుకొని, చలువవస్త్రము లను ధరించి, మెఱుగు రాచికొని, అద్దెబండియందు కిఱ్ఱు జోడుతో, టకటక జమీందారీభవనమునకు దయచేయుదురు. ఇతడు జమీందారుగారికడప త్రొక్కగలిగితినిగదా యనియుబ్బు చుండును. జమీందారిణియు, మెఱుగులతోను - సింగారము తోను - నగలతోను కూర్చుండియుండును. ఆమె కన్నప్పగారి న్న రోతయే, కాని యంతఃపుర నతనిధనమును లేక జరుగదు. మఱియు నాతనియిష్టప్రకారము ప్రవర్తింపవలసి వచ్చినది. అందువలన ఎట్టకేల కాతని నాహ్వానించెను. ఈరహస్య మితరుల కెవ్వరి కిని తెలియదు. ఇదియే యీమొహమునకు, తత్తరమును కార ణము. అన్నప్పగారి ప్రవర్తనమును చేష్టలు నసహ్యాకరముగ నుండెను. అన్నప్పగారికికూడ స్థిమితము లేదు. ఆయన ధరించిన దుస్తులు, వేసినవేషము, చేయుచున్న అభినయము, ఆడు మాటలును సహజములుకాక తెచ్చిపెట్టుకొన్న వని విదిత మయ్యెను. నారాయణరావుయొక్క ఠీవి, గౌరవమును జూచి, అన్నప్ప రొసరొసలాడెను. ఈతని కాయనను చూడ నసూ యగ నుండెను. నారాయణరావు కొంచెమందముగ నుండును. అన్నప్పగా రీతడు నాకన్న నేవిధముగ మిన్న? ఇతఁడు నాకన్న నేవిధముగ గొప్పవాఁడు, గౌరవపాత్రుఁడు? అనుకొనిరి. నారాయణరావుకుటుంబము గొప్పది. వారికి తగుమాత్రముగ

మంచిస్థితిగతు లున్నమాట నిజమే. నాకు నామాత్రము కలవు. అతనిపాటియందము నాకును గలదు. అతనికి లోపములు లేక పోలేదు. అతడు 'జులాయి' యని వాడుక. అతనిముందు నేను ఘనుడను కానా! మంచివాడను కానా? అతనివలె నన్నేల చూడరు?—అనుకొనెను. ఇంతలో కృష్ణారావుగారు గది లోనికివచ్చి అప్పుడచటికి వచ్చిన నారాయణరావు 'ఏమోయి సమాచారములు?' అని పలుకరించి, అన్నప్పగారిని తేరి పార చూచి యూరకొని మఱల మౌనముతో గంభీరముగ కూర్చుండియుండిరి. నారాయణరావు రాక శ్రీ అన్నప్పరావుగారి పేరున "శ్రీ" లాగివైచినది. జమీందారుగారిరాక "రావు"నుగూడ తుడిచివైచెను. అయిన నీయన్నప్ప తనవిషదృష్టులతో జమీందారుగారిని చూచి లోలోన గేలిసేయుచుండెను. నన్నింతనిర్లక్ష్యముగ నీతఁడేల చూడవలెను? ప్రస్తుత మీజమీందారీ నిక్కుల నిక్కుచున్న యీ తనిజుట్టు ఋణపత్రములరూపమున నాచేత లేదా? వాస్తవముగ నీజమీందారీకి నేనధికారిని గానా?—ఈయాలోచనలతో తల పంకించుచు, అన్నప్పగారు తనకుర్చీలో కూర్చుండిమర్యాదకొఱకొకమారు జమీందారుగారికి నమస్కరించిరి. తనదృష్టిని దృష్టితో నాభవనమునందలి కుర్చీలు మొదలగు వస్తువులపై బరపుచు వాపములను లెక్కపెట్టుచు కూర్చుండిరి. ఈప్రవర్తనము జమీందారిని కసహ్య

కరముగ నుండెను. కాని యేమియు ననలేకపోయెను. కొఱవి చే తలఁ గోకికొనినట్లు లయ్యెను. నారాయణరావును నితని సేవగించుకొనెను. ఈతని వెంగలితనము చూచి సేవకులుగూడ విసిగికొన సాగిరి. వెంకయ్య యీతనిని జూచి యలుసుగ ప్రవర్తించెను. అతని నిర్లక్ష్యభావమును చూచి యొక చెంపపెట్టు పెట్టవలె నని యన్నప్పగారికి తోచెను గాని యిది దుస్సాధ్యమని యూరకొనిరి. ఆవృద్ధుని మోమునందు భయభక్తులే కానవచ్చెను. కొంతసేపటికి కృష్ణారావుగారు తమ యేకాంతగృహమునకు పోయిరి. ఆమందిరమం దాయన దీర్ఘాలోచనమున నుండి యేదో వ్రాయుచుండును. ఆయన సాధారణముగ నీవలకు రానేరాడు. కొన్ని వత్సరములనుండి యీ వెఱ్ఱి యీయన కధికమై పోయినది. ఎప్పుడు నిలువెత్తు పుస్తకములు కాగితములు కలముల మధ్య కూర్చుండి చదువుచు వ్రాయుచుఁ గాలక్షేపము చేయుచుండును. ఆయనకు నాథగవంతునకు మాత్రమే ఆయనయాలోచనలు, దుఃఖములు తెలియును, ఇందు వానినాయన మఱచుచుండును. ఇప్పుడాయన పూర్వపుమానిసియే కాడు. సంతోషముగ తిరుగుచు చెన్నపురిలో వేడుకలయందు పొద్దు పుచ్చు నాత డిప్పుడు కృంగి, మౌనముతో నేకాంతవాసము సేయ దొడంగెను. కృష్ణారావుగా రట్లు పోవగా అన్నప్పగా రమ్మయ్యా యని యుస్సు రని ఇంచుక ధైర్యము దెచ్చుకొని ఠీవి నభినయించిరి. శకుంతలతో

నారాయణరావు చనవుగ మాటాడుట చూచి అన్నప్ప యసూయపడెను. నారాయణరావు చిరునవ్వుతో శకుంతలతో పోట అన్నప్పగారికి యొడలు మండునట్లు చేసెను. అన్నప్పగారు కోపముతో వారివంక చూచిరి. అతని కీయింట నెల్లరపైనను కోపమే. ఎల్లరమీద నసూయయే. "ఈమె కీతడా వరుడు?" అని అన్నప్ప యనుకొని మటమటలాడెను. పళ్లు పటపట కొరకెను. అతనికన్న నేను చిన్నవాడనుగానా! నేను తగనా యని తనలో ననుకొనుచుండెను. వా రాతోటలోనికి వెడలిపోవునంతవఱకు నచ్చటనే నిలిచి, తరువాత - పోనిమ్ము. జమీందారిణితో సంగతులు మాటాడెదను గాక-యని యామె యుండు చోటునకు పోయెను. ఆమెయు నచ్చటికి వచ్చి "అన్నప్పగారూ! నాకు రేపు పొద్దుననే ఒక వేయిరూపాయిలు కావలసి యుండును" అని ఋణము కావలసినవారు ఋణదాతల నడుగునటులగాక, అట్లడుగుచే యాతనిని గౌరవించుట యనునట్లు అడిగెను. ఆట్లామె సగర్వముగ నడుగగా అన్నప్పగారు కనుబొమ లెగురవైచి పెదవి విఱిచి తలత్రిప్పి, 'అబ్బో అంత పెద్దమొత్త మింతస్వల్పకాలములో నే ట్లీయంగలను? మఱియు జమలేకయే నే నెంతకాల మియ్యగలను?' అనిరి.

జమీందారిణి కనుబొమలెత్తి "ఏమీ? తగిన యాస్తి మీదగ్గర తనఖా లేదా? ఆతనఖా లేమి చేసితిరి? ఇక నేమి కావలెను? జమీన్ దారీతనఖా కన్నానా?" అన్నప్పగారు చిరునవ్వు

తో ఆమెను నిదానించి చూడగా నామె గర్వమును గంభీర రూపమును పోయి మోము కళావిహీన మయ్యెను. అన్నప్ప:—
"అమ్మా! నాకీ శషభిషలు పనికిరావు. తనఖాతనఖాయన్నచో మీపాత్రియప్పుల దీర్చుకొనుట కని పుచ్చుకొనిన 80,000 రూపాయిలుగాక మూడువత్సరములనుండి మీ రనుదినమును అనుక్షణమును లెక్కలేక పుచ్చుకొనుచుండిన మొత్తము లసలుఫాయిదాలతో చేర్చి యిప్పుడు క్రమక్రమముగ పెరిగి పోవుచున్నది. మీరు జమ నే మైన నిచ్చినచో కదా అప్పుతగ్గుట? అట్టిది లేదుసరికదా ఇంకను మీ రిమ్మనుచున్నారు. ఇక మీ పాత్రతనఖాలు చాలవు. నేక నివ్వలేను. కానిమీరు నాకొక ఉపకారము చేసినచో నేను మీకుఁ గావలసిన మొత్తముల నెప్పటికి నిచ్చుచుందును." జమీన్దారిణి యాశ్చర్యముతో కన్నులు విప్పిచూచుచుండెను. తుద కామె 'అయితే ఏమి చేయుమనెదరు?' అనెను. అన్నప్పగారు—'చేయుదునన్నచో చెప్పెదను.' జమీన్దారిణి—"చెప్పుడు, చేయగలనేమో చూచెదను."
అన్నప్పగారు తివాచిమీద నిటునటు పచారుచేయుచు నాగి, "నాకు కొన్నికాలయములు గలవు గొప్పవారితో సంబంధము చేయవలె నని, నాకుఁ గల ఆస్తితో గౌరవముగ జమీందారిఫాయామీద బ్రతుకవలెనని. అందువలన మీశకుంతలను - నా కిచ్చి వివాహము చేయించితిరా - నేను మీకు దాసుడను." జేమీందారిణి ఆశ్చర్యపడెను. నిర్ఘాంత

పడెను. "ఆఁ! నీకు - శకుంతల కావలెనా!!" యని బిగ్గరగ నాశ్చర్యపడుచు పలికెను. అన్నప్పగారొక విషువవ్వు నవ్విరి. ఆయన మెల్లగ నామెకు వినబడునటు లేదో పలికిరి. ఆమె సర్వ మువలె తలవంచెను.

# ఆ ఱ వ ప్రి క ర ణ ము.

—♦ కృ ష్ణా రా వు గా రి ప రి తా ప ము ♦—

క్రిందటి ప్రికరణములోని సంగతులు జరిగి నాలుగుదిన ములైనది. "ఏమి శకుంతలా!" యని ఆశ్చర్యముతో నావచ్చు చున్న తమ కొమరితవంకకు చూచి కృష్ణారావుగారు అదరిపడి యట్లనిరి. ఆమె యిచ్చటి కెప్పుడు నిట్లు వచ్చి యుండలేదు. తటాలున నామె తన యేకాంతమందిరమునకు వచ్చెను. అప్పుడామె మోము వివర్ణమై దుఃఖసూచకమై, దీనముగ నుండు టాయ నకుఁ గనఁబడెను. సాయంతన మైదుగంట లైనది. ఆచిన్నగది యందింకను బాగుగ వెలుతు రున్నది. గవాక్షములనుండి మందముగ వచ్చుచున్న కాంతి యచ్చటి బల్లమీది పుస్తకము లను కాకితములను మాత్రమేగాక యాగదిలోని బల్లలను, కుర్చీలను, బీరువాలోని పుస్తకములను, పైవఁగట్టబడిన చాఁది సీని గూడ కనబరుచుచుండెను గాని, ఆవెలుతురు గదికి కళ

కాంతులను మాత్రమే మాయలే యుండెను. ఆగదియందుండు పురుషు డనుభవించుచున్న యాతన, పరితాపము, నీగదికూడ అనుభవించు చున్నదో యన, కళావిహీనమై, నిశ్శబ్దమై దిగులు కొలుపుచుండెను. ఆమె మోము విషాదపూరితమై యుండెను. కన్నులు కాంతివంతములుగనే యున్న నశ్రుపూరితములై యుండెను. మోముఁ జిన్నపుచ్చుకొని, ''మిమ్ముల నొకసంగతి యడుగ వచ్చితిని'' అని మెల్లగను నిదానముగ నని ''అరగంటకు ముందు అన్నప్పగారిచ్చటికి వచ్చి వెళ్లిరి. నాతో పిన్ని ఒకసంగతి ఇప్పుడే చెప్పినది. అన్నప్పగారికి న న్నిచ్చుటకు నిశ్చయించిన దట! ఇది మీ తెరుగుదురా? మీకు నిది యిష్టమేనా? మీరుకూడా నిశ్చయించితిరాయని యడుగవచ్చితిని'' అనిగద్గదస్వరముతో పలికెను. కృష్ణారావుగారింతవఱకు నిటునటు చేతనాడించుచున్న కలమును దటాలున మేజపైఁ బడవైచి శకుంతల నాశ్చర్యముతో చూచిరి. ఆమానమునందు జాలియు దుఃఖమును కనబడుచుండెను. ఆయనయందిదివఱ కెన్నడును కానరాని తెహతహయు, నుద్రేకమును నిప్పుడు కానవచ్చెను. ఆయన యింక నట్లూరక చూచుటఁ జూచి శకుంతల—'నాయనగారూ, చెప్పరేమి? ఇది మీ కిష్టమేనా?' యని కంటతడిపెట్టెను. కృష్ణారావుగారు కష్టము మీదతమ వివిధభావముల నాపికొని "అమ్మా! నా కిది తెలియనే తెలియదు. నాకిష్టమును లేదు. అన్నప్పగారు గొప్పఋణదాతయైన

నేమి ? మనపనులు చూచుచున్న నేమి? నీకు తగినవరుడు కాడు. నిన్ను గూర్చి తలంపనైన తగినవాడు కాడు. దీనికి మీాయమ్మ యెందుల కిచ్చగించుచున్నదో నాకు దెలియుట లేదు. ఆమె నిజముగనే యట్లనినదా? నీవు తిన్నగ వింటివా?' శకుంతల—"ఔను పూర్తిగ నర్థము చేసికొనియే వచ్చితిని. అన్నప్పగారిమాటలే దీనికిసాక్షి. పోనిండు మీాకిష్టము లేనిచో చాలును. అన్నప్పగారిని పెండ్లి చేసికొన్న గాని వలనుపడ దని యనని చో చాలును." కృష్ణారావుగారికి మఱల దుఃఖము వచ్చెను. ఆయన యుద్రేకముతోడ నా బాలికను చూచుచుండిరి. ఆయనదృష్టి యామె ముద్దులచేతులపైనుండి మోమువంకకు పోయి యచ్చట నిలిచెను. కొన్నినిమసము లట్లు పరికించిచూచి ఆయన "అమ్మాయీా, నిన్ను నే నెన్నటికట్లు నిర్బంధపరుపను. నీయిచ్చవచ్చిన వానినే పెండ్లికమ్ము. నే నింకను నిశ్చయింపలేదు. తగినసంబంధము రావలెను" అని ఏదో ఆలోచనలలో మఱల మునిగి ఇంచుక తడవుండి "అన్నప్పగారినిగూర్చియింక భయపడకుము. ఈసంగతినిగూర్చి మీాయమ్మతో మాట్లాడెదను. లెమ్ము." అనిరి. కాని యీాసంభాషణము తమకంతగ నిష్టములే దనుటకో యన నిట్టూర్పు నూర్చిరి. శకుంతల యచ్చట మిన్నకుండ నిలిచెను. ఒకమాఱు తాను తన సవతితల్లివలనపడు బాధలనించుక ఆయనతో చెప్పుకొనవలెనను ఊహ కలిగినది. తన తల్లియొక్క నిజచరిత్ర నడుగవలెనను కుతూహలమును

కలిగినది. కాని యామె మఱల వలదనుకొని శాంతముతోడ 'నాయనగారూ నేను పోయెదను' అని మెల్లన వెడలిపోయెను. ఆమె మందగమనముతో నిశ్శబ్దముగఁ బోవుచుండ నాయన యామెవంకకే చూచుచుండెను. ఆమె ద్వారముగడచిపోయినను ఆయనదృష్టులా వైపున నిలిచిపోయినవి. ఆయన భావములు నాలోచనములెవ్వియో యెవ్వరును చెప్పఁజాలరు. కానియందు విషాదము దుఃఖమును పూర్తిగ కలవని యాయనమౌనమును, మోమును, కన్నులును తెలుపుచుండెను. సూర్యుడు క్రమక్రమముగఁ గ్రుంకుచుండెను. ఆయన కదలుట లేదు. ఇంతలో దీపముబాగుచేయ వెంకయ్య వచ్చెను. 'వెంకయ్యా! నడవలో నుండి దీసి పారవేయు మనిన పటము నేమిచేసితివి?' అని ఆయన ప్రశ్నించిరి. వెంకయ్య తత్తరపడుచు నాశ్చర్యముతో, 'అమ్మగారి పటమునా? జాగ్రత్తగ మూలగదిలో నుంచినాను బాబూ' అని చెప్పెను. కృ:—నేను చెప్పినట్లు చింపివేయలేదా?, యని ఆశ్చర్యముతో నడిగిరి. వెంక:—నేను - నేనట్లు చేయలేకపోయితిని. మాయమ్మగారిరూపమును నా చేతులార చింపివేయగలనా? తమరు నాకాజ్ఞాపించిన నట్లు చేయలేను. ఆమె కన్యాయము జరిగిపోయినది బాబూ, నిజముగా; తమరు కోపగించకుడు; ఆమె కాన్యాయస్థానమున న్యాయము జరుగలేదు. తెలివిహీనులు, చాలపొరపాటు లొనరించినారు. కొంచెము జాగ్రత్తగ వెదకియుండినచో నిర్దోషియగు నమ్మగారిని బలివెట్టవలసిన యావశ్య

కము లేక నిజమగు దోషి కనబడియే యుండును. అప్పటినుండి యు నేన హాూరాత్రిము లీసంగతినిగూర్చి యాలోచించుచునే యున్నాను. ఈయన్యాయపు హత్యనుగూర్చి యమ్మగా రే పాపము నెఱుగరని నాభార్యాబిడ్డలపై నొట్టుపెట్టుకొని చెప్పఁగలను" అని వడకుచు ననెను.

కృష్ణారావుగారి దేహము పులకిత మయ్యెను. ముచ్చె మ్మటలు పోసెను. ఆతలంపునందు ఆశ కలిగెను. కాని మఱల నిరాసజెంది వెంకయ్యను వారించుచు, "చాలును. ఊరకొనుము. ఆపట మెక్కడ నున్నది? ఇటు దెమ్ము" అనిరి. వెంకయ్య మెల్ల నఁబోయి సాధారణముగ నాపటమును తాను శుభ్రిపరచుచునే యుండుటవలన శీఘ్రిముగనే ఈయన కీపట మిప్పు డెందులకాయని ఆశ్చర్యపడుచు దీసికొనివచ్చి, "ప్రితిశుక్రివారము నను నే నీపటమును తుడిచి దీనికి పూలహారము వేయుచుందును బాబూ" అనుచు భక్తితో మేజపై నొకప్రక్కనునిచి నిలువ, ఇంక నీవు పొమ్మని యాజ్ఞాపించి, అతఁడు పోవుచు తన వెనుకనే తలుపు జేరగిలవైచువఱకును కృష్ణారావుగారూరకుండిరి. తరువాత నాపటము నెత్తి యెట్టయెదుట నిలువఁబెట్టి పట్టుకొని చూడఁదొడంగిరి. సంజవెలుతురు గవాక్షము నుండి యాపటమును చూపుచుండెను. ఆముచ్చిపనిచేసిన పటపు కమ్ములు బాగుగ ప్రికాశించుచుండెను. ఆ చిత్రిలేఖనము చక్కగ నున్నది. అందున్నరూప మొకజవ్వనిది. పదునెనిమి

దేం ద్లుండవు. పొగడరియే. స్థూలశరీర కాదు. ఎఱ్ఱగులాబి రంగుచీరను గట్టుకొనియుండెను. కృష్ణారావుగారు నెల్లూరిలో నున్న దని కలనైన తలంపని సుశీలమ్మమోమునం దేయే సుందరభావములు పోలిక లున్నవో ఆయందములగు గంభీరములగు పోలికలు, తీవియు నీపటమునం దుండుటయేగాక నవజవ్వనమును, నల్లని పొడవగు వంకవెండ్రుకలును, సోగకన్నులు, నరుణములై తీర్చినట్టులున్న పెదవులును కృష్ణారావుగారికి బ్రాణప్రియయైన రాధాదేవిపటమున కనబడుచుండెను. ఆ మోమునం దొకమందహాస మున్నది. అదియే కృష్ణారావుగారిప్రేమకు కారణము. అదియే ధర్మవైద్యశాలలోనిరోగుల భక్తికిని కృతజ్ఞతకును స్థావరము. అదియే సుశీలమ్మగారి ప్రౌఢమగు గుణసౌందర్యభూషణము. అదియే రాధమ్మగారి నవజవ్వనమునకు మనోహరమగు మెఱుగు. అది పండువెన్నెలవంటి వెడగు కలకల కాదు. నెలబాలునివంటి భిడియము కాదు. జలదములమాటున నుండి తొంగిచూచు. పూర్ణచంద్రునిసౌరు, విడియు విడని కమలముల .గేరు, లోకమునందు సద్గుణయు సౌందర్యరాశియునగు మానినియందు అత్యంతానందకరమగు నొక్క తృటికాలమున నొక్క ముహూర్తమున మాత్రమే కాననగు చిరునవ్వు. ఈ చిరునవ్వు రాధాదేవి సొమ్ము. ఈమొవగుమోమును కృష్ణారావుగారు తనివిదీరక చూచు చుండిరి.

ఈరూపమున నిట్టిట్టి దనరాని కళకాంతులు కలవు. ఆయందమగు మోము శిశువువలె నిష్కళంకమై నిర్మలమై కళావంతమై యుండెను. కృష్ణారావుగారీ గుణసౌందర్యములఁగోరులుచుండిరి. ఆయనమోమున మార్పులు కలుగఁజొచ్చెను. మెల్లమెల్లగ నుద్రేకము గలిగి కన్నులరుణములై అశ్రుపూరితము లగుటయు చేతులును పెదవులును వడకుచుండుటయుఁ గనఁబడెను. అయ్యో, యీపురుషుఁడీమె నెంతగ ప్రేమించియుండెను! ఈ పదివత్సరములు నీప్రేమానుబంధమును, పవిత్రమగు ఋణానుబంధమును ద్రెంపికొన నెంతబాధ పడుచున్నాఁడో భగవంతుఁడెఱుఁగును. ఆమెను తనహృదయమునుండి పూర్తిగ ద్రోసివేయుటకై హోరాత్రములు ప్రయత్నించినను వ్యర్థమైనది. ఈప్రేమయు దుఃఖము పోవుటకు బదు లధికమైన విషాదముగఁ బరిణమించి హృదయారాటమును బరితాపము నధికమొనవి. అహోరాత్రములామెకొఱకీయన యాతనఁజెందుచుండిరి. ఆమెను దోషిగ నెంచి ఆమె స్థానమున నింకొకరుక నుంచినందులకు పశ్చాత్తాపము చెందుచుండిరి. ఆమెను చూచి యిప్పటికి పదివత్సరము లైనది. అప్పటినుండియు నామెప్రతిబింబము నీతఁడు చూడలేదు. దినదిన ప్రవర్థమానమగు శకుంతలయందలి పోలిక లీయనహృదయము ననుదినమును కలచుచునే యుండెను. ఒకొక్కప్పు డానందము, ఇంకొక్కప్పుడు విషాదమును కలిగించుచునే యుండెను. పాపము వెంకయ్యవలన శ్రద్ధ

భక్తులతో కాపాడఁబడిన యీప్రతిమ తప్ప వేరురూపపట మేదియు నిఁక లేదు. ఎల్లను నాశనమై పోయినవి. వస్తువులు, బట్టలు, వే యేల? ఆమెసర్వస్వమును బేరైన లేకుండ పోయినవి. ఏది నాశనమైనను, మానవుడుకూడ పోయినను గూడ పోవని దొక్కటిమాత్రము మిగిలినది. అది హృదయమున వేళ్లు బారి పెరిగిన ప్రేమ. రాధాదేవిరూపము కృష్ణారావుగారి హృదయసీమపై జిత్రితమై, ఘనీభవించి స్పష్టముగ స్వచ్ఛముగ, నహోరాత్రము లాయనకు గన్నుల కట్టయెదుట ఆయన పట్టుకొనిన పటమువలెనే యుండెను. మఱవ దలచినను, మఱవ ప్రతిజ్ఞచేసికొనినను మఱపునకు రాదు. ఆయన కామె కావలెను. ఆమె యాత్మ తనయాత్మకు కావలెను. ఆమె తనలో నొకభాగము. తా నిప్పుడు చేపట్టిన యామె తనయర్ధాంగి కాదు. తన హృదయపీఠము నాక్రమింపజాలదు. తిన ఐహికసుఖము భగ్నమైనది. తన యాధ్యాత్మిక జీవనము గగనకుసుమమైనది. దుఃఖము! దుఃఖము!! దుఃఖము!!! ఇదియే మిగిలినది. ఈ చిత్రపటమును జూచునప్పటి కీయనకు విషాద మధికమయ్యెను. ఈ పటమును తా నెంతో ముచ్చట పడి వ్రాయించియుంట జ్ఞప్తికి వచ్చెను. దీని కప్పు డిరువదెని మిది రూపాయలు ఆర్. వెంకయ్య అందు సన్నవారికి యిచ్చి యుండిరి. ఆమె నిజరూపము. అప్పుడు వీరిరువురు నను రాగముతో గడపినకాలము. ఆసంతోషము జ్ఞాపకమువచ్చెను.

# ఆ ఱ వ ప్రి క ర ణ ము

ఆమెను తనవారు పెట్టినబాధలు, ఆమె యోర్పు, నెమ్మది, ప్రేమయు, కన్నులకుఁ గట్టినట్లు లుండెను. ఎవ రేమనుకొన్న మన కేమని తాము వేరింటికాపురముండి సుఖముండినకాలము, తమబిడ్డల ముద్దుముచ్చటలు, ఇంతలో నీభవనమునకు వచ్చుట, ఘోరహత్య, తీరనిదుఃఖము! ఆయన యొక్క వేడినిట్టూర్పు నూర్చిరి. ఆనందము, సౌఖ్యము నశించినవి. తనప్రాణ ప్రియ యధోగతిని బడిపోయినది. రంగమెల్ల మూతినది. నాటకమున రెండంకములు గడచినవి.

"ఏమీ! ఈసుందరి దోషియా? ఈ సుందరములగు సోగకన్నులు క్రూరములా? ఈముద్దుమోము హత్యాకారిణి దా? ఈమృదులహస్తములు రక్తసిక్తములా? అసంభవము. నాకు నీమెకు నన్యాయము జరిగిపోయినది. నే నీమె దోషియని నమ్మఁజాలను. నీవు అనపరాధివి. నీకు నే నన్యాయము చేసినాడను." అని యుద్రేకముతో వడకుచు ననిరి. ఆపటము నిజముగ సజీవరూప మని భ్రమపడిరి. కంకణ నిక్వాణము విన్నట్లయ్యెను. గది నలువంకలఁ జూచి యాగిరి. ఆయన మతిల దీనముగ విషాదముతో నూరకొనిరి. ఆగది యాయనకు ప్రియమైన రాధాదేవి రెండుమూడు మాటలు వచ్చి ముచ్చటాడి పోయిన ప్రదేశము. ఈగదియందే ఆయనను గౌగలించుకొని యేడ్చి పిల్లల నప్పగించి పోయినది, నేను నిర్దోషి నని త్రికరణశుద్ధిగ చెప్పినది. ఆమె కంఠధ్వని యీగదియందే మ్రోగి

యుండెను. ఆమెపాదములమట్టెలచప్పుడు, కంకణముల గలగల, మంగళసూత్రముల తళతళ, ఇన్నివత్సరములయ్యు నిప్పుడు గోచరములగుచున్నవి. ఆగది యిప్పుడు రాధాదేవితో నిండిపోయినది. అనిశ్శబ్దమగుగది రొదలతో, ధ్వనులతో, భావములతో నిండిపోయినది. కృష్ణారావుగారి దృష్టి రాధమ్మగారి రూపపటపుకన్నులలో లీనమైపోయినది. చీకటి పడినది. కృష్ణారావుగారికి జ్వరము వచ్చినట్లైనది.

## ఏడవ ప్రకరణము.

### —♦ మొదటి పాచిక ♦—

అట్లా రూపపటమును తదేకదృష్టితో చూచుచు నోరగిలనుండిన తమగదితలుపు చటుక తీయఁబడి జమీందారిణి తొంగిచూచుటకూడ కృష్ణారావుగారెఱుగలేదు. ఆయన కన్నులనుండి యశ్రువులు వర్షముగ కురియుచుండెను. నుదుటిపై చెమ్మటలు క్రమ్మెను. ఆపటము నింకఁ బట్టుకొనలేక నాళ్ళు సకియుల వెనుకకుఁ జేరగిలవైచి కన్నులు మూసికొనిరి. ఇన్నివత్సరములకు తటాలున నీపటమునుగూర్చి యీయన యేల యడిగెనో తెలిసికొనుట కష్టము. శకుంతల రూపమే, ఆయీాడున రాధాదేవిరూపము నీయనకు జ్ఞాపకముఁజేసి

యుండును. ఇతరులతో మాటాడక ఏకాంతవాసము సేయుచు గ్రంథములమధ్య సర్వమును మఱచి బ్రయత్నించు నాయ నకు తుదకు పట్టలేనంత విషాదము, పూర్వస్మృతియు కలిగినవి. హృదయము కరిగిపోయినది. శకుంతలమోము, దుఃఖమును దెలుపు నయనములు, వింతమందహాసము – నొక్క మారుగ యోగికైనను పూర్వాశ్రమస్మృతిని దేగలవు. ఇప్పటి వఱకును వివర్ణమై, కళావిహీనమై, దుఃఖపూరిత మగు నాయనవదన మిప్పు డుద్రేకముతో నెఱ్ఱవడెను. ఒక్కపరి ఛీ! ఇది తగదు – ఈమె దోషి, శిక్షిత – నేనామెనుగూర్చి తలంపకూడదు – అని దృఢముగ నిశ్చయము చేసికొనిరి. వెంటనే వెంకయ్య యామెనుగూర్చి యన్నమాట లీయన మనసునకు ములుకులవలె నాటి దుఃఖమును కలిగించెను. అతఁడు ముదుసలి. వెఱ్ఱిమాటలాడినాడు. అట్లగుటకు వీలు లేదు. తప్పుకొనలేని తోసివేయఁజాలని నిదర్శనములు కనఁ బడుటలేదా? గొప్పకోర్టువిచారణలు, తీర్మానములు వృథ లగునా? దోషి యనుటకు సందియము లేదు – అని కృష్ణా రావుగా రనుకొనిరి. ఆమెకై యాసించుట తలచుట మంచిది కాదని హెచ్చరించుకొనిరి. అయిన నామెనుగూర్చి తలపులు రాకమానవు. ఆమె యిప్పు డెట్లున్నదో? పదివత్సరముల వరక మనుభవించినతరువాత కష్టములతో బాధలతో దుఃఖ ములతో చిక్కి శల్యమై పోల్పుటకు వీలుండ దని తోచెను.

తోడిబందీలతోపాటు వరకమునబడి, సౌందర్యముపోవ, పవిత్రిత గోల్పోయి, చెడిన దని యూహించిరి. కాని యీ క్షణము నత్యంతపవిత్రిశీలయు, సచ్చారిత్రియునై సుశీలనాఁ బరగుచున్న దని యీతఁ డెఱుగడు. ఆయనయింక నట్టి దుఃఖముతోనుండి తుదకు మఱల రాధా దేవిని స్మరింపసాగి ధైర్యముఁ దెచ్చికొని యూరడిల్లిరి. జమీందారిణి యట్లు తొంగి చూచి మెల్లగ లోనికి వచ్చి యేమో చెప్పదలచియు నీయన స్థితిని జూచి సందేహించి యేవో నాలుగు మాటలాడెను. ఇంతలో నీపటమును జూచి నిర్ఘాంతపడుట యేగాక వడకెను. మోము వివర్ణమయ్యెను. కృష్ణారావుగారు జమీందారిణి ముఖమును దిన్నగ బరిశీలింపకయే "శకుంతల నన్నప్ప కిచ్చి పెండ్లిచేయుదలచితి మని నీవంటివట నిజమేనా?" అనిరి. జమీందారిణికి శకుంతల తనపై నీచాడీచెప్పినందులకుఁ గోపము వచ్చెను. అయినను ధైర్యముతో "ఔను. ఆయనను పెండ్లి యాడుట లాభకరముకాదా? మంచి వ్యవహారత, ధనవంతుఁడు, సాటివాడు." కృష్ణారావు— "అయిన నగునుగాక. శకుంతల కింతమాత్రిమును తగఁడు."

జమీందారిణి—కనుబొమ లెత్తి యొయ్యారముగ విరసముగ—"ఏమీ? ఎందులకు తగఁడు? కులవంతక్కువా? ఈడు తక్కువా? ధనముతక్కువా? ఇంతకును శకుంతల కామాత్రివరుఁ డెక్కడనుండి వచ్చును? ఆమె నాతనికిచ్చుటయే శ్రేయస్కరము.

# ఏడవ ప్రకరణము.

కృష్ణారావు:— శ్రేయస్కరమో కాదో కాని, ఆమె నతని కియ్యజాలను.

జమీందారిణి:— (వెటకారముగ) అట్లైన నామెను కన్యగనేయుంచుము కలకాలమును.

కృష్ణారావు:—అట్టికర్మమేమి? అన్నప్పను బెండ్లాడనిచో నామెకు మగడే దొరకఁడా? కురూపియా? కులహీనయా? నిరుపేదయా?

జమీందారిణి:—(చేతిలోని దాళవు చెవుల నల్లలాడించుచు, పెదవివిరచి,తలద్రిప్పుచు) "ఏమో నాకుమాత్రము ధైర్యము లేదు. మీ రనుకొనునంతటి మంచిమగఁడా మెకు వచ్చునని నాకు నమ్మకము లేదు." కృష్ణారావుగారు ప్రశ్న పూర్వకముగ చూచుట చూచి— "గొప్పయింటి పడుచువాడు, యోగ్యుడు, సంపన్నుఁడు, నీసంబంధమున కంతగ నిష్టపడడు. తల్లి సంగతి తెలిసినవా డెవ్వడును రాడు." అని యాపటమువంక చూచెను. కృష్ణారావుగారు తలవంచి మౌనముగ నుండి దీర్ఘాలోచనాపరులైరి. జమీందారిణి మఱల "నిజమును దాపనేల? మనము సరిపెట్టుకొన్నంతమాత్రమున అపకీర్తి యెచ్చటికి పోవును? అందులో సామాన్యవు మచ్చ కాదు. అట్టి స్త్రీయొక్క పిల్లలప్రవర్తనము దోషరహితమెట్లు కాఁగలదని యనుమానపడరా? అందువలననేకదా శకుంతలకు మేనరికము లున్నను

వారు మాటాడుట లేదు. అన్నియు బాగున్న నింతసేపా! ఆమెను పెండ్లాడుట యప్రతిష్టవలె, పరువు తక్కువవలె నున్న దని విశదమేకదా! ఇట్టి సందర్భములో యేరి కోరి వచ్చిన వరుని వలదని పొమ్మనుట మంచిదా? ఆయన అంతగఁ జిన్న వాఁడు, గొప్పకుటుంబములోని వాఁడును గాకపోవచ్చును. కాని గౌరవనీయుఁడు, పేరు ప్రతిష్ఠలును కలవాఁడే. ఇది యును గాక ధనవంతుఁడు. క్రమక్రమముగఁ గొబేరుఁ డగుచు న్నాడు. కొద్దిరోజులలో మునిసిపలు చెయిర్మను కాగల డట. ఏరావుబహద్దరు బిరుదునో శీఘ్రముగనే సంపాదించును."
కృష్ణారావుగారు తమశిరమును చేతులలో బెట్టుకొని యూరక కూర్చుండి వినుచుండిరి. ఆయన కన్నులు తెరచి శిరము నెత్తునప్పటికి శకుంతల తనకిన్నరకంఠమును హార్మోనియము తో మేళవించి పాడుచున్న పాట శ్రావ్యముగ వినబడెను. ఆయన లేచి గంభీరముగ "అంత దూరము అన్నప్పగారిదాఁక పోవ నవసరము లేదు. శకుంతలను బెండ్లాడవలె నని యున్నదని నారాయణరావిదివఱకు నాకు సూచించియున్నాడు. కొంచె ము పెద్దవాడని నాకిష్టము లేక పోయినది. ప్రస్తుత సందర్భము లాలోచింపగ నాతనికే శకుంతల నిచ్చి పెండ్లిసేయుట యుత్త మ మని తోఁచుచున్నది." అని చటుక్కున లేచి యామెను విడిచి గదిలోనుండి మెల్లగ వెడలిపోయిరి. జమీందారిణి నిర్ఘాంత పడెను. ఆమెవివర్ణముచెందిన మోమున స్వేదబిందువు లూ

రేను. ఆమె యొడలు, పెదవులు కంపముఁ జెందెను. ఆమె యప్పుడొక కామినీరూపమును దాల్చి రూపమును విడచుచున్న రాత్రించరురాలివలె తోఁచుచుండెను. అన్నప్పగారి పక్షమున నామె చేతనయినట్లు వాదించినది. పాచికను బారించినదిగాని పంచేము పడలేదు. అతనిదగ్గర తానుచేసిన ఋణములు కృష్ణారావుగారే మైనఁ బసికట్టినారా యేమి? అయి యుండదు. ఇది కేవలము భ్రమ. ఇంతకు నీచిత్రపట మేమి? ఈయన ఇట్లుండ నేమి? ఏది ఎట్లయినను సరియే. అన్నప్పతోఁడి వివాహమున కీయన నొడఁబరుపవలెను. ఇది యత్యంతావశ్యక మని యామె దృఢనిశ్చయము చేసికొనెను.

## ఎనిమిదవప్రకరణము



—• తోఁకఁ ద్రొక్కిన త్రాచు •—

“చాల నన్యాయముగ నున్నది. అతనికి న్యాయాన్యాయ వివక్షత బొత్తుగ నశించిపోయినది. ఆధనమునెల్ల నేమి చేయు చున్నాఁడో! ఏగంగలోనైన బారవోయు చున్నాఁడా? త్రాగు చున్నాఁడా? ఏముండలకైన నిచ్చుచున్నాఁడా?” అని జమీం దారిణి తన ప్రియపరిచారికతో ననుచుండెను. మందారకను బొమ లెగురవైచుచు—‘‘ఏమోనమ్మా, ఇక్కడ నీయూలనున్న

వారల కామూల సింహాళమున నెవ్వ రేమి చేయుచున్నారో తెలియు టెట్లు? జూదమాడ వల ధని యెంతపోరినను వినఁడు. మొదట క్రొంపముంచిన నదియేకదా!" జమీందారిణి :— "ఇఁక భరింపలేము. తనదారి నిఁక తాను చూచుకొనవలసినదే. అతనికిఁ బంపుట కిఁక నొకకాసైన లేదు. అత కరిగినదెల్ల నెటేగి నాడు. చచ్చిపోయిన బాగుండెడిది.

మందార:—"అవునుఅట్లయినచో బాగుగనే యుండును. కాని అట్లు గాలేదుకదా! తలచుకొనిన చెడుగాకివలె కూర్యుఁ గలకు. అతనినోరు మూయుటదప్ప గత్యంతరము లేదు. సుందరీ! జాగ్రత్త." జమీందారిణి :— "కానిధన మెక్కడనుండి వచ్చును? వచ్చుమార్గము కనుపించుట లేదు. కృష్ణారావుగారి దగ్గర నే నెఱుఁగని ధనము లేదు. ఈమధ్య జమీందారీపైనుండి వచ్చిన ధనము ఇంటివ్యయములకు సరిపోయినది. వీలున్నచో నాజ వాహిరీని కుదువబెట్టియుందునుగాని నే నందులకు సాహసింప లేను. అవిలేనిచో నెల్లరు ననుమానింతురు. అన్నప్ప వట్టిపోయి నాడు. దమ్మిడీయైన నీయఁడు. ఏదోకొంచెము పసికట్టినాడు. ఈమధ్య నెనురుతిరుగుచున్నాడు. అతని నోరు మూయించుట కును, సంచిమూతిని విప్పించుటకును, ఈవివాహము జరిగినచో బాగుండును. కాని జమీందారుగారి కిది యిష్టము లేదు. ఎందువలననో పట్టుదలతో వలదనినారు. నారాయణరావు పక్షము బూనినారు. శకుంతలకు వీరిలో నెవరన్నను నిష్టము

లేదు. కాని నారాయణరావుతో చాలచనవుగ నుండుటవలన నాతనిని బెండ్లాడ నిచ్ఛగించుచునేమో. ఇది చాల చిక్కుగనున్నది.

మందార:—ఎట్లయినను కృష్ణారావుగారి నొడఁబడు నట్లు చేయవలెను. సంగతిసందర్భము లెరుగని యాయననొడఁ బరచు టత్యంతకష్టము. అయిన నిది సాధింపవలె. తలపెట్టినపని కడ్డంకులు కలవని యెన్నడైన ప్రయత్నమును విడిచితివా ? అందువలన నింతమాత్రము అధైర్యపడ నేల? ఈక్షణమున నీవు చేయఁగల దొక్కటి కలదు. అది భవనమునందలి యమితవ్యయమును తగ్గించుట. ఇన్నికష్టములలో, ఇంత యిదుదుడుకులలో నీ వింకనుధన వ్యయ మింత చేయుచుండుట బాగుగ లేదు.

జమీందారిణి:- " అయ్యో, నీ వింకను వెనుకదారినే యున్నావు. ఇట్టి పైపై వ్యయములును డంబమును చూపనిచో నితరుల కన్నులఁ గప్పుటెట్లు? నాచేతిలోని కమితధనము వచ్చుచుండు నని యెల్లరకును దెలియును. ఇది యెట్లు వ్యయ మగుచున్నదా యని ప్రజ లనుమానపడరా? ఇప్పు డన్నచో మనము చేయుచున్న విందులు, ధరించు అమూల్యాలంకార ములు, నియోగించిన సేవకులు, బండ్లు చూచి యీవిధముగ ధనమెల్ల వ్యయమగుచున్న దని యనుకొందురు. లోకు లిట్టి వాని కెంత ధనవ్యయమగునో సరిగఁ దెలిసికొనలేరు. ఇట్టివా నికి లెక్కలేని సొమ్మగు నని సులభముగ నమ్ముదురు. అందు

వలన నీదాంభికత్వమును పైకి చూపుచు, వీనికన్న నెన్నోమ డుంగు లగు మన రహస్యవ్యయములకు వినియోగించుకొన వచ్చును. నే సందేమైన తగ్గించితినా? రాఁబడిలోని ప్రతిపైసకు నాఁగూడ జమాఖర్చులను వ్రాసి యప్పగించవలసి వచ్చును.”
ఇంతవఱకు అపనమ్మకముతోడ విని విని తుదకు నిజ మని గ్రహించి యామె యుక్తికిని పన్నాగములకును ఓచ్చవడి యూరా యని తలయూఁచి- “ఔరా! నీవు నే ననుకొన్నదాని కంటె యెంతో తెలివైనదానవు సుమీ” యని మందారపలి కెను. జమీందారిణి “ఆదయ్యము నీకొకర్తకే కాదు, ఆయనకు కూడ కనబడినదేమో? ఆమెపటమును చూచుచు కూర్చు న్నారు.” అనెను. ఉత్తరపుగదిగవాక్షముదగ్గర నావిగ్ర హమును జూచితి నని మందార చెప్పినప్పటి భయమునుండి జమీందారిణి తేరుకొనినది. ఈమాటలు విని మందార యాశ్చ ర్యపడుచు-“ఆమె నింక నాయన మఱువకపోవుటయాశ్చర్యమే. ఎవ్వరో యొకర్తుక యిచ్చటి సేవకులకొఱకు వచ్చిన నామె ను చూచి భ్రమపడియుందును గాని యచ్చముగ రాధాదేవి విగ్రహమే సుమీ” యనెను.

ఇంతలో తలుపుఁదెఱచి, ముదుసలివెంకయ్య అన్న ప్పగారు మాటాడ వచ్చినా రనెను. అంతట తమ సంభాషణ మున జవాబువలె మందార జమీందారిణితో “సరియే నట్టులే తెప్పించెదను” అని యేదియో తెప్పింప నాజ్ఞాపింపబడి

నట్లు నటించి బయటకు పోయెను. ఇతరుల కనుమానముగలుగ కుండుటకై యామె యట్లు సంభాషణమును చతురముగ మార్చెను. జమీందారిణి తలయెత్తి యెదుటనేయున్న వెంకయ్య తో ఆయనను లోనికి రమ్మను మన, నాతడు వనివినియెను. ఆమెకు వివిధభావములు కలిగెను. అన్నప్పగా రాదినము ప్రాతః కాలమున దమ "టపా" చూచుకొనుచుండగా, వచ్చిన లేఖ లలో నొకవింతకమ్మ యుండెను. దానికుడిచేతిమూల "కోలంబో" యనుముద్ర యుండెను. దానిని చూచి అన్నప్పగా రాశ్చర్యముతో విప్పి చదువు కొనిరి.

"అయ్యా, మీరు మంచివారనియు, వ్యవహారతల నియు, యోగ్యులనియు తెలియవచ్చుటచే నేనిట్లు వ్రాయు చున్నాను. కొన్నికారణములవలన మీసలహా నపేక్షించు చున్నాను. నా కిచ్చట సలహా చెప్పువారెవ్వరును లేరు. మీ రెవ్వరనుగూర్చి వ్రాసితిరో - నే నెవ్వతె క్షేమమును గూర్చి యడిగియుంటినో యాస్త్రీ నిజముగ నాభార్య. ఆమె జమీం దారునింట భోగముల ననుభవించుచున్నది., నా కిప్పుడు సక్రమముగ ధనమంపుటకాని, సరిగ లేఖ వ్రాయుటకాని లేదు. అందువలన నాకు తగిన జీవనోపాధి యేర్పరచుకొను వఱకును జీవించుటకైన నాచేతధనములేదు. అందువలన తమకు దయయుంచి నావిషయమై తగిన శ్రద్ధపుచ్చు కొందురని నా ప్రార్థనము. మీ రెట్లు చెప్పిననుసరియే. ఆమె గ్రహించుచును

కాని యీసంగతి కృష్ణారావుగారికి మాత్రము తెలియనీయవలదు. మీవ్యవహారమున ఋణదాతకును, ఋణము పుచ్చుకొను వారికిని తప్ప బ్రహ్మకైనను దెలియని గుట్టుకొనున్నారని నేను వినుటవలననే మీయందు దిట్టవిశ్వాస ముంచితిని. ఇట్లు వ్రాయ సాహసించితిని. ఒకవేళ ఈవిషయమున కలుగఁజేసికొనుటకు మీ కయిష్టమయినచో పోనిండు; రహస్యము మాత్రము దాచుడు. దయయుంచుడు. చిత్తగించవలెను.

ఇట్లు తమ విధేయుడు,

కా. పాపయ్య.”

ఈలేఖ నన్నప్పగారు మొదట త్వరితముగను, తరువాత మెల్లగను, జాగ్రత్తగను, చదువుకొనిరి. అట్లు చదువునప్పుడు ప్రతిపదార్థ తాత్పర్యములను గూఢార్థములను చూడసాగిరి. పిమ్మట తమ పడకకుర్చీయందు కూర్చుండి దీర్ఘాలోచనలో మునిగిరి. పెన్నిధిలభించిన పేదవలె యమితానందముఁ బొందిరి. ఇదెల్ల నా ప్రయోజకత్వము కదా యని పొంగిరి. నేటికి జమీందారిణి జుట్టు చేఁజిక్కినది కదా యని యుత్సాహము జెందిరి. సంఘమునం దిక నిస్సంశయముగ గౌరవమును సంపాదించుకొనఁ గల నని యుబ్బిరి. అంత నెట్టెట్టో నాలుగు మెతుకులు తిని, బండి నెక్కి ఇల్లు భవనమునకు వచ్చిరి. ఈయన లోనికి బోయి కూర్చుండ జమీందారిణి తన్నభయమును కప్పిపుచ్చుటకో యన, విను

గుతో 'ఏమయ్యా! అన్నప్పగారూ; ఇట్లువచ్చితిరి?' ఈ యు
మర్యాదయు, విసుగును అన్నప్పగారికి కోపమును, రోషమును కలి
గించెను. ఏగృహమునకు తన్ను రానిచ్చుటే కష్టముగ నుండెనో
ఆగృహమునకు తాకట్టుపత్రములు తనచేత నున్నవను ధైర్య
ముతో, "అమ్మా! నన్ను గసరికొట్టుటకు మీయింటచేరిన
బిచ్చగాడను కాను. ఏమనుకొనుచున్నారోకాని యిక నూర
కొనువాడనుగాను. ఇంతవఱకు నెందుల కెందుల కని యూర
కొన్నకొలదిని మీరు కొమ్ముకెక్కుచున్నారు."

జమీందారిణి వెలవెలపోయెను. మాటాడలేక "ఏమి
ది?" యనెను. అన్నప్పగారు మఱింతధైర్యముతో విజృంభి
చిరి. ఈతని కేదో నూతనశక్తికలిగినదని యామె గ్రహించెను.
ఇదివఱ కెన్నడు నింత కఠినముగ, ఇంత ధైర్యముగ తిరుగఁ
బడినవాఁడు కాడు. అతడు "మీరు కాలకర్మవశమున శకుం
తల నీయ నొడంబడినారు కాని, మీరు శ్రద్ధపుచ్చుకొని నావ
శమునఁ బనిచేయుచున్నట్లు తోచదు. ఇంతకాలమైనను
మీరు ప్రయత్నము చేయుట లేదు. ఇదిగాక నామెను నారా
యణరావుగారి కిచ్చి పెండ్లిచేయ నిశ్చయమైనదనికూడ
వినియున్నాను. ఇదిగో మీకు కడపటిసారి చెప్పివైచుచు
న్నాను." అని తనగుండెలను చూపుచు "నేనే శకుంతలకు
వరుడనని నిశ్చయముగ బహిరంగముగ మీరు ధృవపరుపని
చో నేను మీ కనిష్టముగ బ్రవర్తించి మీకు చిక్కులు తెచ్చి

పెట్టవలసి వచ్చును. అది మీ రనుభవించినప్పుడు తెలియును."
ఇట్లు నిష్కర్షగ చెప్పుట జమీందారిణికి వింతగ నుండెను.
ఈ బెదరింపు వారి ధనవిషయమును గూర్చి కాదని యామె
గ్రహించెను. అది యేమై యుండునా యను సందేహము
నాశ్చర్యము నీమెకు కలిగెను. ఆమె:— "మీ రన
నది నాకు తెలియుట లేదు. మీరు చేయఁదలచిన దేమిటి? ఇట్టి
యనవసర ప్రసంగములును వ్యర్థప్రలాపములును నీ బెదరింపు
లును నన్ను భయపెట్టఁ జాలవు. మీకు సాహాయ్యముఁ జేయ
బురికొల్పను జాలవు. జాగ్రత్తగ నోరు కాపాడు కొనుడు."
అన్నప్పగా రేలనో తడబడిరి. తత్తరముఁ జెందిరి. వీరిజుట్టు తన
చేతనుండియు, వీరు తనకు లోకువయ్యు, నేలొకో సమయము
వచ్చినప్పుడు తన బెదరింపులకు భయపడరు. తనకు లొంగరు.
తనను సరకు గొనరు. తాను వారియెదుట గట్టిగ మాటాడ
లేదు. ఇది యాశ్చర్యకరమే కదా!

అయినను అన్నప్పగా రీ చీట్లాటలో తమ తురఫుముక్క
నింకను బ్రయోగింపలేదు. ఆ ముక్కను కొట్టి యాటను
గెలువదలచి, ఆలోచనా పూర్వకముగ, విరసముగ, కపట
నమ్రతతో "జమీందారిణిగారికి కోపము వచ్చినది కాబోలు!
అయినను లాభము లేదు. పాపయ్యగారికి తమపై దయ
తప్పినది. మీ రాయనను తృప్తిపరుపనిచో కొంపముంచును
సుడీ! జాగ్రత్త." ఈమాటలలో పాపయ్య యను పేరును

మాత్రమే జమీందారిణి వినెను. ఆమె "ఏమీ! పాపయ్యా!" యని రెండుమాటలు లాశ్చర్యముతోడను భయముతోడను పలికెను. సింహళవిలేఖరి పేరు నుచ్చరించినమాత్రముననే యిట్లామె భయపడునని అన్నప్పగా రూహించియుండిరి. జమీందారునింట భోగము లనుభవించున దీమెకాక యెవ్వతె? కాని యింత వెఱగుపడి తత్తరపడు నని యాతఁ డనుకొనలేదు. ఇది చూచి తన పాచిక పడినదికదా యని సంతసముతోడ, నుత్సాహముతోడ నుండిరి. నిస్సందియముగ నీమెకు పాపయ్య యన్న భయమ్ము. అతనినామ మీమెకు శిరసావహింపతగిన వశీకరణమంత్రము. అందువలన నాయన ధైర్యముతో నిట్లనెను గంభీరముగ "ఔను. పాపయ్యగారే. అతనితో మీకుఁగల సంబంధమును నే నిప్పుడు చెప్పవలసిన పనిలేదు." అనెను. ఇది చతురంగపుటాటలో మాహావలన వేసిన గుఱ్ఱపు దాటు. ఎక్కడపడునో, ఇదెన్ని యెత్తుల కుపయోగించునో, చెప్పఁజాలము. ఆయన కులుల "నే నిప్పు డిచ్చటకు వచ్చుటలో నాయుద్దేశము, నావివాహమును నిశ్చయము చేసికొనుటే! ఇందు మీయావచ్ఛక్తిని వినియోగించి, నాకు సాహాయ్యము చేయవలెను. చేసినచో మీకే శ్రేయస్కరము. అట్లు చేయనిచో మీకు రాఁగలఫలితము చెప్పఁబనిలేదు. ఇదిగాక ధనవిషయమున మీకు కలుగఁబోవు నష్టమునుగూర్చి చెప్పనక్కరలేదు. పెద్దకొత్తముగాక మీరు మూఁడువత్సరముల

నుండి లెక్కలేక పుచ్చుకొనుచున్న మొత్తములను అసలు ఫాయిదాలుచేర్చి రాబట్టుకొను ప్రయత్నమును నేను చేసినచో మీకు కలుగబోవు నవస్థయు విదితమే. ఇదియుగాక సింహళములోని మీభర్తగారితో జరుగుచున్న మీయుత్తర ప్రత్యుత్తరములు ఆయనకు బంపుధనమునుగూర్చియు బయట పెట్టినచో మీకుఁగల్గు నపఖ్యాతినిగూర్చి వేరుగ నొక్కచెప్పవలెనా?" అనునప్పటి కామె కత్యంతమగు ధైర్యము వచ్చెను. ఈతని మాటల కామె తటాలున నడ్డము వచ్చెను. ఇప్పటికామె తేరుకొనెను. గుండె కుదుటఁ బెట్టుకొనెను. వివర్ణముఁ జెందిన మోమున మఱల నుష్ణమగు రక్తము ప్రవహించి జేవురింపఁ జేసెను. ఆమెయాడుసింగమువలె, తోఁకద్రొక్కిన త్రాచువలె, లేచి "సింహళమందు నాభర్తయా! ఏమియున్మత్త ప్రలాపములు, కారులు ప్రేలుచుంటివి?" అన్నప్పగారి కనుమానమును భయమునుకలుగ నొడలుఝల్లుమనెను. అయినను సమయోచితముగ బ్రవర్తింపవలె నని ధైర్యముతో "ఔను మీ భర్తయే. దీనిని వెల్లడిచేసినచో మీకొంపమునుగును. జమీన్దారిణి కన్నులెఱ్ఱజేసి, కోపముతో "ఛీ ప్రేలరీ! నోరుమూసికొనుము. నాకు సింహళమున నెవ్వఁడులేడుకాని నీనోటికి బుద్ధిచెప్ప నిచ్చట నొక్కడున్నాడు. జమీందారుగారి కీ సంగతి చెప్పెద పద" అని కంచువలె ఖంగున పల్కెను. అన్నప్పగారికి ముచ్చెమటలును పోసెను. ఆయన కేమియుతోచక పెను

కంజూపై చి నేలఁగూలఁ బడి చేతులు జోడించి "అమ్మా నాతల దిమ్ముగనున్నది. అపరాధము. ఏమేమో పల్కితిని క్షమింపుడు. కృష్ణారావుగారితో చెప్పనేల? నాది పొరపాటు. నన్నెవ్వరో మాయచేసిరి. నే నీసంగతిని విచారించి తెలిసికొనెదను. క్షమింపుడు" అని బ్రతిమాలుకొన - నీయన విన్నదనమునకును, దీనాలాపములకు జాలిపడియో 'విచారించి తెలిసికొనెద'నను మాటలకు భయపడియో, తక్షణమే జమీందారిణి "అన్నప్పగారూ, పొరపాటు లెవ్వరికైనను వచ్చును; దీనికేమి, పోనిండు. మీరువృథాశ్రమను పడకుడు. ఈసంగతి నింతతో విడచిపెట్టుడు" అని పల్కెను. కాని అన్నప్పగారి కింకను పూర్తిగ ధైర్యము రాలేదు. అందువలన నచ్చటనుండి బయట పడఁ దలంచి కాఁబోలును—"నాకుకొంచెము పనియున్నది. పోయివచ్చెద"నని సెలవుదీసికొని త్వరగ తడబడుచు నావలకుబోయి బ్రదుకు జీవుడా యనుకొనెను. నగుబాటునకు లోనైతిగదా యని దుఃఖంచి ఆపాడులేఖను మఱల దీసి చదివెను. ఏమి? ఇందు జమీందారు నింటభోగము లనుభవించుచుంట యీమెకాక వేరెవ్వతె? ఈ లేఖ మోసమా? లేక జమీందారిణి నన్ను మోసగించినదా? ఈమెతోడ నేకాదా పాపయ్య తనసంగతి చెప్పుమనినది? దూరదేశమం దెవ్వరి తోడనో ఉత్తర ప్రత్యుత్తరములను జమీందారిణి జరుపుచున్న దని నే నీవఱకే వినియుంటినిగదా! ఇందలి సత్యమేమి?

ఇది కల్పితమా? మోసగింపు లేఖయా? ఈ లేఖయొక్క పుట్టు పూర్వోత్తరములను బాగుగఁ దెలిసికొనదగాక—యని యొక కంపెనీకి కొలంబో కప్పుడే వ్రాసి కనుగొన నిశ్చయించి కొనెను.

## తొమ్మిదవ ప్రకరణము.

—: స్నేహము – ప్రేమము :—

“నీ యనురాగము నామె కేల నెఱిగింపరాదు?” అని బాట కిరుప్రక్కల నున్న వృక్షములు, వాని యాకుల నడుమ కిలకిలా రావము లొనరించుచున్న పక్షులు, నీమాటలనే మఱల పలుకుచున్న వని రామారావు తలంచెను. ముందు కనుచూపు మేర శకుంతల యాతోపులో పెన్నానదికిప్రక్కనే పోవు సుందరమగు కాలిబాటలో నడిచి పోవుచుండెను. ఆమెను శీఘ్రముగఁ గలిసికొనఁ గల నని రామారా వనుకొనెను. ఆ కాలిబాట యొక మలుపు దిరుగును. ఆమలుపు నామె తిరుగునంతలో తా నడ్డుదారిని బోయి కలిసికొనదగాక యని యెంచెను. ఆ వసంతకాల మెంతో రమణీయమై యుండెను. వసంతకాల వర్ణనమున కిది ప్రబంధముగాదు. నాటకముకాదు. అయినను వసంతము మనోహరమన్నంత

మాత్రమున మనకథాసందర్భము చెడిపోదు. వివిధపక్షుల
కిలకిలారావమే మధురమగు సంగీతము. లేబచ్చికయుం దచ్చ
టచ్చట దట్టముగ బెఱిగిన బిళ్లగన్నేరు, బొగడబంతియు, చేర్చిన
రత్నకంబళమును ప్రకృతియే పరచినది. ప్రక్కనున్న మామిడి
చెట్లు పుష్పాడి దీనికి తోడ్పడినది. అదియుగాక నీచెట్లనే వికసన
కళ్లలుగ గంధవాహుడు కదల్చుచుండెను. జనులకును పశు
పక్షులకును చల్లని నీరములనిచ్చి సేదదీర్చు గొల్లభామ యీ
పినాకినీనదీలలామ. మన శకుంతలను ఇప్పుడీ భూలోకస్వర్గ
మనదగు నీప్రదేశమున, ప్రకృతిసౌందర్యమున, పోవుచుండిన
వనలక్ష్మిని రామారావు చూచి యానందించి ప్రేమఱచు
చుండెను. అనురాగము రహస్యముగ నితని హృద
యాంతరాళమున బుట్టి, ఆనందమువలన, స్నేహము వలన
నాసవలన బెఱిగినది. ఈ భావములును, ప్రేమను తనగంభీర
హృదయమున నడచుకొని యుండెను. ఈ కోరికను సఫలము
చేయుదలంచు టందరానిమ్రాకుల కత్తులు సాచుటే యను
కొని యుండెను. అయినను దనకు మాతామహార్జిత సంపద
కలుగునని తెలిసికొనినప్పటినుండియు రామారావున కాన
యధికమై తనకోరిక సఫలమగునని తోచినది. సుశీల యితని
యభిప్రాయము విని ప్రోత్సహించెను. ఆమెను కలిసికొనిన
తక్షణమే యిక తనభావము నామెకుఁ జెప్పివేయ నిశ్చయిం
చెను. ఊరిబయట నొకరోగి నితడిప్పుడు చూడబోవు చుండెను.

ఈ ప్రకృతిమాధుర్యము రామారావున కుత్సాహకరముగ నుండెను. దారియందెల్ల శకుంతలనుగూర్చిన తలఁపులే. అంత దటాలున నీజండియు కనఁబడెను. రామారావు సంత సించెను. రామారావునకు సుశీలమ్మగారిమాటలు మఱల మఱల జ్ఞాపకము వచ్చుచుండెను. ఆమెవలెనే తాను ననహ్యాం చుకొనుచున్న నారాయణరావుకూడ జ్ఞాపకము వచ్చెను. నారాయణరావునుజూచిన నేలనసహ్యమా యని యాలోచింప నాతని కొక్కటి తోఁచెను. నారాయణరావు దుర్మార్గుఁడో కాఁడో తెలియునప్పటికిని, అతనితో తిరిగి అనిరుద్ధుడు చెడి పోవుటవలన నాతఁడు మంచివాఁడుకాఁడని తాన ట్లసహ్యాం చుకొనుచున్నా నని తలంచెను. సుశీలమ్మగారికికూడ నితడన్న ననహ్యము, ననుమానము నేల కలుగవలెనో? శకుంతలను నారాయణరావున కిచ్చెదరని తాను వినినమాట లింక నీతనిని బాధించుచుండెను. అన్నప్పగారుకూడ శకుంతల నాసించు చున్నా రనుమాట తలంపునకు రాగా రామారావు మందహా సము చేసెను. ఇది పరిహాసాస్పద మని తనలో తాను నవ్వు కొనెను. ఈ యాలోచనలతో నాతఁ డడ్డుదారిని నడుచుచుం డెను. అన్నప్పగారి డంబాచారము నీతఁ డెఱుఁగును. ఈతనిని గొప్పవారితో సమానముగ భవనమునకు విందులకు బిలుచు చుంటఁ జూచి జనులు గుసగుసలాడు చుండిరి. రామా రావు శకుంతలయు నొండొరుల ప్రేమ నెఱుగరు. రామా

రావు శకుంతలతో మాటాడునప్పు డామె ఉత్సాహోద్రే
కములఁ జెందె నని రామారావు గ్రహింపలేదు. ఆమె తన
మనసు నాతఁ డెఱిఁగిపోవునని యెన్నకుండెను. అతఁడు మాటాడి
నప్పుడు గద్గదస్వరముతో నుండు టామె కనిపెట్టెను. కాని
యామె అతని మోము నప్పుడు చూడలేదు. చూడసాహసింపను
లేదు. చూచినచో నీతనిరహస్యము నామె పూర్తిగ గ్రహించి
యుండెడిది. అతనిభావము నామె గ్రహింపలేదు. అతనిరూ
పము మాత్ర మామె హృదయమున జిత్రితమయ్యెను. ఆమెకు
ప్రేమ పూర్తిగ యంకురమై మనసును కలచు చుండెను.
అతనిదృష్టి తన్నపైననేయుండు టామె యెఱుఁగునుగాని తాను
మఱలకన్నులతో నాతనిని చూడ సాహసింపలేదు. అప్పుడికువు
రకు నొకరిసంగతి యొకరితో చెప్పివేయుద మనుతలంపుకలిగెను.
మాట నాలుకచివరకు వచ్చెనుగాని యామాటలు వెలువడ
లేదు. ఇట్లెన్నోమారులు జరిగినది. రామారావునుచూడక యే
శకుంతల చరచర నడిచి యచ్చటి గుఱ్ఱపుబండి నెక్కిపోయెను.
రామారావు తత్తరజెందెను. గాలిరివ్వునవీచుట యాతనికి రోద
నవలె నున్నది. కోకిలారవ మిలకోడిరొదవలె నున్నది. సూర్యుడు
క్రుంగుట నసహ్యకరమయ్యెను. సాయంసమయము బాగుగ లేదు.
రామారావు తలవంచికొని నడచుచుండెను. మందమారుత
మింక నున్నది. వసంతము మనోహరముగనే యున్నది. ప్రకృతి
రామణీయకముగ నున్నది. కాని రామారావుహృదయమున

సంతోషము లేదు. ఎట్లయిన నేమి రామారావు గమ్యస్థానము చేరి తన పని చూచుకొని పోయెను. ఇంకొకగంటకు పోయి యిలు సేరునప్పటికి తల్లిదండ్రు లీతనికొఱకు వేచియుండిరి. నా రీతనికి తనతాత పోయినాడనియు ఆస్తి సీతని కీయలేదనియు చెప్పిరి. శకుంతలను గూర్చిన యాశ లడుగంటినవి. హృదయము పగిలినది. నిరాస - దుఃఖము - విషాదము ఆతని నావహించెను. నావంటి మరదృష్టవంతుడు శకుంతల నెట్లాసింప దగును? అనియనుకొని అతడు నిట్టూర్పు నూర్చెను.

## పదియవ ప్రకరణము

### తల్లి ప్రాణము

క్రిందటి ప్రకరణములోని సంగతి జరిగిన మరునాటి మధ్యాహ్నమైనది. "రామారావుగా రింటనున్నారా?" యని సుశీల యడిగెను. "ఉన్నా"రని సేవకుడు బదులుచెప్పి, యామెను కచ్చేరిగదిలోనికి దీసికొనిపోయెను. "చిన్నస్వామిపిల్ల వాఁ డెట్లున్నాడు?" అనుచు రామారావు వచ్చెను. సుశీల తల ద్రిప్పుచు "చాల నపాయకరావస్థయం దున్నాడు. ఒకమాఱు వచ్చి చూచి పొమ్మని చెప్పుటకే నేను వచ్చినాను." రామా

రావు, "సరియే వచ్చెదనుండు" డని బయలుదేఱుటకుపోవుటకు బట్టలు దొడుగుకొన లేవఁబోవ, సేవకుఁ డొకలేఖను పట్టుకొని వచ్చి యిచ్చెను. రామారావు చూచి, "అనిరుద్ధుని వ్రాఁత!" యని పరాకుగ నని సంగతులను త్వరగ జదివికొనెను. ఆ చదువునప్పు డాతని ముఖచిహ్నములు మారుచుండెను. సుశీలమ్మ గారు నాతనిని గనిపెట్టి చూచుచుండెను. అతఁడు నది చదివి విసుగుతో మేజపైఁగల యొకపుస్తకములో బడవైచి, "నే నుడుపులను ధరించుకొనివచ్చెద, నుండు" డని లోనికిబోయెను.

అంత సుశీలమ్మకొక కోరిక కలిగెను. అది ఈలేఖను చూడవలెనను కోర్కె. ఇది నీచమే కాని యామెతన కోరిక నడంపలేక లేచి మేజపైనున్న లేఖను దీసి వడఁకు చున్న చేతులతో విప్పెను. రామారావు చదువునప్పుడు ముఖ భావమున విషాదమును గోపమును విసుగును తోచెనుకదా! ఈ దుడుకుబాలుఁ డేమిచేయుచున్నాఁడు? ఏమి యకార్యము లాచరించుచున్నాఁడు? అతఁ డేమిచేయుచున్నాఁడో, ఎట్లున్నాఁడో తెలిసికొనవలె నను కుతూహల మామెను కలచుచుండగ దాని నిట్లు చదివెను.

"ప్రియమిత్రమా! నిన్ను మఱల బాధింపవలసివచ్చినది. ఏమిచేయు మనియెదవు? ఎంత సొమ్మైనను నాకు చాలుటలేదు. ఈ కాలమున చెన్నపురిలో చదువవలెనన్న సామాన్య సం సారులబిడ్డలకే చాలధనము కావలసియుండును. అట్టి తఱి. జమీందారులపిల్లల మాట చెప్పవలయునా?

మాతోడివారెల్లరు జమీందారులే. మా సేవకులు నుపాధ్యాయులుతప్ప ఇతరప్రపంచము మే మెఱుఁగము. అందు

వలన మాకు ప్రాపంచికజ్ఞానము తెలియదు సరికదా సంసార
మన నేమో, మితవ్యయ మన నేమో మొదలే తెలియవు. ఇఁక
మావారిలోనైన నెవరి కెంత ధనముకలదో తెలియదుకాని
బాహ్యవేషములందుమాత్ర మొకరి కొకరు తీసిపోవరు. నలు
గురిలో నావంటివాఁ డెవఁడైన సొమ్మునకు వెనుకతీసినచో లోభి
యని పరిహసింతురు. మా యాటపాటలకు వినోదములకు
నెక్కుడిధనమును జాలదు. సాధారణముగ క్లబ్బులలోచేరి
యున్నను, బిలియార్డ్సు లాడుకొనువారికే ధనవ్యయమగును
కదా! దొరలవలె తిరుగుచు వారివలె గోల్ఫుపోలో మున్నగు
అనన్యసామాన్యములగు క్రీడల కెంతధనము కావలయునో
ఊహింపుము. మేము జనసామాన్యమువలె కాఫీహోటళ్లకు
పోయిన పరువుతక్కువకదా! పశ్చాత్య హోటళ్లకుఁబోయిన
నల్పాహారములకైన నెంతసొమ్ము కావలెనో నీ వెఱుఁగు
దువు. ఇక యేనాటకమునకో సినీమాకో వారమున కొకటి
రెండుమారు లేస్నేహితునితోనో పోయినచో దానికిని ధనము
కావలెనుకదా? ఇవి యన్నియు నటు లుంచుము. ఇప్పుడు
చెన్నపురిలో జరుగుచున్న గుఱ్ఱపుబందెముల సంగతి యో
జింపుము. ఇది యొకమంత్రశక్తివలె మమ్ము నాకర్షించి
వైచుచున్నది. స్నేహితులతో దానిని చూడఁబోవుదుము.
చూచి ఒక చిన్న పందెము వేయుదుము. గెలిచినచో నాశ
కలుగును. ఓడినచో పౌరుషము కలుగును. ఎట్లయినను పై
పందెములు వేయవలసినదే! ఎంత ప్రయత్నించినను నుత్సా
హము నడచుకొనలేక పోయితిని. దీనికొరకు నే నొకనిదగ్గర
నప్పుచేసితిని. చాలకాలమునుండి తీర్చలేదని అతడు నలుగురిలో

పరిహసించినారు. నాకు అప్పు పుట్టుట లేదు. నే నియ్యవలసిన వారు పీకికొని తినుచున్నారు. నా సేవకుడును నాట్యాటరును నామీద యలిగినారు. ఒకవందరూపాయిలైన నున్నగాని నామానము దక్కదు. ఎటులైన నీ పీమొత్తము బదులీయ వలెను. లేనిచో నేబదియైనను తక్షణ మంపవలెను. ఏపందెము లోనో నాకు కొంత తిరుగబడినయెడల ముందుగ నీ కివ్వవలసిన సొమ్మునెల్ల యిచ్చివైచెదను. నీవు పంపనిచో నే నేనూతినో గోతినో చూచుకొనవలసి యుండును. నీ॥ అనిరుద్ధుడు."— అను లేఖ చూడగనే సుశీలగుండెలు నీరయ్యెను. ఆహా! ఏమి చదువు, ఏమి న్యాయింగ్టను! గోముఖవ్యాఘ్రమువంటి యీ పాఠశాల ఎట్లు దాపురించిన దని నిట్టూర్పు నూర్చి రామారావుపాదములసడి విని లేఖ నప్పటిచోట నుంచెను. ఆజాబును తీసికొని జేబునం దుంచుకొని, దీర్ఘాలోచనముతో 'గం' డని యామెతో వీధిలోనికిఁ బోయెను. బాటలో వీరిని చూచినవారెల్లరు వందనము లొనర్చుచుండిరి. సుశీలమ్మగారి మందహాసముకొఱకు, ఆమె సాదరదృష్టులకొఱకు, ఆమెచల్లని పల్కులకొఱకు, ఆసపడి యామెవైపునకు దీనముగ కృతజ్ఞతాపూర్వకముగ జూచు, బీద లెందఱో బాటయందు కనబడిరి. ఈమె సద్గుణములకు వారికృతజ్ఞతకు రామారావు సంతసపడెను. ఎల్లరు నామెను, అతనిని, దీవించుచుండిరి. అప్పుడు చింపిగుడ్డలతో నిటునటు తుళ్లుచు గేరింతలు కొట్టు

చున్న పిల్లలును సుశీలమ్మను చూచి మందహాసము చేయుచు నామె చిరునవ్వు నవ్వ మఱల సంతసముతో కెవ్వున నార్చు నాబిడ్డలనుచూచి, రామారావు—"ఏమివీరి స్నేహభావము? మీా రన్న వీరి కెంతప్రేమ!" సుశీల"—ప్రేమయే ప్రేమకు కారణము." రామారావు దీర్ఘాలోచనాపరుఁ డయ్యెను. ప్రేమయే ప్రేమకు కారణ మని మఱియొకమాట తా ననుకొనెను. ఆతనికి శిఖం తలమీాదికి దృష్టిపోయెను. తరువాత నతని తలంపు అనిరుద్ధుని పైకిఁ బోయెను. సుశీల దీనిని గ్రహించెను. ఈజాబునుగూర్చి యీామెతో మాటాడుట యుక్తమా? యని యీాతడు తర్కిం చుచుండె నని యీాతనిముఖభావమున నామె చదివెను. ఈమె నెల్లూరికి వచ్చి కొలదినెలలు మాత్రమే యైనది. ఆమె యింకను జమీాందారుగారి కుటుంబమునుగూర్చి బాగుగ నెఱుగదని యీాత డనుకొనెను. అందువలన నీరహస్యము చెప్పుట మంచిదికాదు. అందువలన నీతడు, దీనిని గప్పిపుచ్చి, ఏదో లోకాభిరామాయణమునుగూర్చి మాటాడువానివలె పలుకఁజొచ్చెను, గాని యీామె గ్రహింపగలిగెను. రామా రావు—"ప్రేమయే ప్రేమ కెల్లప్పుడు కారణమని నేనుతలంపను. ఇదియుగాక మంచితనమే మంచితనమునకు గారణము కాజా లదు. దయయు ఆదరణమును బాలురయందు కృతజ్ఞతయు సత్ప్రవర్తనమును గలిగింపజాలవు. అందువలన బాలకులను యువకులను నంతగ చనవుచేయరాదు. వారిని వారు తెచ్చు

కొన్ని చిక్కులనుండి తొలగించినకొలది, వారు మఱలఁ జిక్కులలో దగుల్కొని స్వయంసాహాయ్యశక్తిని బోఁగొట్టుకొని అసాహాయ్యులై ఇంద్రియనిగ్రహము లేక, దురభ్యాసములకు లోనై నిష్ఫలజీవితు లగుదురు. ఒకటి రెండుమారులు వారికి సహాయము చేసి, వారి తప్పిదములను మన్నించుట సమంజసమే, కాని వారు మఱల మఱల నపరాధములఁ జేసినచో పలుమరు వారిని మన్నించి సాహాయ్యము నేయుట పొరపాటు. వారొకటి రెండుమాఱులు చేసిన వాగ్దానములను చెల్లింపనితరువాత వారిని నమ్ముట గొప్పపొరపాటు. వారి పలుకుల నూరక నమ్ముట వెఱ్ఱితనము." సుశీల దిగులుపడెను. సుశీల—"ఒకవేళ నట్లు సాహాయ్యము చేయనిచో, వారు వారి దురవస్థయందసాహాయ్యులై, నిరాసఁ జెంది, దీనముగ కృంగిపోయినచో తల్లిదండ్రులును, స్నేహితులును పిదప పశ్చాత్తాపముఁ జెందరా!" అనియెను. అతఁ డనుమానింపలేదు. రామారావు తల నల్లల నాడించుచు, "మంచివాడయినచో నట్లెన్నటికిని కృంగడు. అంతమాత్రపు స్వయంసాహాయ్యశక్తి లేనిచో మొగవా డనిపించుకొనడు. రెండుమూడుమాఱులు అసహాయదశలో వచ్చి యొరుని దనకు సాహాయ్యము చేయుమని యెప్పుడువచ్చుచో వీనికి దుఃఖముల యనుభవమే మందు! వాని నెట్లో నాదురవస్థ ననుభవింప జేయవలెను. స్వయంకృతాపరాధముల ఫలమును బొందనీయ

వలెను. అటుగాక వారికి సాహాయ్యముచేయుట వారిని దుష్ప్రవర్తకులు కం డని ప్రోత్సహించుటే! అట్టి యుపకారమును హితుడగు నావంటివా డెన్నడును చేయకూడదు" అని మెల్లగను దృఢనిశ్చయముతోడను పలికెను. ఇప్పటికి వారు వైద్యశాలను సమీపించిరి. సుశీలమ్మ యీమాటల నర్థము చేసికొనెను. అనిరుద్ధుని హితముగోరియే ఈ స్నేహితు డాతని కావశ్యక మని దీనముగ నడుగుచున్న మొత్తమును పంపుట లే దని యీమె గ్రహించెను. కాని యీమె యేమి చేయుఁ గలదు? హృదయ మారాటము జెందుచుండెను. కృష్ణారావు గారి పిమ్మట జమీందారు కాగల సుపుత్రు డిట్టి యవస్థ బొందుచున్నాడు. ఏమి పాడుదినములు! అని యీమె యను కొనెను. ఇత డిట్టి చెడునడతల దిరుగుటకుఁగల కారణము తండ్రి యాజ్ఞ లేకపోవు టని యీమె గ్రహించెను. అట్టికఠినయు ఋజుపద్ధతియు నప్పుడు నేర్పమి నింత వుట్టినది. వానిని నిందింప నేల? ఆచిన్నతనపులేఖ యీతని భయంకర భవిష్యత్తును గప్పి పుచ్చుచున్నదో యనున ట్లుండెను. నీలపురజమీందారి గౌరవమునకును తనగౌరవము నకునుగూడ నీతనిని శాపవిముక్తునిగ జేసి సంస్కరించుట ముఖ్యము. అతనిని బాగుచేయవలెను. ఈమాఱుమాత్ర మాతనిని దీనావస్థనుండి కాపాడవలెను. ఈయొక్క మాఱుమాత్ర మాతనికి ధనము నందజేయవలెను. కాని ఎట్లు? రామారావును పంపు మనుట మంచిదికాదు. పంపడు.

తనయొద్ద నేమియు లేదు. ఎవరి నడుగవలెను? ఏమి చేయవలెను? సంతకములేకయే కృష్ణారావుగారి కొకకమ్మ వ్రాసిన? — కూడదు. అట్లు వ్రాయుట ప్రమాదకరము. పాప మనిరుద్ధు డాయనకు తెలియనీయ కూడ దని బ్రతిమాలు కొని యుండెను. శివరామయ్యగారి నడుగుటయు బాగుండదు. ఆయనకూడ నిదివఱకే మెకు సాహాయ్యము చేసియుండిరికదా? అయిన నేబదిరూప్యములు కావలె నని యడిగినచో బదులిత్తురు కాని, ఎందులకో చెప్పకున్న బాగుండునా? ఈసంగతి నాయ నకు చెప్ప నెట్లు సాహసింపఁగలదు? తన వేతనముతో దీర్చుకొం దునన్నచో నెవరు బదు లిత్తురు? అప్ప యీామె దీర్ఘాలోచనము సేయుచుండెను. వీ రిరువురు నంతట చిన్నస్వామికొడుకుదగ్గరకు పోయిరి. సుశీల "చూడుడు. చాల జబ్బుగ నున్నాడు!" అని రహస్యముగపలుక, రామారావు— "అవును. బహుజాగ్రత్తగ నుండవలెను. మీా రించుక విశ్రాంతిఁ-దీసికొనుడు. నే నిచ్చట వీనిని గనిపెట్టి యుందును." సుశీల—మందహాసముతో "నాకు విశ్రాంతి యేమి? తక్కిన రోగులను చూచి యొక గంటలోపల మఱలివత్తు నుండుడు." రామారావు పోవుచున్న గంభీరవిగ్ర హమును చూచి జాలిపడెను. ఆమెను గూర్చి యాశ్చర్య ముతో తలంచుచునే యచ్చట కూర్చుండెను. తరువాత శకుం తలను గూర్చిన తలంపులు. ఇంతలో నారాయణరావు, అని రుద్ధుఁడు తలంపునకు వచ్చిరి. భావములు విద్యుచ్ఛక్తివేగ

మున మాఱుచుండెను. తనకును శకుంతలకును వనవిషయమున దారతమ్య మున్న నేమి? ప్రేమ యంతర మెఱుంగునా? ఇది శ్రేయస్కరము కాదు. శకుంతలకు దురదృష్టమును కలిగింప కూడదు. తనపొట్ట పోషించుకొనుటకు పాటుపడు నొక డాక్టరున కీజమీందారు బాలికను వివాహము సేయుట కూరిరము. అన్యాయము. నే నీకోరికను త్యజించెదను. నిజముగ నామెకు కూడ నాయం దనురాగమున్నను, ఆమె కీ కష్టజీవనమును గలిగించుట బాడి కాదు. నే నంతకూరిరముగ నామెను బాధింపజాలను.——అని యింక నేమేమో తలంచుచుండ శ్లేష్మ మెుగ తట్టుటవలన నూపిరి దిరుగక వచ్చు గుఱక యాతని నదరిపడు నట్లు చేసెను. ఆ బాలునికి రోగము వృద్ధియైనది. విషశ్లేష్మము కంఠమున కెగదట్టుచున్నది. శస్త్రముతప్ప వేరెద్దియు నీవిషమును దీసివేయజాలదు. ఇక నాలస్యమయినచో కొన్ని నిమేషముల కది రక్షింపజాలనిదై బాలుని చంపును. ఆతల్లిదండ్రుల ముద్దులు, ముచ్చటలు ఎల్లను పోవును. విషము కంఠమున చుట్టుకొను చున్నది. రామారావు తత్తరపడెను. ఈ శస్త్రమునకు గంఠమున నుపయోగింపతగిన పరికర మప్పుడీ వైద్యశాలయందు లేదు. పాతిరది పోయినది. క్రొత్తది రాలేదు. అయిన నొక్కసాధన మున్నది. అతని కొక యాలోచనము కలిగెను. ఇప్పు డా విషమును రబ్బరుగొట్టము వెంబడిని నేను పీల్చిన నా కా భయంకరరోగ మంటుకొనును. ఆరోగము

నాకే వచ్చి మరణించిన మాత్ర మేమి? నా కిక సుఖము లేదు. ఇట్టి బ్రదుకు బ్రదుకనేల? ఈలోకమున నిక నా కేయాస యున్నది? ఏమి సంతోష మున్నది? ఈబాలుని ప్రాణముకన్న నాబ్రదు కెట్లు మిన్న? నేనుపోయినచో నాతల్లిదండ్రు లేడ్తురు. అకాలమరణ మని పరితపింతురు. మాతండ్రి కుడిచేయిపోయి న దని దుఃఖించును. అయిన నేమి? ఒక ప్రాణమును రక్షించి దేహమును బాసి యశమొందగలను. సౌఖ్యము పొందగలను. రాగల జన్మమున శకుంతలఁ జేపట్టెదను. అనుచు నాతడు మోకాళ్ళపైన వంగి నిశ్చలముగ ధైర్యముగ నొక శస్త్రాయు ధమును దీసి యాశిశువుకంఠమున జిన్నబొరియఁ జేసి దాని లో సన్ననిరబ్బరుగొట్టమును పెట్టెను. ఇంకొక నిముషములో నా బొరియలోని దుష్టవిష మాతడు పీల్చెను. దేవపరమేశ్వరా యని వంగెను. తనపెదవులను తెఱచి పీల్వబోయెను. ఆక్షణ మున దటాలున నొకస్త్రీయొక్క కర మాతనిని ప్రక్కకు బడు నట్లు త్రోసివైచినది. 'బాబూ, నీవుపలదు, నీవుకూడదు. నేనే చేసెద'నని, రామారావు వారించులోపలనే సుశీల విషమును రబ్బరుగొట్టమువెంబడిని పీల్చి తన నోటి నౌషధములతో కడిగి కొనినది. కాని యాజబ్బు మెకు వచ్చినది. ఈమహాత్యా గము నెల్లూర నెల్లరకుఁ దెలిసెను. సుశీలకు తీవ్రమైన జ్వర ము వచ్చెను.

# పదునెకండవప్రకరణము

## —శకుంతలపెండిమాట—

"లేదు బాబూ! ఈపట్టణపుచదువు వచ్చినతరువాత మీరుబొత్తుగ పాడయిపోయినారు, అరవదేశపుకోళంబు చారులు. మనకు బనికిరావు. విధివిరామములేని క్లేశము, ఆలోచనము, చదువును, దేహాపటుత్వమును బాడుచేయక మానవు. మీరు చిక్కి శల్యమైపోయినారుకదా!" అని వెంకయ్య పలుకగ అనిరుద్ధుఁడు నవ్వుచు, "ఎల్లప్పుడును మే మూరక చదువుచుందుమనుకొనుచున్నావా? మేము రాత్రింబవళ్లు ఆటపాటతో విలాసముగ కాలము గడపుచుందుము. మాన్యాయింగ్లను స్కూలు భూలోకస్వర్గమునుమీ! మాయుపాధ్యాయులును మాతోకలసి యాటపాటలందు మెలగుదురు." వెంక—"ఏమో బాబూ! ఆటలు పాటలు మిమ్మింతదిగ దీయవు. మీకన్నులు గుంటలువడినవి. రక్తముచెడిపోయినది. దేహ మెండినది. చేతులదార్ఢ్యము తగ్గినది. బాబూ! ఈలక్షణము లెంతమాత్రమును బాగుగ లేవు. మీరూపము నాకు భీతిఁగొల్పుచున్నది." అని రుద్ధుడు మరల పకపక నవ్వి, "ఏమియు భయములేదు. నా కీప్రయాణబడలికవలన నింత నీరసముగ నున్నటు లున్నది.

నాలుగుదినములలో మఱల నెప్పటివలె నుందును." అని వెంకయ్యతో కబురులు చెప్పుచుండెను.

అప్పుడుజమీందారిణి తనపరిచారికతో మాట్లాడుచుండెను "నాకు భయముగ నున్నది. అతడు పెండ్లి స్థిరపఱచుకొన్నచో నన్నప్ప నన్ను నిలువనిచ్చునా? అన్నప్ప నూరకుండునట్లు చేయలేము. అశక్యము. ఆనాడు సింహాళముపిషయమున తడబడి యవమానము చెందినప్పటినుండియు, నీతనితోడి చెలగాటము భయంకరమైపోయినది. వీడు తంటాలుపెట్టుచున్నాడు. భీష్మించి శకుంతలావివాహ మగువఱకు నొకరాగి దమ్మిడినైన నీయ నని శపథము చేసినాడు. మనము ధన మంపనిచో నాపత్రికనుండియు గష్టమే ప్రాప్తించును." అని తలపై జేయి పెట్టుకొనెను. మందార—"మొన్న నాతనికి బంపుట కెట్లు సమకూర్చితివి?" జమీందారిణి యించుకతడవు సందేహించి యూరకొని మఱల "అన్నప్పదగ్గరనుండియే. అతడింకను బూర్ణముగ వట్టిపోవలేదు. అయిన నిక నొకదమ్మిడియైన నీయ నని కఠినముగ చెప్పివైచినాడు. ఇక నొక్కమాఱుగ మనపై బడును. అబ్బా పాడుదినము. ఇంతక్లేశము నెన్నడును పడియెఱుగను." అనుచు జమీందారిణి పెద్ద నడవలోనికి బోయెను.

అంత కృష్ణారావుగారు వచ్చి, "ఇదిగో! ఒకశుభవర్తమానము. మననారాయణరావుకు శకుంతల నీయ నిశ్చయించి

తిని. ఇక ముహూర్తనిశ్చయమే తరువాయి. జమీందారిణి నిర్ఘాంతపడెను. తత్క్షణము తెలివిదెచ్చుకొని మెల్లన " బాగుగనే యున్నది." అని "నారాయణరావుగారూ! మీరదృష్టవంతులరు. ఇంతపడుచు పెండ్లాము - సౌందర్యవతి - సద్గుణశాలి - దొరకుట దుర్లభముకాదా! శకుంతలయు నదృష్టవంతురాలే." అని తనకోపము నీయెత్తిపొడుపులలో చూపెను.

అప్పుడు అనిరుద్ధుడు శకుంతలయు మాట్లాడుకొనుచుండిరి. అనిరుద్ధుడు ".శకుంతలా! నా కిదెల్ల తెలియుటలేదు. చాలచిత్రముగ నున్నది. నాచారిత్రముకన్న చిత్రము. నాసంగతి చెప్పుకొనుట నా కిష్టములేదు. కాని . నాయవస్థయు బాగుగలేదు." శకుంతల—దుఃఖముతో "అన్నయ్యా! మఱల పందెములలో దిగితివా? నాకు చేసిన వాగ్దానమును తప్పితివా!" అనిరుద్ధుడు—"ఏమిచేయగలను? నాతోడివారు ఒద్దునప్పుడు నే నొద్దకెట్లుందును? ఒక్కమాఱు - ఇంకొకమాఱుమాత్రమే యని దిగి మైమఱచుచుందును. ఇదిజూదమే కదా! నాల్గురూకల గెలువబోయి ఉన్న నాల్గిటిని నష్టపడుచుండుట మానవస్వభావము. చెయిజాఱిన పిదప పశ్చాత్తాపమువలన నేమిలాభము? ఇకముందు జాగ్రత్తగ నుందును." శకుంతల— "అయ్యో! గొప్పజమీందారునిబిడ్డవగు నీవు కూడ!" ఆమెశోకము విషాదము నామెకంఠమును వడకించినవి. ఈయార్తనాద మాతనికి శూలమువలె నాటెను. అయిన

నాతని కదా తటాలున జ్ఞాపకము రాగా "శకుంతలా! ఐదు దినములక్రిందట పంపినవారిపేరులేకనే ఏబదిరూప్యములు ఒకకవరులో వచ్చినవి. దీనినిగూర్చి నీ వేమైన నెఱుఁగుదువా?" శకుంతల యాశ్చర్యపడెను. "ఏమీ! ఏబది రూప్యములు నీ కెవరో పంపినారా? ఎట్టిట్లు? చెప్పుము." అనిరుద్ధుడించుక సిగ్గుపడెను. కాని "మఱలవినుము చెప్పెదను. కొన్నిదినములకు ముందు గుఱ్ఱపుపందెములలో నారాయణరావు రెండువేలరూపాయిలు గెలిచెను. అందువలన నాకు నొడ్డవలెననుకోరిక కలిగినది. ఒడ్డితినికాని నేను దురదృష్టవంతుడను. అందువలన నాకు లాభము లేకపోవుటయేగాక నాయసలు కూడ పోయెను. నేను చిక్కులలో పడితిని. అందువలన నేబది, యిరువదిరూప్యములను బదు లిమ్మని రామారావునకు వ్రాసితిని." శకుంతల—యదరిపడి "రామారావునకా?" అనిరుద్ధుడు:—'అవును. రామారావునకే, ఇతఁ డట్లు నాకటి రెండు మాఱులు సాహాయ్యముఁ జేసి యున్నాడు.' శకుంతల—యవమానితవలె "అయ్యో! అన్నయ్యా, ఎంతపని చేసితివి! స్నేహితులకడ ఋణములా!' అనిరుద్ధుడు:— 'ఏమీ! స్నేహితుల కడ నవసరమున్నప్పుడు బదులుపుచ్చుకొనుట తప్పా!! ఎంత వెఱ్ఱిదానవు; నాకు బదు లిచ్చుట కాతడు సందేహింప డను కొంటినిగాని ఈమాఱు నీహితమును గోరియే కను నీకు ధనము నంప దలచుకొనలే దని ప్రత్యుత్తర మిచ్చినాడు.

నాకు కష్టముగ నుండెను. ఏమిసేతును దైవమా! యని దీను డనై యుండ, నొకకవరు వచ్చినది. దానిపైన పేరులేని పోష్టుముద్రి యుండెను. అం దేబదిరూప్యములనోటుండెను. ఆరూపాయిలను నీవు గ్రహించుమని జిలుగువ్రాత యున్న చీటియు నుండెను. ఆవ్రాత పోల్చుకొనవీలులేదు. ఒకవేళ నాయుదను నెఱిగి శివరామయ్యగారు పంపినారేమో? యన నాకు కావలె నని యెట్లు తెలియును? ఆలేఖను గామూరావు ఇతరులకు చూపువాడుకాడు. అదిగో నారాయణరావు బ్యాంకిఏజెంటుతో మాటాడుచున్నాడు. తనవివాహమ హోత్సవమునకొఱకు ధనమును తీయుచున్నాడుకాఁబోలు! ఈవంకకే జమీందారిణియు చూచుచున్నది. మన మేమో రహస్యములను మాటాడుకొనుచున్నా మని యీమె యెల్ల ప్పుడు నేడ్చుచుండును.” అనుచు వీరిరువురును భవనములో పెద్దగదిలోనికి వచ్చిరి.

---

# పండ్రెండవ ప్రకరణము.

---

## —• అనిరుద్ధునిపైననుమానము •—

“ఏమీ! మీచేవ్రాలును సృష్టించిరా ఎంతపని జరిగి నదండీ!!” అని జమీందారిణి యాశ్చర్యముతో పలికెను.

కృష్ణారావుగారు—"అయితే యిది యెవ్వరు చేసినారో, మీకేమయిన నెవరిపైననైన ననుమాన మున్నదా ?"

నారాయణరావు—"లేదు. కేమి ? ఉన్నది. నాకు నిశ్చితాభిప్రాయమే యున్నది"

అని కొంచెము తొందరలాడుచు ననిరుద్ధుని జూచెను. కాని అనిరుద్ధు డిది గమనింపలేదు. ఎక్కడికో పోవుచుండెను. నారాయణరావుగారును లేచి 'ఇప్పుడే వచ్చెద' ననుచు వెడలిపోయిరి. అప్పుడు తోటలో నడచిపోవుచున్న అనిరుద్ధుని జూచి, 'అనిరుద్ధా!' యని గంభీరమగు కంఠస్వరముతో పిలిచిరి. ఈ పిలుపుధోరణి అనిరుద్ధు నదరిపడునట్లు చేసెను. అతడు తిరిగిచూడ—నారాయణరావు—'ఆగుము' అనెను. అనిరుద్ధుడు మారుమాటాడక నిలిచెను. నారాయణరావున కనిరుద్ధునికి తండ్రికాదగల యీడున్నది కాని అనిరుద్ధునితో సహవాసముచేయు స్నేహితునివలె మాటాడును. నారాయణరా విప్పుడు తీక్ష్ణముగ 'ఎచ్చటికి బోవుచున్నావు?' అని వింతస్వరముతో విరసముగ బలుక, మఱియు నాశ్చర్యముతో, అనిరుద్ధుడు—'రంగయ్యగారింటికి బోవుచున్నాను. సరియే కాని, నీ వీ దినమిట్లున్నావేమి ? ఒకవందరూప్యములు పోయినచో నీ వింతకుందెద వని నేను కలనైనను దలపనైతిని! మఱియు శకుంతలను పెండ్లాడునవసరమునగూడ నింతవిచారమా?' నారాయణ—'అవును. నీ కెల్ల నిట్లే అలక్ష్యముగ గన

బడుచుందును.' అని వివర్ణునవ్వుతో నారాయణరావు తనచేతి లోనుండు హుండీని చూపుచు 'ఒకనిచేవ్రాలు ననుకరించి ఫోర్జరీ చేసి సొమ్ము దొంగిలించిన దోషి జమీందారుబిడ్డయగుట చిత్రము!' అనెను. అనిరుద్ధుడు నిర్ఘాంతపడెను. తల దిమ్ము-రోషము-నొక్కమారు కల్గెను. పిడుగుపడినవాడుబోలె 'ఏమీ! ఇది నేను చేసితి ననియా నీ యభిప్రాయము? అట్టి నీచకృత్యమును చేయఁగలట్టివాఁడ ననియే నీవు తలంచుచున్నావా?' నారాయణ—'అవును. ఈదినమువఱకు నంతటి ఘనుడ వనుకొనలేదు. ఇంతటివ్రాయసకాడ వనుకొనలేదు. కాని నిశ్చయముగ నీయనుకరణమును నీవే చేసితి వని నాదృఢ నమ్మకము. ఇది నీవే చేసితివి.' అనిరుద్ధుడు – 'ఆఁ! నిజముగ నీవు పొరపాటు పడుచున్నావు. ఈమాట నింకొక డన్నచో వాని నాక్షణమున నేలఁబడగొట్టియుందును. మా కందఱకును బందుగుడవైతివి. లేకున్న ఈమాట యనినందు కీక్షణమున ఖంపివైచియుందును.' అనిరుద్ధునికన్ను లెఱ్ఱవడియెను. పట్టలేనంతకోపము వచ్చెను. నిష్కారణముగ నింతటి యపకీర్తి-అపనింద- తనకుఁ గలిగినదికదా యనురోషమును విషాదమును కలిగెను. వీరి తొందరలో కోపములో వీరికి దగ్గరగ పాదములసడి వినవచ్చుటకూడ గమనింపలేదు. నారాయణరావీమాటలు నమ్మనివాడుపోలె తీక్షణముగ జూచుచుండెను. అనిరుద్ధుడు మఱల 'నీకు మతిపోయినది. మఱల నిట్లనవలదు.'

నారాయణరావు వెక్కసముగ—'అవును. అట్లే తోచును. కర్ణ
కఠోరముతే! నిజ మెప్పుడు నిష్ఠురమే కదా? ఉన్నమాటన్న
ఉలుకు. అయినను నీవిషయమున దాచుటకు వీలులేకపోయి
నది. నీవు గొప్పయింటివాడవు. మఱియు నాకు స్నేహితుఁడవు.
కాఁగల బంధువుఁడవు. అందువలననే ఇది మఱింత అన్యా
యము- నీచము నైనది. నీ కింత యావశ్యకమైనచో దిన్నగ
నన్నే వచ్చి యడిగియుండిన నేమియనా?' అని నిష్ఠురముగ
తీవ్రముగ కోపముతో పలికెను. అనిరుద్ధుడు—'నారాయణ
రావూ! నిజముగ నీవు నాయందనవసరముగ ననుమానపడు
చున్నావు. వేఱెవ్వడైనను ఇట్లు పలికియుండినచో వాని కార
ణముననే బుద్ధిచెప్పియుందును. కాని నీవిషయమున నట్లు ప్రవ
ర్తింపను. ప్రబలకారణములవలె తోచు ననుమానము- అపో
హము - లేనిదే, ఎవ్వరో నాపైన నిందనువేసి నిన్ను నమ్మిం
పనిదే ఇట్లు పలుకువాడవు కావు. అయినను నీకు స్పష్టముగ
చెప్పుచున్నాను. ఇక నీ వీయనుమానముఁ బెట్టుకొనవలదు.
నన్నన్యాయముగ నిందింపవలదు. నేను నిర్దోషిని. మనో వా
క్కాయ కర్మముల ననపరాధిని; శకుంతలతోడి పెండ్లి,
నాతోడి స్నేహము నేల పోగొట్టుకొన జూచెదవు? నేను నిజ
ముగ నెఱుఁగ నని చెప్పినచో నీవు నమ్మవా? నే నంతదు
ర్మార్గుడ నని యెంచుచున్నావా? నే నీమధ్య నొడ లెఱుగక
చెడుతిరుగుడు తిరిగియుంట నిజమేకాని నాకు బుద్ధివచ్చినది.

పశ్చాత్తాపము కల్గినది. త్వరగనే తెలివితెచ్చుకొంటిని. దొంగ
సృష్టినిచేసి ధనము నపహరింపగలట్టి నీచబుద్ధి నాకు కలుగ
లేదు. ఒకమానవునిముఖమునెదుటనే యసత్యముల బలుక
గల మొండిధైర్యమును కఠినస్వభావమును కలుగలేదు.' అతని
దాకుటే పాపమో యనునట్లు నారాయణరావు అనిరుద్ధునికి
దూరముగ జరుగుచుండెను. 'అనిరుద్ధా! నీవూరక లేదన
కుము. నీపలుకులు తప్పవే రేనిదర్శనమును నీకు లేవు. నాకు కన
బడినప్రబల కారణముల గా దనఁగలవా? కుఱ్ఱవాడా! లాభ
ము లేదు. నీ నేరము నకునిదర్శనము లనేకములుంవు.'

అనిరుద్ధుఁడు:—(ఉగ్రుఁడై) ఏమినిదర్శనములు?

నారాయణరావు:—సరియే వినుము. దొంగసృష్టి తేదీని
చూడుము! ఆ తేదినే నీవు రహస్యముగ నాయొద్దకు పట్టణము
నుండి వచ్చితివి. నీకు ప్రయాణవ్యయముకూడ లేదు. నీవు
నిజముగ నన్ను బలవంతపెట్టి నూరో నూటయేబదియో కూడ
అడిగినను మిన్నక యిచ్చునంతటి బుద్ధిహీనుఁడనే; కాని నీ
చిక్కులెల్ల నేకరువుపెట్టి నిజముచెప్పుటకుబదులుగ నేబదిరూప్య
ములతో చిన్నపద్దులెల్ల తీరునని చెప్పితివి. నిజము చెప్పుటకు
నీవు సందియముఁ జెందితి వనుట నిశ్చయము. ఇదియే నిన్ను
జెలిపినది. నీవెల్లప్పుడు వన్యాయవిత్త సమార్జనము నకుఁగడం
గెడివాడ వని నే ననుటలేదు. అయిన నాదుర్దినమున నే నాక
చ్చేరిగదియందు కొన్ని నిమేషములు లేకపోవుటవలన, ఆహుం

డీపుస్తకము బయటపడియుండుటవలన, నీబుద్ధి కప్పురితిపడి నది. ఎవ్వరో వచ్చి రని కబురువచ్చుటవలన నేఁ బోయి యుంటిని. జ్ఞాపకమున్నదా? నే నట్లుపోవుటకు ముందుగ నీ కేబది రూప్యములకు హుండీని వ్రాసి యిచ్చియుంటినికదా! నేనట్లు తొందరగ బోయి యుండుటవలన నా కాహుండీలపుస్తకమును బెట్టెలో పెట్టికొనిపోవు నవకాశము చిక్కినది కాదు.

అనిరుద్ధుడు—(తలనూపుచు) ఔను. నీ వాపుస్తకమును మేజపైననే వడవైచి పోయితివి. నేను నిక నచ్చట నున్నచో నెవరైనను వచ్చి చూచిపోవుదు రనుభయమున తత్క్షణమే వెడలిపోయితిని.

నారాయణ—(తల నాడించుచు కనుబొమలెత్తి) ఆఁ! నేను పోయినపిమ్మట సాధ్యమగునంత త్వరగనే నీవును పోయితి వనుమాట నిజమే. నిదర్శనములను చూపెద నుండుము. నే నాపుస్తకమును నీయెదుటనే యట్లు పారవైచి పోయితిని. అప్పుడు జమీందారిణిగారు వచ్చియుండిరి. నేను తరువాత నీకొఱకు వచ్చి చూడ, నీవు లేవైతివి. ఆపుస్తక మట్లే తెరచిపడియుండుటను జూచి, అనుమానింపకయే దాని నెత్తి పెట్టెలో బెట్టితిని. ఇప్పుడు చూడగా నేను నీ కిచ్చిన హుండీ తరువాత వరుసనెంబరు హుండీయేయిూసృష్టిది! పొరపాటున వ్రాసిన హుండీ పత్రిక్కాగితమునుగూడ నేను నీ కిచ్చితి

నేమో యనుకొంటిని. లేనిచో నీవే చింపిస్పష్టి చేవాలు చేసితివో !!

అనిరుద్ధున కొడలు మండెను. కంపముతో నొడలు దెలియక అతని హాతమడచుటకువలె ముందుకు దుమికెను గాని, నారాయణరావు తప్పించుకొనెను.

నారాయణ:—అనిరుద్ధా ! వృథగ నేల యెగిరెదవు ? నీవు నిదర్శనము లేమని యడిగితివి. నేను చెప్పుచున్నాను. ఆసమయమందు నాకు రెండు వేలు జమకలదని నీ వెఱుగుదువు. తరువాత నీవు నాదగ్గఱనుండి న్యాయముగ దీసికొనిన ఏబది రూప్యములతో పట్టణమునకు బోయినపిదప నూరునూట యేబదిరూప్యములవరకు వ్యయము నెట్లు చేయగలిగితివి ? ఇన్ని వింతవస్తువులు కొనినపిమ్మటకూడ నీదగ్గర ధనము మిగిలినదే.

అనిరుద్ధుడు:— నేను పట్టణమునకు బోవగనే నాకేబది రూప్యములు వచ్చినవి.

నారా:—ఎట్లు ? ఆకాశమునుండి యూడిపడినవా ?

అని:—(కలతతో) పేరును సంతకమును లేక యే యేబది రూప్యములనోటును కవరులో బెట్టి యెవ్వరో నాకు బంపిరి.

నారాయణరావు పకపక నవ్వెను. అనిరుద్ధున కొడలు తెలియ లేదు. అతని కేమియు తోచుట లేదు.

నారాయణరావు :-ఓయీ! నీకు దొంగతనపువారితలో గల తెలివి తేటలు, యుక్తులు చెప్పుటయందు లేవునుమీ ! ఏమి-

చమత్కారకథలను చెప్పుచున్నావు? ఎవరు నమ్మెదరు? ఈ కాలమునం దేబదిరూప్యముల నపాత్రదాన మొనర్చు దాతకర్ణు లెవ రున్నారు? ఎవరు పంపియుండురు?"

అనిరుద్ధుడు :—నాకు తెలియుటలేదు. నాకు ధనమావశ్యక మని రామారావున కొక్కనికే వ్రాసితిని.

నారా :—అతఁడు పంపినాడా?

అనిరు :—లేదని వ్రాసినాడు!

నారాయణరావు సగర్వముగ తల నూపుచు, "ఎందులకు పంపును? నే నెఱుఁగనా?" ఇట్టు ములికివలె నాటెను.

నారా. :—కడపటి నిదర్శనమును చెప్పెదను వినుము. రామస్వామి యనువానికి నే నైదురూప్యముల నీయవలసియుండ అతనిపద్దునుగూడ తీర్చికొని తక్కినధనము దెమ్మని యాతనినే హుండీనిమార్పఁ బంపితివట. అతనిచేతనే నేను నా హుండీలను మార్పించుచుందు నని నీ వెఱుఁగుదువు. నాసంతకమున్నచో నాతని కేల యనుమాన ముండును. అందువలన నాతడు మార్చి తొంబదియైదు రూప్యములను నీ రాయబారి కిచ్చినాఁడట!

అనిరు :—ఏమీ? నారాయబారియా? ఎవ్వరు?

నారాయణరావు :—అవును. నీవు పంపినదే ఎవ్వరెయో ఒక యాడుదియట. అట్టిమానిసి నీత డీవఱకు చూచియుండలే దట.

అనిరు :— ఆమె నేను పంపినానని చెప్పినదా ?

నారా :—ఆసంగతి నే నెఱుగను. రామస్వామి నడిగిన చో తెలియునుకాని నీవుకుతర్కములు చేయకుము. నాదగ్గర నీ యాటలు సాగవు. నే నీసంగతి బయటపెట్టినను పెట్టకున్నను, ఇది తప్పక నీవే చేసితి వనుసంగతిమాత్రము నిశ్చయము. న్యాయ స్థానమున కీడ్చినచో నీ కేగతియో తెలియునా?

అనిరు:— నే నెఱుగను. ఎఱుగవలసినపనిలేదు. నే నే యపరాధమును జేసి యుండలేదు. నా కేభయమును లేదు. నీ వంతటి వెఱ్ఱిపని చేయదలచినచో చేయుము. మనోవాక్కా యముల నిర్దోషిని. నమ్మిన నమ్ముము. లేనిచో నమ్మకు. నిజముగ నాకు సొమ్ము నెవరో నే నెఱిగినవారే, పేరు చెప్పదలంపక అట్లు పంపినా రని నానమ్మకము. అం దీ ధనమును గ్రహింపుమని వ్రాసినచేవ్రాత పోల్ప వీలులేక పోయినది.

నారాయణరావు:—అట్టిచీటీని నీవే పోల్ప వీలు కానట్లు వ్రాసితివేమో! అట్లు నీదగ్గర నధికముగ నున్న రొక్కమునకు కారణము సమర్థించుకొనుట కది మంచియుపా యమే! కాని ఈతెలివితక్కువ ఎవ్వరిదగ్గరను సాగదు. శకుంతల నాకు భార్య కాఁబోవుచున్నదిగనుక నీసంగతిని బయ టపెట్టను. మాతండ్రిగారికిమాత్రము చెప్పివైచెదను.

అనిరుద్ధుడు:—(అదరిపడి) మాతండ్రిగారికా! వలదు, వలదు. ఏమిలాభము? ఇందువలన నీ యనుమానము స్థిర పడదు. కాని తక్కినరహస్యములు, దోషములు, ప్రాతరంకు లు బయల్పడుటతప్ప వేరేలాభమును లేదు.

నారాయణ:— అవును. ఆరహస్యములు, అప్పులు, పందెములు, జూదములు.

అనిరుద్ధుడు తలవంచి కొనెను. నారాయణరావు:— నే ననుకొన్నంతపని జరిగినది. కళంకమును చెడ్డపోలికయు నెక్కడికి పోవును?

అని:— చెడ్డపోలికయా! చెడ్డపోలిక యేమి? ఎవరి పోలిక? నీయభిప్రాయ మేమి? స్పష్టముగ చెప్పుము. అని క్రోధముతోడను అనుమానముతోడను పలికెను. నారాయణరావు తా ననవసరముగ అనగూడనిమాట లనినం దులకు పశ్చాత్తాపముఁ జెందెను. తొందఱలో తనతల్లికళంకము నీతఁడెఱుగ డనుమాటను మఱచెను. తనయెదుటనే రెప్పవా ల్పక ప్రత్యుత్తరమునకై వేచి చూచుచున్న బాలు నీత డూరక చూచెను. ఏమని బదులుచెప్పవలెనో తెలియుటలేదు. ఇట్లా లోచించుచుండ భవనమునుండి యీవంకకు నడచివచ్చుచున్న పాదములసడి వినవచ్చెను. అనిరుద్ధుఁ డదరిపడి, 'అదిగో! హాయగ్రీవుఁడు. ఆదుర్మార్గపు అప్పప్ప గుమాస్త. ఇట్లు చూచి మఱలి పోవుచున్నాఁడు. ఇంటికిబోయియే యుండెను.

కాకోలు! ఇంతకుముం దిచ్చట నేదోశబ్దమైనట్టు లైనది. వీని కిక్కడ పని యేమి?' అనుచు హాయగ్రీవుని వంక కతి కూర్రముగ చూచెను. తలవంచికొని దీర్ఘాలోచనాపరుడగు హాయగ్రీవు డిది చూడలేదు. ఇంతలో అనిరుద్ధునిభావము మారెను. ఈర్ష్యక్రోధము, కోపమెల్లను పోయి, ఆశ్చర్యముగ, సంతసముగ బరిణమించెను. నారాయణరావు మోపిన నింద యీతని నుగ్రునిగ జేసినది. హాయగ్రీవుని యాగమనము మఱింత కోపము గలిగించినది. అయుద్రేక మిప్పు డదృశ్య మైనది. ఆఘాలమునుండి యీమబ్బు పోయినది. దానికి బదులు కళయు సంతోషమును వచ్చినవి. తనను నొక్కతుణ మునకు బూర్వమట్లు నారాయణరా వనినమాటనే మఱచెను. "అదిగో, శ్యామలయు, రంగయ్యగారును వచ్చుచున్నారు" అని వారిని జూచుచు నుత్సాహముతో ననెను. రంగయ్యగారి గంభీరవిగ్రహము, శ్యామల కోమలరూపము వారిపోలిక, తీరు చూచుచు పరవశుడయ్యెను. అంత ననిరుద్ధున కొకనూతన తలంపు కలిగెను. తనతాతయిచ్చిన సంపదవలన నిప్పుడు ధనికురాలైన శ్యామల తనయందలిప్రేమచే — అను రాగముచే — రామారావునకు తానువ్రాసిన లేఖను చూచి 'యిట్లులజ్జచేత పేరును చెప్పకయే, ఏబదిరూప్యములను బంపిన దేమో? యని యాత డనుకొనెను.

---

# పదుమూడవ ప్రకరణము

## —♦ గోరుచుట్టుపై రోకటిపోటు ♦—

"రామారావుగారూ! మీ రేల నిట్లున్నారు? ఏమి సమాచారములు?" అని మంచముమీద పరుండియుండిన సుశీలమ్మగా రడుగుచుండిరి. ఆమె తనగదిలోని ఇనుపమంచమును తన కాప్రక్క రెండువసారాలలోను బరుండిన రోగులను చూడవీలగునట్లు, కిటికీలమధ్య వేయించుకొనెను. ఆమె మోము పాలిపోయి, రక్తవిహీనమై నీరసమును దెలియఁజేయుచున్నను ఆమె సహజసాత్త్వికస్వభావము, శాంత కరుణారసములు వర్చస్సును పోలేదు. ఆమెకన్నులయందలి కాంతియు, పెదవుల చిరునవ్వు, నిప్పుడును తగ్గియుండలేదు. ఆమెతలకట్టు చెదరియుండెను. ఆమేలిముసు గిప్పుడు లేదు. ఆమంచము దగ్గరనే కుర్చీపైఁ గూర్చుండియున్న రామారావువంక నామె యిప్పుడు చూచుచుండెను. జమీందారుగారింటఁ నానాఁడు నారాయణరావునకు శకుంతల నీయ నిశ్చయించినా రనిన మాటను వినినప్పటినుండియు రామారావు విషాదమును బొందుచు లోలోన కృశించుచుండెను. ఇతనిమనసు మనసున లేదు. అప్పుడే మూడుదినములు కావచ్చినది. ఏదో గొప్పయాపద వచ్చి దీనుడై పోయినవానివలె నీతనిహృదయము తల్లడిల్లు

చుండెను. రోగాతిశయమువలన నీరసము జెందియున్న సుశీల
కీమార్పు సీతవాతవాయు తెలిసిపోయెను. ఆమె వేయికన్ను
లతో నాతనిని జూచుచుండెను. ఆమెరోగమున కితడత్యంతశ్రద్ధ
తోఁ జికిత్సజేసినా డని యీమె యెఱుఁగును. ఆత డెంతో
దుఃఖమును క్లేశమును బొందుచున్నను, తన యర్హవిధుల
నేమఱక నిర్వర్తించుచుంట నీమె చూచుచునే యుండెను.
అతడు తనకు చేసిన ఉపచారములు ఆదరణము నీమెకు
శీఘ్రముగనే యారోగ్యము కలిగించినది. ఇందుల కీమె కతని
యందలివాత్సల్యమును కృతజ్ఞతయు ప్రేమయు ద్విగుణీకృతము
లయ్యెను. ఇప్పుడు క్రమక్రమముగ నీతని దైన్యావస్థనుజూచి
యీమె చింతించెను. ఈమె యిఁక నూరకుండలేక "రామా
రావుగారూ! మీకుఁగల దుఃఖ మెట్టిది? శకుంతలను గూర్చి
కాదుకదా?" అతఁడు మాటాడలేదు. ఆమె యాశ్చర్య
పడెను. రామారా వూరక నాగదియం దిటునటు పచారు
చేయుచుండెను. "శకుంతలావివాహమును గూర్చి యీమె
కింకను చెప్పలేదు. నాదుఃఖము నీమెకు చెప్పి యీనీరసమునం
దీమెకు దుఃఖమునుకూడ ఏల కలిగింపవలెను? నన్నుబట్టియే
కదా ఈమె కీవిషయమున కుతూహలము!" అని యితఁ
డాలోచించుకొనుచుండెను. "అయిన నేల సందేహింపవలెను.
నిరాస జేసికొంటి నని చెప్పినచో నీమె కేలదుఃఖము కలుగును?
చెప్పివైతు". వని యీమె మంచముకడ నిలిచి "అవును. శకుం

తల నాకు దక్కడు. నారాయణరావుగారికి శకుంతల నీయ నిశ్చయించినారు." ఒడలు ఝల్లుమనెను. ఆమె మోము నట్లే యువతులవైపునకు ద్రిప్పికొనెను. అప్పుడే మందులిచ్చు కాలమగుట నామె వానిని చూచుచున్నదని యాతఁడనుకొనెనుగాని ఆమె కష్టము కలిగిన కలతను హృదయములోని ఆరాటమును, వేదనను ముఖమున, భావములయందు కనబడిపోవునని భయపడి దుఃఖము నడంచికొనుచుట్లు తిప్పుకొననని యాతఁడెఱుఁగడు. మనస్సును స్వాధీనపఱచికొని భావములు నడంచికొనగల శక్తి యీ తరుణమునవలె నెప్పుడును పోలేదు. ఆమె దేహస్థితి యామె కిట్టి అసహాయావస్థను దెచ్చిపెట్టెను. అట్లామె బాధ నొందుచు పెదవులను బిగపట్టెను. "తన పెదతండ్రిని చంపి, తల్లి నిరాపనిందకొఱ కధోగతినిబడి వరక ననుభవించుచుండఁ జూచుచు నూరకొనిన రాతిగుండె పాషండునికా? ఓదేవా! ఇందులకా నీవు నన్ను జీవింపఁజేసినది! ఇందులకా నా కెన్నికష్టములు వచ్చినను దీసికొనిపోవైతివి? ఈ క్లేశముకూడ పొంది యాతన ననుభవింపవలసిన వ్రాత నానుదుట కాబోలు! నాదుఃఖముల కంతము లేదా?" ఆమె మెల్లన దుఃఖము నాపుకొని, ఊరట జెంది, రామారావువంకకుఁ దిరిగి, దగ్గరకు రమ్మని సంజ్ఞచేసెను. ఆ మోమును జూచునప్పటికి రామారావు నిశ్చేష్టుఁడయ్యెను. ఆమెకన్నులరుణము లయ్యెను. ఆమె యుద్రేకము పొందుట

నిశ్చయము. దీనికి గారణము తనదురవస్థయేనా? "ఏమి మీకు బాధగ నున్నదా?" అని రామారావు పలుక సుశీల తలనూపి "లేదు, మీకై చింతించుచున్నాను. మీరు సఫలమనోరథులై సుఖముగనుండ చూడవలెనని నాయాశయము. ఇది దుర్లభ మని విచారించుచున్నాను. శకుంతల నారాయణరావుతో సుఖముగ గాపురముచేయజాలదు. ఏస్త్రీయు నాతనితో సౌఖ్యము పొందలేదు. అం దిట్టిసుకుమారి, సుగుణమణి యట్టిదుర్మార్గునితోఁ గాపురము జేయఁ గలదా?"

రామారావు:— అతఁడు దుర్మార్గు డనుటకు నిదర్శనము లేదు. చిన్ననా డేమిచేయువాడో కాని యిప్పు డెట్టి దుర్గుణము లితనియం దున్నట్లు కానరావు. దుర్మార్గుడు కాడు. అందువలన శకుంతల యదృష్టమువలనను సద్గుణములపరిభావము వలనను. అతడు సంస్కరింపబడి, సద్గృహస్థుఁడు కాగలడు.

ఇత డిట్లుమాటాడుచుండ సుశీలమ్మగారి చెవులలో హోరు కలిగెను. ఆమెకన్ను లశ్రుపూరితములయ్యెను. ఆమె మరల నాతనిని నిదానించిచూచి, తనగుట్టును వెలిబెట్టికొనకయే చెప్పఁగలదెల్ల చెప్పివేయ నిశ్చయించి, "రామారావుగారూ! ఒకదినము మనము వీధిలో పోవుచుండ జమీందారుహాస్యనుగూర్చివివాదమువచ్చెను. మీకుజ్ఞాపకమున్నదా?"

రామారావు:—అవును.

సుశీల:— నారాయణరావు ననుమానింప వీలున్న దని నే నన మీరు పరిహసించితిరి. అంత నే నా కేసులోని సాక్ష్యముల వాఙ్మూలముల నెల్ల చదివితిని. వాని నెల్ల బరిశీలింప నీహత్య నీతడే చేసినాడని నాకు దృఢముగ తోచినది.

రామారావు:— (వివర్ణముజెందినమోముతో) "అట్లె న్నటికి నై యుండదు. మఱియు నంతటిద్రోహి కింతటి ధైర్య మెచ్చటినుండి వచ్చును? శకుంతల నిట్లు ప్రేమింపగలడా?

సుశీల:—లోకమునం దెంతటివారైన గలరు. మీకు నేనొకరి నన్యాయముగ నిందింప నని తెలియునుకదా! నాకీ తనిపై నిట్టియనుమాన మేల కలుగవలెను? దోషమునిన నట్టిదో నే నెఱుగుదును. నిరాపనింద నొకనిపై వేయుటకు నేను జంకు దును. ఇతనిపై నాకు బూర్ణముగ ననుమానము కలిగినది. మీ రీనారాయణరావును గనిపెట్టి యుండరు. మీకుఁ జేత నైనచో, నీహత్యజరిగినకాలమునకు బదేండ్లకుబూర్వ మిత డేమేమిచేసెనో ఎక్కడెక్కడ కేయేకాలములఁ బోయెనో తెలిసి కొనుడు. శకుంతలపై నాస విడువవలదు. మీయౌవ్వ రత్నము, సత్యము, సద్గుణములు మిమ్ములను గాచును. పరమేశ్వరుడు మీకు శుభము నొడగూర్చును. ధైర్యముతో నుండుడు.

అని యింక నేమేమో చెప్పఁబోవు చుండ నామె కాయాసము కలిగెను. రామారావు కొంచెము మంచి

నీరు బుచ్చుకొమ్మన నామె వలదనెను. ఆమె కన్నులు మూసికొని, తలగడపై తల నిడికొనెను. ఆయాసముతోడ నాతలను గవాక్షమువంకకు ద్రిప్పిచూచుచుండెను. ఇంతలో నావసారాలోని కలకల మామె నాకర్షించెను. ఒకకొత్త రోగిని లోనికి, దీసికొని వచ్చుచుండిరి. రంగయ్యగారు ముందుగ వచ్చుచుండుటవలన నారోగి నాయన దెచ్చిరని యామె గ్రహించెను. ఆరోగి యొక యాడుది. బలమెగు మానిసివలెనే యుండెను. కాని యుద్రేకము జెందిన మోము భయంకరముగ నుండెను. ఆమెధరించినవి చింపిగుడ్డలు. ఒడలు ధూళిధూసరితమై యుండెను. జ్వరాధిక్యమును నుద్రేకమును సంధిలోనికి దింపినవి. ఆమెముఖము మాత్రము అసహ్యకరమైనది. చాలదుర్మార్గురాలని దుష్టవనిత యని చెప్పక చెప్పుచుండెను. ఆమె పిచ్చిమాటలను ప్రేలుచుండెను. ఇప్పు డారోగి నీగవాక్షము చెంతనుండి తీసికొనిపోవుచుండిరి. ఆమెమోమును సుశీల చూచెను. చూచి యీమోము నెచ్చట చూచితినా యని తలపోసెను. అతిభయంకర మగు పోలిక. ఆతలంపున నీమె కొడలు ఝల్లుమనెను. ఆరోగి తనచంచలదృష్టిని దటాలునసుశీలపై బరపి "అదిగో ఆస్త్రీ బందిఖానాలో నుండగా నే నెఱుగుదును." అని గొణుగుకొనెను. ఈప్రలాపములు రంగయ్యగారు విని ఉన్మత్తప్రలాపము లని యూరకొనిరి. ఆయన సుశీలమ్మను చూచి ఎట్లున్న దని పలుకరించిపోయిరి. ఆమె మోమున ఆయన

కేమార్పును కనబడలేదు. సుశీలమ్మ తనమనమున కలిగిన భయమును పైకిఁ గనబరచుట లేదు. ఆమె తనలో నీస్త్రీని తానెప్పుడు చూచితినా యని తలపోయుచుండెను. అదృష్ట వశమున నారోగి యనినమాట లీమెచెవిని పడలేదు కాని యీమె తనవంక చూచితన్ను గూర్చి యేమో పల్కుచున్నదని మాత్రము గ్రహించెను. ఈమె వీథులలో నెక్కడ గుర్తింప బడుదునో యని మెలగినభయ మిప్పుడు నిజమయ్యెను. ఆలోచింప నాలోచింప నామెకు తెటాలున నీవిగ్రహము తలపునకు వచ్చెను. ఆభూలోకనరకమనదగు కారాగారమున ! ఆమె కంపముఁ జెందెను. ఆహా ! విధిప్రేరణము ! ఆకఠినహృదయ యీమెను గుర్తించెను ! ఆయున్మత్త ప్రలాపములమధ్య నొక్క మాట తెలివి మెఱుపువలె మెఱసినది. "రంగయ్యగారువినిన మాటలలో నీమె తన్ను గూర్చి యేమైన చెప్పినదా యేమి? అయియుండదు. రంగయ్యగా రనుమానములేక నన్ను బలుకరించిరికదా" ఇంతలో రంగయ్యగారు మెస్టను దొరతో. "డాక్టరుగారూ! మీా కొకక్రొత్తరోగిని తెచ్చితిని. ఈనిర్భాగ్యురాలు బాటపై నొకప్రక్క పడియుండెను. ఈమె చాల దూరము నడిచివచ్చిన దని వినియున్నాను. ఈమెకు జ్వరము నుద్రేకము నధికముగ నున్నది. ట్రింకురోడ్డుమీాద పడియుండగ నప్పు డాదారిని పోవుచున్న రెండెడ్లబండిపై వైచి తీసికొని వచ్చితిని."

మెస్టను ఓహో! యనిమూర్ఛెను. తనచొక్కా చేతులను పైకినర్దుకొని "ఈమె దంటువ్యాధి కాదుకదా!" యనుచు నీమె నాడిని తొందరగ పరీక్షించి అట్టిరోగులకడ నెంతోకాలము నిలిచియుండలేదు గనుక "ఈమెనుత్వరగ పరుండబెట్టుడు. నేను మఱల వచ్చెదను" అని రామారావును చూచి, "ఇది టైఫాయిడు విషజ్వరము. జాగ్రత్త, నే నొకపెద్దమనుష్యునితో మాటాడివచ్చెదను; కొంచెము చూచుచుండుము. ముఖ్యోద్యోగిని యగు సుశీలసోదరి యిప్పుడు నిరుపయోగముగ నున్నది కనుక నామెతరువాత పెద్దయగు లక్ష్మిని నియోగింపుము."

రామా:—"ఆమె సెలవుదీసికొని పోయినదికదా?"

మెస్టను బొమముడివైచి "వీరలకెల్లప్పుడును సెలవులే" అని గొణుగుకొనుచు, సుశీల నెట్లున్నదనియైన నడుగకయే నాహైందవాంగ్ల యుద్యోగి పోయెను. రామారావు పని జూచుచుండి తరువాత మఱల సుశీలకడకు వచ్చెను. ఆమె కింకను లోపల జ్వరమున్నది కాని విషశ్లేష్మరోగము పోయినది. ఆమె "ఈక్రొత్తరోగి యెవరు" అని ప్రశ్నించెను.

రామా:- ఒక అనాథ. పేరు అప్పలమ్మ. చాల దేశ దిమ్మరి. ఆమెకొంగున నొకవిడుదలపత్రి మున్నదని దాది కమల నా కిచ్చినది. ఇది చాల భయంకరమగు టైఫాయిడు జ్వరము.

అంతట సుశీల మెల్లన నొకమాఱు కన్నులు చూచెను.

రామారావు—మీ కిప్పు డెట్లున్నది?

సుశీల—సులువుగనే యున్నది. నే నెప్పటికి లేచి తిరుగఁగల నందురు?

రామా—నాల్గయిదు దినములలో బలముగ లేచి తిరుగఁగలరు.

సుశీల—నే నిప్పుడే లేచి తిరిగినచో ప్రాణభయము కలదా?

రామా—లేదు కాని, మీరు చాలనీరసముగ నున్నారు. ఆయాస మధికమై మఱల జ్వరము రావచ్చును.

నీరసమేమి? రోగమేమి? ముందు తన జీవితము నెల్ల నిష్ప్రయోజనముగఁ జేయఁగల యీ దుర్మార్గురాలినోటిని కట్టి, లోఁబరచుకొననిచో చాల నపాయము సంభవించును. ఈమె తన పెదవులను గట్టిగ చేర్చి యాలోచించెను. రామారా వుండగ లేవనీయడని యీమె యెఱుఁగును. అందువలన నూరకొనెను. ఇంకొకగంట కాతడు పోయెను. తరువాత నీమె యానీరసస్థితిలోనే లేచి తన వైద్యశాలా వస్త్రములను ధరించికొనెను. తరువాత నప్పలమ్మమంచముదగ్గరకు పోయి కమలను పొమ్మని తా నుపచారములు సలుపసాగెను. ఈమె సాహసము, త్యాగము నీమె యన్న యానిష్ఠుడగు

మెప్టనుకుకూడ నాశ్చర్యము కలిగించెను. అతడు నీమె నిట్టి తగనిశ్రమను తీసికొనినందులకు మందలించెను. అంతట నీమె యిట్టిరోగిని లక్ష్మివంటి తెలివైనదానికితప్ప వేరెవ్వరకును విడువజాలనని చెప్పి యొప్పించెను. సుశీల యీరోగి నేమరక యొక్కనిముసమైన వదలక కనిపెట్టి యుండెను. ఆసంధి యెత్తి వదరుచున్న యామెకు చెవిమేర కనుమేర దూరము లోనే యుండెను. ఆమె యొక్కమాటైన రెప్పపాల్ప లేదు. రాత్రి నిదురించినచో నీమె యేమి ప్రలాపము లాడునో, తన్నుగూర్చి యేమిచెప్పునో యని భయపడెను. ఈస్త్రీకి తా నొక్కమారు వైద్యశాలలో నుపచరించి రక్షించియుంట జ్ఞాపకము వచ్చెను. కాని యీదుర్మార్గురాలికి కృతజ్ఞత యెక్క డిది? ఇది యమానుషస్త్రీ. అయిన నీ ప్రాణము నొక్క తృటిలోనే యమసదనమునకు బంపవచ్చును. ఈవిషజ్వరపథ్య మున నొక్కపొరపాటు - కొంచెము అశ్రద్ధ - ఈమె క్రూరమృగమునుండి విముక్తి కలిగించును. కానికలనైన నొకరికి హానిచేయక అహింసయే ప్రధానధర్మముగ గల సుశీలమ్మ ఈరక్కసిని - పిల్లనుచంపి శిక్షపొందినదోషిని- తనచేతులార చంపజాలదు. ఈమె కరుణార్ద్ర స్వభావము సత్యవ్రతము ఈమె నీవిషసర్పమున కావంతయైన నప కారము జేయనీయదు.

హయగ్రీవున కీమెయన్న చాలభక్తి. మెస్టనుద్వార చేయలేని చికిత్స నీమె హయగ్రీవునికి చేసెను. అందులకే మెస్టను కీమెపైన కోపము. అనిరుద్ధునకును నారాయణ రావునకును తగవులు వచ్చిన వనియు నారాయణరావు అని రుద్ధునిపై దొంగ చేవ్రాలు చెసిననేరమును మోపు టాదిగా గల వృత్తాంతమెల్ల నామెకు హయగ్రీవుడు చెప్పెను. మఱియు 'పూర్వపుజమీందారిణిగారి చెడ్డపోలిక యెక్కడకు పోవు'నని జనులనుకొనుచున్నా రనియు పలికెను. ఈమాట లీమె కెంతో బాధ కలిగించెను. తా నంతప్రయత్నముచేసి ప్రయాసముతో సంపాదించిపంపిన రూప్యము లనిరుద్ధునికి లాభము కలిగించు టకుమాఱు నష్టము నపకీర్తియు దెచ్చుచున్నావా! నారా యణరావున కీమెపైన ఈమెకో మరునిపై నెంత క్రోధము! ఇట్టి యన్యాయము నేల చేయుచున్నాడు? అపనిందల నేల కల్పించుచున్నాడు? నారాయణరావు తన యాత్మశాంతిలేమి నీవిధముగ నొరులపై నిందలమోపుచున్నాడు కాబోలు! శకుంతలపై నారాయణరావునకు మక్కువ కలుగుటకుంగల కారణ మామె యనన్యసామాన్య సౌందర్యమేయని యీామె యూహించెను. ఒక్కనాడే యిన్ని సంగతులు ఆమే మన స్సును దహించుచుండెను. ఇంకొకరైనచో నిట్టిసమయమున పిచ్చివారై యుందురు.

రాత్రిపండ్రెండుగంటలైనది. నెల్లూరుపురమెల్ల నిద్దుర పోవుచుండెను. వైద్యశాలలో నక్క డక్కడ చెమ్మాల చప్పుడును, రోగులనిశ్వాసములుతప్ప వేరేధ్వనియు లేదు. దీపములు సన్నముగ వెలుగుచుండెను. ఆవసారాలో నిప్పుడు గాలి యాగినది. కొంచెము ఉక్క పెట్టుచుండెను. అప్పలమ్మ కిప్పటికి తెలివివచ్చినది. ఆసంధిలో తెరిపి, ఆమె తన్నుకనిపెట్టు కొని దగ్గరగ కూర్చుండియున్న సుశీలమ్మను తనదుష్టనేత్రిద్వయముతో వికృతముగ తేరిపారజూచెను. అప్పు డక్కడ మేల్కొనియున్నవా రిరువురును విడుదలపొందిన స్త్రీలే. ఒకర్తుక పవిత్రచరిత్ర. వేరొకర్తుక దుష్టచరిత్ర. ఇప్పు డాసిశాసమయమున నిశ్శబ్దమున నాయప్పలమ్మ సుశీలను చూచి, "నీ మోము కనబడునట్టు లాదీపము నీవంకకు జరుపుము" అనెను. సుశీలయు మాఱుమాటాడకయే ఆదీపము నట్లు కదల్చి నిర్భయముగ మఱల గూర్చుండెను. అప్ప :-'ఓహో! నీవా!! నేను నిన్ను సరిగనే గుర్తించి నిన్నొకబందిఖానాలో చూచితి' ననగా ఆముదునలివాడు నామాటలు గమనింపలేదు. కాని నేను నిన్ను చూచిన తక్షణమే గుర్తించితిని. సరిగ పోల్చితిని. నీ వెచ్చట నున్నను పోల్పగలను. నీ వప్పుడు నా కుపచారము చేసితివికదా'! నీరూపము నాకు బాగుగ పరిచితమైనది. బందిఖానలో నిట్టిరూపము లపురూపములు. నీపేరు రాధా

దేవికాదా? నీవు హాత్యనేరమునకై కఠినవరకశిక్ష ననుభవించు చుంటివికదా!!" "అవును" అని సుశీల తలవంచుకొనెను.

# పదునాల్గవపరిశరణము.

## —♦ స్నేహపరిణామము ♦—

ఆదినము శ్యామల పుట్టినదినము. సాయంకాలమున రామారా వింటికి వచ్చునప్పటికి అనిరుద్ధుడును శకుంతలయు వచ్చియుండిరి. రంగయ్యగారు పనిమీద బయటకు వెళ్లిరి. రామారావుతల్లి యగుశ్రీదేవమ్మగారికి వంటవేళ యైనది. శ్యామలయు అనిరుద్ధుడును తోటలోనికి దారితీయగా శకుంతలయు రామారావుకూడ పోయిరి. రామారావును శకుంతలయు నిటునటు తిరుగుచుండ, శ్యామలయు అనిరుద్ధుడును మాటాడుచు వేరొకప్రక్కకు పోయిరి. ఈతోటలో వీరిట్లు తిరుగుట కిది మొదలుకాదు. విజాపురపువారికిని నీలపురపువారికిని చిరకాలమునుండి బంధుత్వము స్నేహము నుండెను ఈ పిల్లలు చిన్ననాటనుండి కలిసిమెలసి యాడుకొను చుండిరి. నేడు యీ తోట నిశ్శబ్దముగ నుండెను. ఆకులు కదలుచప్పుడుతప్ప వేరే ధ్వనియు లేదు. అస్తమించుచున్న సూర్యుని అరుణకాంతులు

పచ్చనియాకుల పైనను అందు మధ్యమధ్య వివిధవర్ణముల పువ్వుల పైనను బడి వింతకాంతిని వింతయందమును దెచ్చుచుం డెను. అచ్చటి మంధమారుతము మనోహరమై హాయిహాయి యనిపించుచుండెను. ఈమనోహర ప్రకృతిసౌందర్యమున నెల్లరు నుత్సాహముతో సంతోషముతో నుండవలసినను రామారావును శకుంతలయు మాత్రము మౌనముగ దీర్ఘా లోచనాపరులై దుఃఖితులై యుంట ఇరువురకును దెలిసి పోయెను. ఈ సుందరప్రకృతియందు తా మిరువురుమాత్రమే దురదృష్టవంతులా! తమ కానందము, తృప్తి, సౌఖ్యము నను నవి లేవా?—ఈతలంపు లిరువురకును కలిగెను. రామారావు ఈవిషాదమును భరింపజాలక ఎట్టకేలకు లటాలున "శకుం తలా! నీ వేల దీనముగనున్నావు? నీకు సంతోషములేదా?" యని యడిగెను. అతడ ట్లడుగునప్పుడు పెదవు లదరుచుండెను. గుండియలు తటతట కొట్టుకొనుచుండెను. శకుంతలనడుగ బ్రేరే పించిన దేదో యొకశక్తియని రామారావనుకొనెను. శకుంతల మా మెట్లాతనిని బ్రేరేపించి యుండును. ఆమెమౌనము, అవ నతవదనము, విచారముతో గూడిన కన్నులు రామారావునకు క్లేశముఁ గలిగించి ఉద్రేకమును పొందఁజేసి యుండును. ఆమె యాతని మాటలకు ప్రత్యుత్తరము జెప్పుటకుముందు తలనెత్తి రామారావును జూచెను. ఆచూపువలన నామెభావములెల్లను రామారావునకు దెలిసెను. అతడు తాను ప్రశ్నించినది వ్యర్థ

ముగకాదని నిశ్చయించుకొనెను. ఆమెకు శాంతియు సౌఖ్యమును తృప్తియును లేవు. ఆమె దుఃఖమున బడిపోవుచున్నది. ఆమెజీవిత మడవిని గాచినవెన్నలయగుచున్నది. అని రామారావునకు దృఢముగ దోచెను. ఆమె భావములెల్ల రామారావు స్ఫుటాక్షరముల నామెకన్నులలో నేచదువుకొనగలైను. రామారావు సానుతాపము సానుభూతియు శకుంతలకు దెలిసెను. అత డామెసౌఖ్యమును, ఆనందమును ప్రేమను గోరుచున్నాడు!! వీరి బాల్యస్నేహము, చిన్ననాటి యాటలు, పాటలు, ప్రవర్తనము, భావములు, ఆలోచనలు, ఆశయములు నొక్కమాటుగ దుఃఖావేశమువలె పొంగి పొరలి వీరిరువురను నిశ్చేష్టులుగ చేసివైచెను. ఆప్రేమ సఫలీకృతమై యుండినచో, వీరి జీతములు ఇప్పు డెట్లుండెడివి?

శకుంతల:—మెల్లన, గన్నుల నీరువచ్చుచుండ, 'నేను సంతోషముగ—లేను—ఉందునని తోచదు' అనెను.

రామారావు— (తత్తరముతో) —'ఏల?' శకుంతల మఱల నాతనిని జూచెను. అందు విషాదము మొదటకనబడినది. ప్రేమ అనురాగము కోరిక తరువాత తోచినవి. అటుపిమ్మట మఱలవిషాదము. ఇదినాట్యరంగమున ముఖమున నవరసముల నభినయించు నాట్యకళాశక్తి కాదు. నిర్మలమగు పవిత్రహృదయము పొందు సుఖదుఃఖములవలని భావముల మార్పు. ప్రతిబింబితమగుచున్న అనురాగము. అది వృథయ

య్యెనను దుఃఖము. ఈభావములను వర్ణింప భాష చాలదు. కల మూడదు. రామారావు తనభావముల నడంచికొని శకుంతలను చూచెను. ఆమెభావములను తెలిసికొనెను. మఱింత ధైర్యము జెందెను. అతఁడు మఱల 'శకుంతలా! నారాయణరావుతోడి వివాహము నీ కిష్టములేదా?' యనెను. శకుంతల, తలవంచి కొని, దుఃఖముతో నూరకొనెను. అత డాశ్చర్యపడెను.

రామారావు:— 'శకుంతలా! నీవు నన్ను బ్రేమించు చున్నావా?' శకుంతల దీనముగ సిగ్గుతో నవనతవదన యయ్యెను. రామారావు కంటతడిపెట్టెను. శకుంతలయు నేడ్చెను. ప్రేమ విషాదములు పెల్లుగొన వీరిరువురు నేడ్చిరి. ఇరువురు నొండొరులఁ బ్రేమించుచుండుట నిప్పటికి దెలిసి కొన గలిగిరి. ఇరువురును గొంతతడవు మౌనముతో నుండిరి. ఆనందపారవశ్యమున విషాదమున మునిగి తేలిరి. ఆసాయం సమయమున, మందమారుతమున, పక్షుల కిలకిలారవములలో, నప్పు డాక్షణమున రెండుహృదయములు, రెండు ఆత్మలు, రెండుమనస్సులు దగ్గరగఁ జేరి హాయిలో మునిగి మాయమైనవి. 'వీ రప్పు డట్టానందపరవశులై కడపిన ముహూర్త మాత్రకాలమే వీరి జీవితమందత్యంతో త్కృష్టకాల మని, వీరు తరువాత తెలిసికొనిరి. తనప్రక్క నిలిచియున్న యువకునిసౌందర్య మామె కన్నెత్తిచూడకయే వీక్షించుచుండెను. అత డుత్సాహముగ నున్నా డని యామె

యెటిగెను. అతని ప్రేమ సీమె తెలిసికొనెను. మఱల నీనిశ్శబ్ద మును పోఁగొట్ట రామారావే ఆమెను మాటాడించెను. అతని కంఠస్వరము మాఱియుండెను. మఱల నింతలో రామారావు నకు పట్టరాని విషాదము కలిగెను. 'శకుంతలా! నే నెంతదురాత్ముఁడ నైతిని? వృధగ నేను నిన్ను మఱల బ్రేమింపఁ బురికొల్పితిని. నీవు పెండ్లాడవలసిన యాతని కన్నులలో నే నెంతయధమాధమునివలె కనబడుదును. నే ననగూడని- తెలుపగూడని భావములను వెల్లడించితిని!!' అని తనకరమును ఫాలమున జేర్చుకొనెను. మఱల "అయ్యో, నేను దురదృష్టవంతుడను. నాభావముల నీవఱకే తెలిపియుండినయెడల బాగుండెడిది. కాని ఇప్పుడా! ఏమిచేయుదును? నీవు నన్ను బ్రేమించుచున్నావని, నిజముగ బెండ్లాడెదవని కలనైన తలంపనైతిని. ఇప్పుడు కాలము మించినది. శకుంతలా! నీకును సంతసము లేదు. నీ కానందముగ నున్నచో నాభావముల నడచికొని యుందును. నాబాధను లెక్కఁగొనను. కాని నీదుఃఖమును నేను చూడఁజాలను. నీవును విషాదమును, పశ్చాత్తాపమును, బొందుచున్నావు. అయ్యో! మన మెంత దురదృష్టవంతులము! మనకు స్వర్గముగ నుండవలసిన జీవితము, ఎడబాపున నరకమై పోయినది. సంతోషముగ నుండవలసిన జీవయాత్ర, యెడారి ప్రయాణమైనది. నామట్టుకు నాజీవితము నిష్ఫలము, నిరర్థకము." అనెను. శకుంతల కంపముఁ బొందెను.

ఆమె తనవదనము నెత్తి సిగ్గుతో "అప్పుడే ఏలదుఃఖం పవలెను? నీ వింక నీయూరు విడిచిపోయినను గూడ నేను నారాయణరావును బెండ్లాడను. నీవు నన్ను త్యజించినను, ఇక నెన్నటికిని మనకు చూపులుండకపోయిననుగూడ నే నాయనను బెండ్లాడను."

రామా:—ఆఁ! మీనాయనగారి కట్లు చెప్పివేయఁ దలంచితివా? అని గద్గదస్వరముతో హృదయవేగముతో ననెను.

శకుంతల:—'అవును శీఘ్రమే, ఈసాయంతనమే చెప్పివైచెదను. అని నిశ్చయముతో స్పష్టముగ పలికెను. ఆమె కన్నులు కాంతివంతము లయ్యెను. ఆమె మరల "నీకు నాయందనురాగము లేదని నిరాసచేసికొని, అన్నప్పను బెండ్లాడవలసి వచ్చునని భయపడి, తండ్రిగారి కిష్టుడగు నీతనిని బెండ్లాడ నీయకొంటిని కాని, నాప్రాణము పోయినను బెండ్లాడుదానను కాను.' రామారావీ మాటలు వీనులవిందుగ వినుచుండెను. మరల 'చిన్ననాటినుండియు నిన్నే నమ్మియుంటి' నని శకుంతలయనెను. రామారావు పరవశుడయ్యెను. అతడు "మన చిన్నినాటి పెండ్లిండ్లు జ్ఞాపక మున్నవా!" యని మందహాసముఁ జేసెను. 'ఈతోటలోనే, ఆమూల మావిగున్న మనపెండ్లిపందిలి! అది నిశ్చయమనియే నేను నమ్మితిని. ఆబాల్య క్రీడలు, మనోహరములు, మనకు

ప్రాపించికజ్ఞానము వచ్చినతరువాత నాయానందము, ఉత్సాహము పోయి, విచారములు, దుఃఖము లధికములై పోయెను. ఈక్షణమున నాకుఁ గలిగిన యానందము కలుగునని నే నూహింపలేదు. నీవు నన్నుగూర్చి తలంచుటయైన లేదని తలచి దుఃఖితనై, నిరాసజెంది, నారాయణరావును బెండ్లాడ దైవము వ్రాసిపెట్టె ననుకొంటిని. నీవు నిజముగ నాకై పరితంపిచుచుంట నెఱుఁగను.' అని యామె పలికెను.

రామా:—పరితపించితిని, విలపించితిని, ఘోరముగ బాధనొందితిని, నిరాసజెందితిని. నాబాధ నాపరమేశ్వరు డెరుగును. కాని నిన్నేమని యాసింపగలను? నాకు నీవు దక్కవని యెంచితిని. కాని నీకొరకే నాప్రాణముల నిలిపికొనియుంటిని. నిన్ననుదినము నొక్కమాఱు చూచి సంతసించు చుందును. నీతో మాటాడగల్గు టానందము. నీవు వైద్యశాలకు వచ్చిన దినము నాకు సుదినము. అప్పటికి మా తాతగారు తనయాపదాస్తిని నాకే యిత్తురని యూహించి యుంటిని. అందువలన నిన్నాసించుట నావంటివాని కప్పుడు పరిహాసపాత్రముగ నుండదని యూహించి, నీకు నాభావమును దెల్పఁదలచి యా మూమిడితోపులో సుందరమగు నా ప్రదేశమున నిలిచి యుండ "శకుంతలా!" యని నిన్ను పిలుచుటకు నాల్కచివరకు వచ్చినది. ఇంతలో నీవు బండి నెక్కి వెళ్ళిపోయితివి. నేను ఇంటికి పోయినంతనే నా కాస్తి లేదనియు, శ్యామలకిచ్చివైచినాడనియు

తెలిసి, నావంటి ధనములేనివాఁడు ని న్నాసించుట తగదని నీకు నాయనురాగమును దెలుపఁబోవుటే మేలయ్యెనని యెంచితిని. నీవు జమీందారింటి పడుచువు. నేను రెక్కలనమ్ము కొని జీవించువైద్యుడను. అందువలన నిది పొసఁగదని దుఃఖించితిని. నీకు చెప్పనైన సాహసింపనైతిని.

శకుంతల:—"చాలుచాలు. ఎంతటి యన్యాయము చేసితివి? నాకు ధనమే ప్రధానమని తలంచితివా!" యని నిష్ఠురముగ బలుక, రామారావు పరవశము జెందెను. శకుంతల యతని హృదయవేదనము, ఆగాటము, భావము లను గ్రహించెను. బాల్యస్నేహితుల యనురాగము ఫలించుట యెంతవారికిఁ గలుగును? ఇరువురు నానందమున మునిగిరి. తమ స్నేహపరిణామమే ప్రేమయని గ్రహించిరి.

ఇంతలో రంగయ్యగారు వచ్చి వీధి గుమ్మము దగ్గర జమీందారుగారి బండి వేచియుంట చూచి, తమబిడ్డలును శకుంతలయు, తోటలో నున్నారని తెలిసికొని, నగుమోముతో వచ్చిరి. రంగయ్యగారు సాధారణముగ సూక్ష్మబుద్ధి కలవారే. అయిన నీ పరిశీలనాశక్తి యీ యువకులయెడల బనికి రాలేదు. వారి భావముల నీతడు తెలిసికొనలేక పోయెను. ఏలన వీరు చిన్ననాటనుండియు నిట్లే కలసి మెలసి యుండిరి. అందువలన వీరియందు దివ్వ ఁడేమార్పును కనబడలేదు. ఋజుపద్ధతిని బెటిగి సద్గుణములు కలవాడని ప్రసిద్ధి జెందిన రామా

రావు నెవ్వరు ననుమానింపరు. శకుంతలతో నేదో లోకాభి రామాయణమును ముచ్చటించుచున్నాడని రంగయ్యగా రను కొనిరి. అప్పుడే శ్యామలయు ననిరుద్ధుడును తోటలో తిరిగి తిరిగి వీరి వెనుక ప్రక్కకువచ్చిరి. వీరెల్లరిట్లు కలసి మెలసియుండుట రంగయ్యగారి కానందము కలిగించెను. "ఓహో! మీరల మీచిన్ననాటి యాటపాట లొక్కమా రాడుకొనుచున్నారా! శకుంతలమ్మా! మీబండి వచ్చి వాకిటనున్నది. ఈదినము మీ రిచ్చటనే యుండినచో బాగుండెడిది కాని ఒకమూల పెళ్ళి కూతుర వగుచుండగ నిన్నాపుట మంచిదికాదు. వేళయైనది లెమ్మ?" అనిరి. అంతట నీప్రియు లొండొరులను వదలి పోవు విధము నాదీనదృష్టులను రంగయ్యగారు గ్రహింపజాల రైరి. శకుంతల యింటికిపోయెను. తండ్రితో నీపెండ్లి తనకు యిష్టములేదనెను. ఇది తప్పదని తండ్రిపలికెను. ఆమె గుండె లో రాయిపడెను.

# పదునైదవప్రకరణము.

## —• ఆమెదోషియే •—

అనిరుద్ధుడు:-నేను నిర్దోషినని త్రికరణశుద్ధిగ చెప్పు చున్నను, నమ్మరా?

కృష్ణారావుగారు:—నీజీవితమనింద్యమై నిష్కళంకమై యుండినచో నీమాటలకు విలువయుండెడిదే కాని ఇప్పుడట్లు కాదు. నీవు దుర్మార్గముగ బ్రవర్తించితివి. నాకు తెలిసిన సదానికన్న నెక్కుడు లోతుగనే దుర్మార్గములలో దిగితివని నా కనుమానము కలదు. నీ చూపునందలి మార్పు నాకట్లు తోపించుచున్నది. నీవు నాకు, నాజమీందారికి వారసుడవు. కుటుంబముయొక్క గౌరవమును కాపాడుభారము నీయందుండుట నాకు విచారముగ నున్నది. కాని నిన్ను నిందించిన నేమిలాభము? ఆకళంక మెచ్చటికి పోవును?"

అనిరుద్ధు డదరిపడెను. అతనిమోము మొల్లవడ వడంకుచు, "ఆఁ! ఏకళంకము? అదేమిటో నాకు చెప్పుడు. ఇదిచాల నన్యాయము – నాకు తెలిసినదాని కన్న ప్రతిమానవుడు నన్ను గూర్చి యెఱిగియుంట నాకు అవమానకరము. నాకు చెప్పివేయుడు."

కృష్ణారావుగారు నిర్ఘాంత పడి, ఇంచుక తడవాలోచించి, లేచి, ఇటునటు తిరుగుచు తుట్టతుద కనిరుద్ధు నెదుటనిలిచిరి. అనిరుద్ధునిహృదయము తటతటగొట్టుకొనుచుండెను. ఆయన చెప్పఁబోవు ప్రత్యుత్తరము తనభావిజీవితమును దుఃఖభాజనముగ జేసివైచు ననుభయము కలిగెను. కృష్ణారావుగారు మెల్లన, "అవును. నీకుసంబంధించిన విషయము నీకేల తెలియకుండవలెను? నీ ప్రవర్తనయందు ఇది కొంత

మూర్ఛ కలుగఁజేయును. ఈకళంకము, ఈకర్మము ఇతరు లను చుండ నీవు వినినది, నీకు, నికుటుంబమునకు, నీ తల్లివలన కలిగి నది. నీ పెదతండ్రి నీ వనుకొనినట్లు చనిపోవ లేదు. హత్య చేయఁబడినాడు. ఆహత్య చేసినది - మీతల్లి."

అనిరుద్ధుడు—"ఆఁ! మాతల్లియే!" అని మహాదాశ్చర్య ముతో నిర్ఘాంతపడెను. భయాశ్చర్యము లొక్కమాటుగ సంవరించి, అతని హృదయమును కలఁచినవి. ఆతని హృద యము దుఃఖసముద్రమున మునిగి, కల్లోలమున బడి, మూర్ఛఁ జెందెను. అతనిహృదయము కూకటివేళ్లతో జీల్పఁబడుచున్న టులుండెను. కృష్ణారావుగారితనిబాధను చూచిరి కాని జాలిఁ దలపలేదు. "అవును. మీతల్లియే, అతనిని - ఆవోడ్డిలో - బాకుతో పొడిచివైచినది." అని ఆగవాక్షమునుండి యావం కకుచూపుచు "ఆమెపై నేరము స్థాపింపఁబడినది. విచారణ జరిగి నది. ఉరిదీయఁబడు శిక్షపొందెనుగాని వరకశిక్షగ మార్చిరి. ఆమెయీక్షణమున నొకకారాగారమున ఖైదీ." అనిరుద్ధునకు నోటమాటలేదు. మెల్లగ, "ఆమె దోషియేనా!" అని వింతస్వర ముతో గద్గదికముతో నడిగెను. ఆజమీందారు డాగవాక్షము నుండి వచ్చుచున్న సూర్యకాంతి నావుకొనుటకో యన చేయి నడ్డము పెట్టుకొని, గద్గదస్వరముతోడనే "అవును. ఆమె దో షియే!" అని పలికి, మెల్లన గుర్చిలో కూలఁబడెను. తక్కిన సంగ తులు చెప్పనప్పటికన్న నీమాట వనునప్పుడు ఆయనహృద

యము పగిలినట్టుల, చాలవేదన మనుభవించు చున్నటుల, ఇంకను నిజము నిశ్చయింపలేక సందియపడునటుల, అనేక భావములతో, విషాదముతో, దుఃఖముతో పలికెను. ఆ బాలుడు తలవంచికొని యూరకొనెను. అతఁడొక్కటేమూల్గు మూల్గి తన వేదన తెలియఁజేసెను. మిక్కిలి దుఃఖముతో దురదృష్టవంతుడై యాగదినుండి వెడలిపోయెను.

ఐదుగంటలకు అనిరుద్ధుడు తనతల్లి ఘోరచారిత్రమును వినినదిమొదల లూరక నడుచుచుండెను. ఎచ్చటకుఁ బోవలెనో, ఏమి చేయవలెనో కూడ తెలియక యట్లూరక పోవుచుండెను. ఇతనికి మానవజాతిమీదనే రోతపుట్టెను. మానవులు లేని చోట - ఆవాసన తగులని ప్రదేశమున - దూరముగ - నేకాంతమునకు పోవదలంచెను. ఓహో! నారాయణరావు 'కళంకముచెడ్డబాలిక' యని యెత్తిపొడిచిన దిదియా!! నెల్లూరనెల్ల రీచారిత్రము నెఱుగుదురు కాబోలు! ఈరహస్యము తమకొక్కరకు మాత్రమే తెలియదు. తెలియనీయలేదు. ఇట్లు తనపైఁ జాలి దలచి ఇంతకాల మీరహస్యమును తమచెవిని బడకుండ నుంచిరికదా. ఆశ్చర్యము. తమయందలి యనుగ్రహము, జమీందారీకుటుంబము నందలి గౌరవ మిట్టిరహస్యమును దాచినది. గృహములోనివారును పరులును గూడ నెంతెగుట్టుగ నుంచిరి? తాము తమజననిని పవిత్రచారిత్రగ, సాక్షాత్తు దేవతగ నెంచి గౌరవించి పూజించునట్లు గావించిరి. ఆమె యెచ్చట

చనిపోఘునదో తెలిసికొనలేదు. ఎట్లు గతించినదో ఎఱుఁగరు. అయ్యో! ఆమె బ్రదికియే యున్నది. ఒక పంచమస్త్రీకన్న నధమాధమురాలుగ గణింపఁబడుచున్నది. అవమానకర మగు జీవితముఁ గడపుచున్నది! అట్లాడలు తెలియక విషాద ముతో నాబాటయందు బోవుచు, అనిరుద్ధుఁడు పడిన యాతన పరమేశ్వరుఁ డొక్కఁడే తెలిసికొనఁ గలఁడు. అతని మనసున భయంకరమగు క్లేశము కలిగెను. ఒకపరి దుఃఖించును. ఒకపరి యేమి చేయఁగల నని యూరడిల్లును. మఱల తలచుకొని విషాద ముఁజెందును. జీవితము రోయును. నిట్టూర్పు లూర్చును. తనభావిజీవితము నిరర్థకమని యనిరుద్ధుఁడు గ్రహించెను. తన యాశయము వ్యర్థము. ఆసలు వృథలయ్యెను. శ్యామల తన కిఁక దక్కదు. రాధాదేవి కొమరునకుఁ దమకొమరిత నీయ నిచ్చగింతురా? అతడు విషాదముతో తలవంచికొనెను.

# పదునారవ ప్రకరణము

## ఎవ్వఁడా దుర్మార్గుఁడు?

సూర్యుఁ డస్తమించినాఁడు. చీకటి పడినది. అనిరుద్ధుఁ డింక నాలోచనానిమగ్నుఁడై పోవుచునే యుండెను. అత

డిప్పుడు బెజవాడ ట్రంకురోడ్డులో నెల్లూరికి చాలమైళ్ళదూర
మున నుండె నని తెలిసికొనెను. ఇప్పుడు శకుంతల తనకై
వెదకును. ఆతురతఁ జెందును. తనతండ్రి కేగొడవయునక్కర
లేదు. జమీందారిణి కితఁడెక్కడకుఁ బోయిన నేమి? 'నాకీ
భవనముతో నింక బనియేమి? నే నీలోకమును త్యజించెద' నను
వెఱ్ఱితలం పాతనికి కలిగెను. తనపూర్వుల భవన మని, తన
కులమని, తన జమీందారీ యని గర్వపడున విప్పుడు రోఁత
లయ్యెను. అట్లైన, నేనుపోయిన శకుంతలగతి యేమి? ఆమెదుఃఖ
సముద్రమునఁ బడి పోవలసిన దేనా?' అని అతడు దుఃఖముతో
నిలువబడి గిరుక్కున మఱలెను. రాత్రి యగుచుండెను.
ఇతఁడు వెనుదిరిగి త్వరగ నడచుచు నెల్లూరియూరి బయ
టకు వచ్చెను. అంతట నానిశ్శబ్దమున దూరమునుండి వచ్చు
చున్న బండిచక్రముల, గుఱ్ఱపుడెక్కలధ్వని వినవచ్చెను. అది
"డాక్కా"ర్టను తేలికబండి యగుట మహావేగముతో బరు
వెత్తి వచ్చుచుండెను. ఇది నారాయణరావుబండి యని వేగము
ను బట్టి అనిరుద్ధుడు గ్రహింపగల్గెను. సాధారణముగ నెల్లూరిలో
నీతడుబండి నతి వేగమున, నలక్ష్యముగ తోలుచుండును. అతనిపై
నిందుల కెన్నో మాఱు లభియోగములు వచ్చియుండెను. అని
రుద్ధు డిట్లు తలపోయుచుండ నల్లనిపురుషవిగ్రహముయొక్క
చాయ యొకటి తన ప్రక్కనుండి తటాలున పోయినవడి య
య్యెను. చెట్లమాటున దొంగవలె పోవుచున్న వాడెవ్వడా యని

అనిరుద్ధు డనుకొనెను. ఇంకొక క్షణములో చిటుకుమను ధ్వని యు, కొంత దూరములో నొక దొంగలాంతరుయొక్క కాంతి యు కనబడెను. ఆకాంతి గుఱ్ఱముకన్నులకు మిరుమిట్లుకొలిపి బెదరఁగొట్టెను. ఆయలజడి విని మనయనిరుద్ధుడు "ఓరిదుర్మార్గుడా! ఎవ్వడవురా నీవు?" అని పలికెను. అయిన నేమిలాభము? ఆగుఱ్ఱమునకు బిచ్చియెత్తినట్టులైనది. అది గంతు లిడుచు వాయువేగమునఁ బరువెత్తికొని పోయెను. దారితప్పినది. పొలములో దఢాలు మని ధ్వనియయ్యెను. అట్లాదుర్మార్గుడు దొంగలాంతరుచే గుఱ్ఱమును బెదరింపగనే, బండిలోని వారికి కలత, కోపము జనించెను. అందు నారాయణరావుగారికి మితిమీరినకోపమూ వచ్చి, ఏమేమో బూతులు తిట్టుచుండిరి. అంత అనిరుద్ధుడు ఆబండి పోయినదారినిబట్టి పరుగెత్తికొని పోయెను. ఆదుర్మార్గు డీతనికి గనబడలేదు. వా డెంతవేగముగ వచ్చెనో, అంతవేగముగనే పోయెను. అనిరుద్ధు డట్లు పరువెత్తిపోయి చూడ నొకపావుమైలు దూరమున నది బ్రిద్దలై ముక్కలు ముక్కలుగ బడియుండెను. అప్పటికలకలము - కల్లోలము వింతగ నుండెను. ఆబాటకు గొంతదూరమున ముగ్గురు దేనినో చూచుచుండిరి. అట్లు వారిమధ్య పడియుండినది స్పృహ తప్పిపోయి దెబ్బలు తిని చావసిద్ధముగ నున్న బండివాఁడే! అచ్చట వంగి చూచుచున్నది నారాయణరావు గారును, పద్మరాజుగారును, సుశీలమ్మయు. ఈమె యూరిబయట నొక

రోగిని చూడఁబోయి వచ్చుచుండెను. ఆమె మఱల వైద్య శాలకు బోవుచుండ నారోగిబందుగు డొకడు లాందరుతోనీమె కు సాహాయ్యముగ వచ్చెను. వీరీప్రమాదమును చూచి, వీరికి సాహాయ్యము చేయవచ్చిరి. ఆమె బండివానిని బరీక్షించి చూచి – "వీనికాలు చితికిపోయినది. ఎముకలు మాత్రము విఱుగలేదు. శీఘ్రముగనే బాగుపడును." అనియనెను. నారా యణరావునకు మఱలకోపము వచ్చెను. "ఆగాడిదె! దుర్మార్గుడు కనబడినచో వాని యెముకలు నేనే విఱుగగొట్టెదను."

పాప మీప్రమాదమున నీతడును పద్మనాభరాజుగా రును బండినుండి తూలి, దూరమున నదృష్టవశమున బందలో బడిరి. చావుతప్పి కన్ను లొట్టపోయినట్లైనది. చలువవస్త్ర ములుపాడైనవి. దేహము కొంచెము గీరుకొని పోయినది. నారాయణరావు మఱల "ఆదుర్మార్గుని కనుగొనుట కెం తోదూరము పోనక్కరలేదు. వాఁడెవ్వడో నే నెఱుగు దును" అనుచుండగ అనిరుద్ధుడు వచ్చుట చూచి–"ఓహో! నీవా! మంచి బోల్తాకొట్టితిమిసుమీ!" అని విరసముగ నవ్వెను. ఏపాపమెఱుగని అనిరుద్ధుడు తన సానుభూతిని దెలు పుటలో నారాయణరావుతోడి విరోధము–తనకు గల దుఃఖ మును గూడ మఱచెను.

అనిరుద్ధుడు:—ఆదుర్మార్గుడా లాందరును చిటుకు సని వెలిగించి మిఱుమిట్లు కొలుపుట నేను గమనించితినిసుమీ!

వానిని పట్టుకొనుటకు ప్రయత్నించితినిగాని లాభము లేక పోయినది. పాపము వీరడికి బలముగ గాయములు తగిలినవి. మీరిరువురు క్షేమముగ నున్నారు. పోనిండు. ఇదియే అన్నప్ప యైనచో నీదురవస్థ కంతగ విచారింపఁ బనిలేదు. కాని వాని వంటివాని కిట్టి ప్రమాదములు సంభవింపవు. గుఱ్ఱమేదీ?

నారాయణరావు :—బొమముడితో "ఏమో! ఎవ్వ డెఱుఁగును? చచ్చినదో బ్రతికినదో, ఇంటికే పోయినదో, ఏమైననేమి?" అంత వీరెల్లరు సుశీలమ్మ చేయు చికిత్సా విశేషములఁ జూచుచుండిరి. ఆమె కొన్ని సన్నని పుల్లలతోడను పేలికలతోడను వీరనిగాయములకుఁ గట్టు కట్టెను. ఆమె మోము సర్వోచారముగ నుండెను. చేయి నిదానముగ నుండెను. ఆమె శ్రద్ధతో వాని కుపచారములఁ జేసెను. ఆమె శాంతము వీరి కాశ్చర్యము కలిగించెను. ఆమె వంగియుండగ వీరెల్ల రామెను గౌరవముతో చూచుచుండిరి. పద్మనాభరాజుగారు నీమె నేర్పును చూచియో, వింతరూపమునను, తేజమును జూచియో, ఆమెను బరిశీలించి చూచుచుండిరి. అలాంతరు వెల్లుగున చూడగలిగినంత బాగుగ చూచుచుండిరి. ఆయన యెంతపరీక్షించిన నామెముఖమున నేమార్పును, భావములును కనబడుటలేదు. ఆమె మనసు పొందుచున్న తహతహ నీయన తెలిసికొనజాలడు. ఆమె నేర్పు, శ్రద్ధ, శాంతము ఇవిమాత్రమే పూర్ణముగఁ గనఁబడుచుండెను. ఆమెనుగూర్చి నారాయణ

రావుగారు వలుమరు వినియుండిరి. ఆమె నిప్పుడు ప్రత్యక్షముగ చూచి యాశ్చర్య పడిరి. నిజముగ నీమె తనకు వచ్చిన మంచి పేరునకు తగియున్న దని మెచ్చుకొనిరి. 'ఈమెయే, యీ యూర పేరుపొందిన వైద్యాధికారిణి' యని పద్మనాభ రాజుగారితో మెల్లన పలికిరి. పద్మనాభరాజుగారు మెల్లన తల పంకించిరి. దీర్ఘాలోచనా నిమగ్నులైరి. సుశీలమ్మ నారాయణరావుగారితో "మనము నవాబు పేటకు దగ్గరగనే యున్నాము. ప్రస్తుతము వీనికిఁ గట్టు కట్టినాను. ఇంటికి దీసి కొనిపోయినతరువాత రామారావుగారిని బిలిపించి చికిత్స చేయింపుడు" అని, "ఒక ఫర్లాంగులో నున్న గుడిసెదగ్గరకు పోయి, నేను బిలుచు చున్నానని చెప్పి, ఇరువురు ముగ్గురు మనుజులను బిలువు"మని లాంతరుపట్టుకొని తనతో వచ్చి వానితో బలికెను. అనిరుద్ధుడుకూడ వానితో బోయెను. సుశీలమ్మగారు కన్నెత్తి, తలనెత్తి యైన మాటాడ దని నారా యణరా వనుకొనెను. ఆమెయు లాంతరు పట్టుకొని "నారా యణరావుగారూ!" అని మెల్లన బిలిచెను. నారాయణరావు గారు నాశ్చర్యపడుచు పోయి, ఆపొలమున బడియుండిన వె దురుతడికె నెత్తికొని వచ్చుటకు సాహాయ్యము చేసిరి. అంత నామె ఆతడికపై విఱిగిపోయిన బండిమెత్తలను బడవైచి సిద్ధముగ నుంప, ఇంతలో నామె యాజ్ఞను శిరసావహించి పిలువనంపిన మనుజులు వచ్చిరి. ఆమె యిప్పు డొక్క

మాఱు నాగాయణరావును చూడగ అత డిప్పు డేమో నేర్పునకు
ఆశ్చర్యపడుచుంట కనబడు చుండెను. ఆమె మఱల కన్నెత్తి
చూడలేదు. ఈమె కాతనిపై రోతయు పగయు కూడనుండెను. 'మన
దోషముల నాపరమేశ్వరుడే విచారించును గాక! నీయపరాధ
మున కాపరమేశ్వరుడే నిన్ను శిక్షించును గాక!!' అని యీమె
తలపోయుచు విషాదముతో నిలిచి యుండెను. ఆమెగుండె దడదడ
కొట్టుకొనుచున్నను పైకి నిశ్చలముగ నుండెను. ఆమె యిట్లు
డంచుకొనుచున్న దుఃఖము - బాధ - ఎన్నటికైన నుష్ణపర్వతా
గ్రిషువలె, శతఘ్నివలె పేలి, ఆమె శత్రువులను చిందరవం
దరగ జేయక మానదు. వీరనిని ఆడోలీపైc బరుండ బెట్టిరి.
నారాయణరావుగారు ప్రార్థించుటవలన వీరితోడనే వెల్లగ
సుశీలమ్మ వారింటికి బోయెను. అంత రామారావుగారికిc గబు
రంపిరి. సుశీలమ్మ యీదురదృష్టసారథిని కనిపెట్టికొని కూర్చుం
డియుండెను. ఈమెకు తనకష్టసుఖములు-దుఃఖములు మఱల
మఱల జ్ఞాపకము వచ్చుచుండెను. అయినను వీరని దీర్ఘనిశ్వా
సము లామెయాలోచనలకు భంగము కలిగించుచుండెను.
ఈప్రమాదము సంభవించుటయు గొన్ని నిమిషములకు ముందు
నారాయణరావుగారు నౌకరీమాన్పించిన చిన్నస్వామివలె
నున్న యొకపురుషు డాచీకటిరాత్రిమున వేగముగ నాబాటను
బోవుచుండుట నామెయు చూచెనుగాని, ఎవ్వరో యని
యూరకొనెను. 'అతడే యై యుండునా? పగదీర్చుకొనెను

కాంబోలు' నని యీామె యూహించెను. ఈమె యచ్చట కూర్చుండగ పద్మనాభరాజుగారు మెల్లగ వచ్చి, తేరిపార జూచి 'ఔరా! నీవేనా! నీవిచ్చటి కెట్లు వచ్చితివి? నీసంగతి బయల్పరుపనా?' అనిరి. సుశీల రోషముతో లేచి 'ఏమి బయల్పరచెదరు? పోలీసువారు తినుమన్న గడ్డి తిని దొంగ సాక్ష్యమిచ్చిన సంగతినా? ఈ రాధ యీనాటి యనాధరాధ కాదు. మీా రెల్లరు చేసిన దురన్యాయముల నడప దలచిన మహిషాసురమర్దని సుడీ! మీారు కాదు, నేనే బయల్పర చెదను జాగ్రత్త' అనెను. పద్మనాభరాజుగారు నిర్ఘాంత పడిరి.

# పదునేడవ ప్రకరణము.

## —♦ కృష్ణారావుగారి యాశ్చర్యము ♦—

అన్నప్పగారు జమీాందారుగారింట పానకము లోని పుడకవలె ప్రవర్తింప సాగిరి. నారాయణరావుగారికి శకుంతల నిచ్చి పెండ్లిచేయ నిశ్చయించినపిదప, అన్నప్పగారు జమీాందారిణిగారికి తహతహ కల్గునటుల, భవనములోని బంధు జనులు సేవకులు నాశ్చర్యపడునటుల చొరవతో అహంభావము తో వర్తించుచుండిరి. అనుదినమును జమీాందారిణిగారితో

కలహించుచుండిరి. రాకపోకలు మిక్కుటములయ్యెను. ఇతరు లకు దీనికారణము తెలియుటలేదు. అన్నప్పగారి కిప్పుడు తీరుబడిలేదు. శకుంతలాపరిణయము కొఱకును, పురపాలక సంఘాధిపత్యముకొఱకును దిరుగుటయుం దీయనకాల మెల్ల గడచుచుండెను. అట్లు తన స్వకార్యమున నిమగ్నుడై పొద్దు గ్రుంకువరకును బండిలో సింగారించుకొని తిరుగుచుండును. వేళ్ళయుంగరములు, బంగరుటంచుల ముక్కద్దములు, బంగరు గడియారపు గొలుసు, వీనిని పలుమరు కుక్కతోలుతో మెరుగుపెట్టును. మీసములను పలుమరు సవరించుకొనును. దినమునకు రెండుమూడుమారులు దుస్తులను మార్చును. పరి మళ ద్రవ్యములను విరివిగ నుపయోగించును. అనుదినము నన్నప్పగారు ఎప్పటివలె వచ్చి "శకుంతలకు నారాయణరా వుకుఁ గాఁబోవు నీ వివాహమును తప్పించనిచో సర్వనాశముఁ గావించెదను" అని జమీందారిణిని బెదరించుచుండురు. నేడు పెద్దచావడిలో చాలమంది మాటాడుచు కూర్చుండిరి. అన్నప్ప గారు మఱింత వింతగ బ్రవర్తించుచుండిరి. ఈతని నడవడి చూచి శ్రీకృష్ణారావుగారు మిగుల నాశ్చర్యము జెందిరి. అత డిట్లు భవనమునకు వచ్చి మోటుగ బ్రవర్తించుట చూచి చూచి రహస్యముగ జమీందారిణితో 'ఈతఁ డిచ్చటి కేల తరచుగ వచ్చుచున్నాడు? ఇతనిప్రవర్తన మాశ్చర్యకరముగ నున్నది. మనకుఁ గావలసినప్పుడు న్యాయస్థానవ్యవహారము

లను చక్కఁబెట్టుచు, ఋణముల నిచ్చునాతని కింత యహంభావ మేల? నా కాతనిని చూడ రోఁతగ నున్నది. అందు ముఖ్యముగ మన బంధుగులు వచ్చినప్పుడుకూడ నిత డిట్లు ప్రవర్తించుట అన్యాయముగ నున్నది.

జమీందారిణి:—"ఏమో! నాకును నాతఁడన్న నసహ్యమే కాని, అతడు మనయింటికి వచ్చి కలిపించుకొని తిరుగుచున్నాడు. అతని కిచ్చుటకి వచ్చినగాని తోఁచదుకాఁబోలు!" నని యలక్ష్యముగ పలికెను గాని అతనిని రావలదని యందురేమోయని భయపడి, తత్క్షణమే "పాప మాయన మంచి వాఁడే! మంచి కలిసికట్టుస్వభావము గలవాడు." అని మెల్లగ బలికెను.

కృష్ణారావుగారికి తృప్తికలుగలేదు. ఏదో గొణుగుకొని యూరకుండిరి. మాటలలో అన్నప్పగారు పాపయ్య సంగతి ప్రస్తావించిరి. జమీందారిణి భయపడెను. నారాయణరావుగారిపెండ్లి తప్పించుటకు జమీందారిణి విశ్వప్రయత్నము చేసినది. శకుంతలకు ధనము లేదనియు, వరదక్షిణ గాని నగలుగాని రావనియు నారాయణరావుగారికి రహస్యముగ చెప్పివైచెను. నారాయణరావు మొదట యసంతుష్టిజెందెను. కాని శకుంతల సౌందర్యమును దలచి, వాని మాట తలపెట్టక 'యేమైనను వివాహమాడెద' ననెను.

మరునాటి రాత్రి జమీందారిణి కృష్ణారావుగారితో "నీ పెండ్లి జరిగినచో సర్వనాశనము సంభవించును" అని పలుకఁ ఆశ్చర్యముతో "ఆఁ! నాశనమేమి? ఎట్లు?" అని కృష్ణారావుగారనిరి. జమీందారిణి:- జమీందారీని బాగుచేయుట కొఱకు మన సొంతవ్యయములకొఱకు అప్పుడప్పుడు ఋణము నుబుచ్చుకొనియుంటిమి. అన్నప్పగారీధనము నెల మనకు బదులిచ్చియున్నారు." కృష్ణారావుగారు తలపంకించిరి. అంత నామె మఱల "అతఁ డిప్పటికే చాలవడ్డీ యైనదనియు, తీర్పుమనియు, తొందర పెట్టుచున్నాఁడు. మనదగ్గర నిప్పుడు రొక్కము లేదు. జమీందారీపై వచ్చు నాదాయము మన కెప్పటి కప్పుడే వ్యయమయిపోవును. అందువలన మన మాతని నిప్పు డెట్లో సమాధానపరుపవలెను. అతనికి మనవలన గావలసిన సాహాయ్యము గౌరవముచేయుటే!

కృష్ణా:—అతనికి మనము గౌరవము చేయుచునేయున్నాముకదా! వారమున కైదుదినము లిచ్చటనే విందులు! రాకపోకలు, మర్యాదలు. ఇంతకన్న నేమి సాహాయ్యము - గౌరవము - సమ్మానము చేయవలెను?

జమీందారిణి:—అట్లుకాదు. ఇతడు క్రమక్రమముగ వృద్ధిలోనికి వచ్చుచు, గొప్పవారితోడి సంబంధముల నపేక్షించుచున్నాఁడను మాటను మీరు మరచిపోవుచున్నారు. గతని పూర్వావస్థలో మీ రట్లు పలికినచో నిదియే గౌరవ

మని చెప్పవచ్చును. కాని ఇప్పు డాతని నీబంధుమర్యాదలు తృప్తిపొందింప జాలవు. ఆతనికి గొప్పపదవులు, బిరుదములు, కూడ లభించుటకు సిద్ధముగ నున్నవికదా!

కృష్ణారావుగారు:— ఈరిత్త బిరుదముల కేమిలెమ్ము. "ధనమూల మిదం జగత్" కదా.

జమీందారిణి:—అయి యుండవచ్చును. అందువలననే మన మిప్పు డాతనికి లొంగవలసివచ్చినది. ఆతనికి శకుంతల నిచ్చి పెండ్లిచేసినగాని యూరకొనడు!

కృష్ణారావుగారు:—(కోపముతో) ఊరకుండక. యురిపెట్టుకొనునా? పెండ్లి యీవరకే నిశ్చయమై పోయినది. ఇది యుఁగాక ఆతనికి నాబిడ్డనీయను. అతఁడేమొగము పెట్టుకొని ఆసించుచున్నాడు.

జమీందారిణి:—ఆసింప కేమి? 'ఈవివాహము తప్పించి తనకే శకుంతల నీయనిచో, సర్వనాశనము నా పెండ్లిముహూర్తమున జేసెద' ననుచున్నాడు.

కృష్ణారావుగా రదరిపడి—'ఆఁ! ఏమిదురన్యాయము? వీనికేమైన బిచ్చియెత్తినదా? ~~నాలుగైదు~~ వేల రూప్యములకొఱకు మనకు సర్వనాశనము కలుగునని యూరటలూగుచున్నాడా?

జమీందారిణి:— ~~నాలుగైదు వేలేమి?~~ చాలా వేల రూపాయిలు.

కృష్ణారావుగా రాశ్చర్యముతో "ఆఁ! చాలవేలా?"

జమీందారిణి:—అవును. చాలకాలమునుండి ఇట్లు పెద్ద మొత్తములు తఱచుగ పుచ్చుకొనియున్నాము. అన్నప్పగారు వడ్డీలను చాల నెక్కుడుగ కట్టుచుందురు. అవసరమునకు సరి గనిచ్చు నాతఁ డొక్కఁడు తప్ప వేరెవ్వరును లేరు. ఇట్లసలు ఫాయిదాలు చేరి లక్షరూపాయిలు దాఁకఋణమైనది. మీరు శ్రద్ధతీసికొనవలెను. ఆ కాగితములును, తనఖానకళ్లును చావడి లోని మీ బీరువాలోనే పడవైచి యుంచినాను.

కృష్ణారావుగా రత్యంతాశ్చర్యముతో— "లక్షరూపాయిలా! తనఖాలా!! నే నెఱుగని తనఖాలేమి? నేను కవుళ్లును, ఒడంబడికలును, రశీదులును తప్ప వేరే కాగితములమీద చేఁ వ్రాళ్ళు చేయలేదే! నే నెవ్వరికిని పవరు ఆఫ్ అటర్నీపట్టాను వ్రాసి యియ్యలేదే!! నే నెఱుగని తనఖా లెక్కడివి!"

జమీందారిణి కొంచెము కోపము నభినయించి—"ఏమీ! యిది నాకల్పన మనుకొంటిరా? సృష్టియనుకొంటిరా? సంసారమును వ్యవహారములను చూచుకొనుట మాని, ఏకాంతమున గ్రంథపఠనము పేరున నేదో దీర్ఘాలోచనము సేయుచు నహోరాత్రములు గడపి యాభారము నెల్ల నాదుదానవగు నాపైఁ బడవైచినది గాక, పరాకుగ, చూచియు జూడక తమగౌరవమునకు లోపము రాకుండ అధికవ్యయములను జేయించుచుండి, చేవ్రాళ్ళమాత్రము సేయుచు, రావలసిన

వెవ్వరో, ఇయ్యవలసిన వెవ్వరో తెలిసికొనక, చూడక మీారిప్పుడు కలగనుచున్నారా? ఇంకను యోగనిద్రలో కన్నులుమూసికొని కూర్చుండి యున్నారా? మీాజమీాందారీ యిఁక కొలది దినములలో జప్తు చేయఁబడును. అన్నప్పగారిని సంతోషపెట్టెదరో; మాకు చిప్పచేతి కిచ్చెదరో మీాచిత్తము" అనెను. కృష్ణారావుగారు తటాలున మోము నెత్తి "ఏమైననరే, నే నతనికి పిల్ల నీయను" అనిరి.

# పదునెనిమిదవ ప్రకరణము



## —♦ రామారావు విషాదము ♦—

మామిడితోటను సమీాపించునప్పటికి శకుంతలకు లజ్జ కలిగెను. సుశీలమ్మగారిని దిగబెట్టి వచ్చుటలో చుట్టుతిరిగి వచ్చుటవలనఁ గొంచె మాలస్యమైనది. ఇప్పు డైదుగంటలు దాటినది. నీరెండ మనోహరముగ నుండెను. బాట కిరుప్రక్కలను దట్టముగ నల్లుకొని యొండొంటితో వియ్యమందుచున్న చెట్లయాకుల నడుమనుండి సూర్యకిరణములు చొచ్చుకొని వచ్చి వింతకాంతితో ప్రకాశించుచుండెను. పెన్న యీ తోపుప్రక్కనే ప్రవహించుచుండెను. అందు నీరు కొంచెమే యుండినను మిక్కిలిచల్లనై పశుపక్ష్యాదులకు హాయిం గల్పిం

చుచు చల్లనిగాలిని కల్పించుచుండెను. నదిగట్టుపైన వెట్టిగ బెఱిగిన పచ్చనిగడ్డియు తుప్పలు చెట్లు నామధ్య నచ్చటచ్చట వింత యందముతో నలంకరించుచున్న భిళ్ళగన్నేరు, పొగడ బంతి, మొదలగు రంగుపూల చెట్లును గలిసి భగవన్నిర్మిత రత్నకంబళమువలె నుండెను. ఈ ప్రకృతిసౌందర్యమునకు మధ్య శకుంతల వనదేవతవలె కనబడుచుండెను. ఈమె బండి నాబాటలో నిలిపి, తాను దిగి, మెల్లన నడచుచుండెను. అచ్చట నామెసౌందర్యమున కచ్చెరువడుచు నిలిచియున్న రామారావునకు మాత్రమే కాక యెవ్వరికైన నామె మోహనాకారము కన్నులపండువు చేసి యాశ్చర్యము కలిగించి యుండును. రామారావు కన్నులు దీర్ఘాలోచనమును విషాదమును జూపుచుండెను. బండి దిగి శకుంతల కొంచెమీవలకు నడచినంతనే యతఁ డామెను గలిసికొనెను. అత డాడుచున్న నిష్ఠురోక్తులను వారించి, శకుంతల:—నిజముగ నే నిట్లు వచ్చుట తప్పుగాని. నీవు మఱిమఱి వ్రాయుటవలన కాదనలేక వచ్చితిని. నీ విట్లు వ్రాసి యుండకూడదు. ఇది నాకు చాలకష్టముగ నున్నది, మనయానలు నిరర్థకములు. నిరాశచేసికొని యూరకొనవలసినదే! క్షమింపుము.

రామారావు:—(దుఃఖముతో) ఆఁ! శకుంతలా! నాడు మాతోటలో నీవాడినమాట మఱచితివా?

శకుంతల మఱచునా? మఱువఁగలదా? ఆమెకు పట్టరాని దుఃఖము వచ్చెను. అవనతవదనయై 'మఱువలేదు. ఎన్నటికిని మఱువజాలను. అయినను నే నేమిచేయఁగలను?'

రామా :—నీవు నన్ను చిన్ననాటనుండియు బ్రేమించుచున్నాననియు, నాభావ మిప్పు డెఱుఁగుటవలన నే నొకవేళ దేశములు త్యజించిపోయినను నీవు వేరొకనిని బెండ్లాడననియు నంటివే! ఆక్షణమున న న్నీప్రపంచమున నత్యంతము నదృష్టవంతునిగఁ జేసితివి. నా కానందము జీవితేచ్ఛయు కలిగించితివి. నిజముగ నాక్షణమున భగవంతుడు ప్రత్యక్షమై నాకు స్వర్గమొసగెదనన్న ని న్నీలోకమున విడిచిపోవ నంగీకరించియుండను.

అని యుద్రేకముతో నీతడు "ఆనాటి రాత్రి నేను నిదురింపలేదు. ఆరాత్రియెల్ల నాకు మన భావిజీవితమును గూర్చిన తలంపులే! అట్లా నిశి వేగించి, ప్రాతఃకాలమున నూతనోత్సాహముతో, బలముతో, ఆసలతో, పోయి నాపని చూచుకొంటిని. ఇంతలో నాహృదయము పగులునటుల, నాయాసలు నిరాసలగునటుల, నాజీవితము నిష్ఫలమగునటుల- జరిగిన దెల్ల మఱువుమని నీవువ్రాసినకమ్మ- నారాయణరావును బెండ్లాడక తీరదని,- కుటుంబముయొక్క గౌరవము, నాత్మగౌరవమును గూడ దీనిపై నాధారపడియున్నదని, వ్రాసిన లేఖ వచ్చి నాకు విషాదమును కలిగించి, దురదృష్టమున ద్రోసినది. శకుంతలా! నా కిది బోధపడుటలేదు. దీనిభావ మే మని- నే నెంతో వగచి

తిని. నాకు నిద్దురయు లేదు, విశ్రాంతియు లేదు, నీ విప్పుడు నిజమును చెప్పుము ?”

శకుంతల—(కంటతడిపెట్టి) నీ విరికొకలాగున భావించు కొనవలదు. నీ వుదారుఁడవు. ఎంతటినేరమునైన క్షమించు వాఁడవు. అట్టి సత్స్వభావునియెదుట నే నస్థిరురాలనుగ కన పడుట సంతాపకరము. అయినను నే నీ విషయమున దురదృష్ట వంతురాలను, అస్వతంత్రను. ఇదియే మన కడపటి సందర్శ నమును, సంభాషణమును. నారాయణరావు నేల పెండ్లాడక తీరదో, నీకుగూడ చెప్పుటకు సందేహించుచున్నాను. ఇదియొక రహస్యము. అనిరుద్ధునిగూర్చి- అతనిజుట్టు ఆయన చేతిలో నుం డుటవలన - నాయన కాగ్రహము కలిగింపకుండుట - నావిధియై నది. ఇంతకన్న నీకుకూడ చెప్పఁజాలను.

రామారావు:—దీనినిగూర్చి నేనుకూడ కొంచె మె ఱుగుదును. ఒక సందేహాస్పదమైన ఫోర్జరీనిగూర్చి కాదా?

శకుంతల:—ఆశ్చర్యముతో 'నీ కెట్లు తెలిసినది?'

రామా:—ఊరిలో కొందఱనుకొనుచుండగ వింటిని.

అని ఈమాటలు శకుంతలకు కష్టముగ నుండుటఁజూచి— “దీని కేమి యాగుసగుసలు శీఘ్రముగనే యడగును. నిజ మెవ్వరికిని దెలియదు. నారాయణరావుగారి కనిరుద్ధునిపై నేదో యనుమానము కలిగినదనియు, నిది కలహముగ జరిగె

మించినదనియు ననుకొనుచున్నారు. ఇది మన కిప్పు డక్కరమైనదని చెప్పితినిగాని లేనిచో నేను దీనిని గూర్చి ప్రస్తావించియుండను. అయిన నొక్కటి చెప్పవలసియున్నది. నారాయణరావుగా రనిరుద్ధునిపై ననుమానపడుట యన్యాయము. దీనిని గూర్చి మీ రెల్ల రింత భయపడు టేల?

శకుంతల:—నేను భయపడుచుండుట లేదు. మాతండ్రి గారికి కూడ అనిరుద్ధునిప్రవర్తనయం దనుమానము కలదు. నిజముగ నాయనకు కొన్నిదినములనుండి దీర్ఘాలోచనమును, దుఃఖము నధికముగ నున్నవి. అకాలముగనే వృద్ధునివలె కన బడుచున్నారు. మాసవతితల్లికూడ పూర్తిగ మారిపోయినది. ఆమెకు ఆతురతయు భయమును హెచ్చినది. నే నామెకు నప కారము చేసితినో యన న న్నతిక్రూరముగఁ జూచుచున్నది. అసహ్యించుకొనుచున్నది నాకు భవనమున గత్తులపై సాము వలె నున్నది. నే నొంటరిగ గనబడినచో నామె నన్ను నారా యణరావును మాని, అన్నప్పను బెండ్లాడుమని బలవంతపెట్టు చుండును. అన్నప్పగారును పరిపరి వచ్చి నాకు నసహ్యముగ నుండునటుల నింట బ్రవర్తించుచుందురు. అత డెల్లప్పుడు నామె తో కలహించుచుండును. మాతండ్రిగారు నాతని ధూర్త లక్షణముల కేమనుట లేదు. అనిరుద్ధుడును జూచుచు నూర కొనుచున్నాడు. ఇదియెల్ల చాల చిత్రముగ నున్నది. అనిరుద్ధు డిప్పుడు పూర్వపుమానిసి కాడు, నాలుగైదు దినములనుండి

మఱియు ఘోరముగ మారిపోయినాడు. దీనుడై క్లేశముతో
నేదో యాపద వచ్చినవానివగిది అవనతవదనముతోఁ దిరుగు
చున్నాడు. వానిని జూచిన నాగుండెలు వ్రయ్యలగు
చున్నవి.

రామారావు:—అవును. అతడు మారినట్లు నేనును
గ్రహించితిని. అయిన నేలొకో తెలియదు.

నిజముగ ననిరుద్ధునిప్రవర్తనమును గూర్చి రామారావు
బాగుగ నెఱుఁగును గాని చెప్పుటకు సాహసింపడు.

శకుంతల:—ఇంట నెల్లరును ఏదో విధముగ నున్నారు.
అందరి నేదోదయ్య మావేశించినట్లున్నది. వెంకయ్యకూడ
మారిపోయినాడు. నీ వేల యిట్లున్నావని నే నడుగ నాతడు
వెలవెలఁబోయి 'ఏమియు లే'దని యూరకొనినాడు!

రామారావు భవనములోని వింత సమాచారములను
విని యాశ్చర్యపడెను. 'శకుంతలా! ఇది చాల వింతగనున్నది.
చాలవరకు దీర్ఘవిచారము లిందుకు గారణమైయుండును. అయిన
నీగొడవ యెల్ల నటులుంచుము. ఈక్షణమున మనకు కష్టసుఖ
ములును, భావనములును చెప్పుకొనవలసినవి చాల కలవు. ఆ
నాడు నాహృదయసీమను కనుగొంటివికదా! నాయాసలును
ఆశయములును నిరర్థకములేనా? నీ జీవితము వృథ కావలసి
నదేనా? నాస్వర్గమును ఐహికసుఖమును మాయముచేసె
దవా? నే నిఁక నాదారిని జూచుకొని పోవలసినదేనా?

శకుంతల:—నాతోడిదే నీకు లోకమా! అదృష్టవంతుడవు. నీ కీలోకమున లేనిదేమి?—అని దీనముగ పలికెను.

రామారావు:—ఏమున్న నేమి - సౌఖ్యము, ఆనాదము, లేనిది - నీవు లేనిది? నిజముగ మనశరీరములు వేరుకాని, హృదయము లొక్కటేకదా! ఇప్పు డొక్కమారుగ నాప్రేమను దుంచివేయు టెవరితరము? ఇది బాగుగ నాటుకొనిన వృక్షము. నీవులేనిది నేను జీవించుట దుర్లభము నిన్ను సులభముగ వదలుకొనజాలను. వదలి యిచ్చుటనే యుండి భరింపజాలను. మనము కేవలము మిత్రులముగ నుండుట యసంభవము. నిన్ను ప్రేమించుటకు, ని న్నాసించుటకు, నిన్ను పరిగ్రహించుటకు నాకు వీలులేకపోయినచో నా కీయూరేల? ఈలోకమేల? నేను దేశాంతరమునకు బోయెదను.

అని తన మోము నావలకు త్రిప్పుకొనెను. ఆమెకు దుఃఖము పొరలివచ్చెను. ఎంతప్రియుత్నించిన నాతని మఱచుటశక్యము. అతని సుందరరూపము నామెహృదయపీఠము నుండి తొలగించుటకష్టము. అతని సుగుణసంపద నుపేక్షించుట అసంభవము. ఆతనితో తాను బాల్యమున నాడిన యాటలు, పాడినపాటలు, నీమెకుఁ గన్నులకుఁ గట్టినట్లుండెను. ఇత డీయూరు విడచి పట్టనమునకు బోయి మెల్లమెల్లగ విశ్వవిద్యాలయ పరీక్షలఁ గృతార్థుఁడై వైద్యశాస్త్ర మభ్యసించి వచ్చు కాలమున సెలవుదినములలో కొంతము వయసువచ్చు

చుండుటవలన కొంచెము లజ్జతో- కొంచెము సందియముతో-నుండుటయు, మాటలలో ప్రవర్తనమున గొంచెము మార్పు కలుగుటయు నీమె జ్ఞాపకముదెచ్చుకొనెను. ఇతడీ యూరనే వైద్యాలయమున నుద్యోగమున బ్రవేశింప పెద్దవాడైనాడని పలువురు గౌరవించుటవలన, శకుంతలయు నాతని జూచి లో లోన సంతసించుచుండెను. అట్టి బాల్యస్నేహితుని, ప్రియుని, యిట్టి దుఃఖమున ద్రోసిపోవుట పాడికాదని, అన్యాయమని, యచ్చటిప్రకృతి శకుంతలకు బోధించుచుండెను. ఈతని నెడ బాసినచో వీనిజీవితమును వ్యర్థముసేయుటే గాక, తన జీవితముకూడ నడవిగాచిన వెన్నెల యగునని యు నీమెహృదయమున నొకశక్తి చెప్పుచుండెను. కాని యీమె కృష్ణారావుగారికి వాగ్దానమును నెరవేర్చుట తనవిధి యనియు, పితృవాక్పరిపాలనముకన్న తనసౌఖ్య మెక్కుడు కాదనియు తలచుచుండెను. ఆ భయంకరగృహమున కత్తులబోనులో నీమె తన విద్యాబుద్ధులను గఱచియుండెను. అందువలన దక్షణమే శకుంతల మనసు నిగ్రహించుకొని మెల్లన- "నిజముగ నిది సంతాపకరము! ఘోరము! ఏది యెట్లున్నను దుఃఖముకును బశ్చాత్తాపమునకును నిది సమయముకాదు. కాలముతీరినది. ఇది యేమన కడసారిచూపు. నీతో నిక మాటాడు టన్యాయము, సత్యవ్రతము చెడను. నీవును సర్వమును దెలిసిన వాడవు; ఇట్లనుట పాడికాదు. నీవు దేశాంతరమున కేల పోవలయును?"

రామారావు:—'ఆఁ! నాకు సర్వస్వమును, నా బహిః ప్రాణమును నగు నీవు అన్యునిభార్యవై యుండ చూచుచు నే నిచ్చట నుండఁ గలనా? అందు నాతఁడా, నిన్ను పరిగ్రహించుట? ఈ బాధను సహింపలేను. దైవకృపవలన, నితరులబాధలను పోఁగొట్టఁగల నేను, నాహృదయతాపము నడంచుకొనఁ జాలకున్నాను. కాలము సర్వస్వమును మఱచునట్లు చేయునం దురు కాని, హృదయసంతాపము నడంపఁ జాలదు. అందు నా కిది యుద్ధములో తగిలిన గాయమువలె తీవ్రముగ నున్నది. శకుంతలా! నిజముగ ననిరుద్ధుని గాపాడుటకొఱకే నీ విందుల కొడంబడుచున్నావా?' రామారావు తనదుఃఖమున సుశీలమ్మగా రనినమాటలు జ్ఞాపకము చేసికొని, 'నారాయణ రావు దోషియే యైనచో నెంతఘోరము!' అని తలంచెను. ఇది నిజమేయని తెలిసినచో నీపాపఁపుఁబెండ్లి యాగిపోవును కదా యని, మునుగ సిద్ధముగ నున్నవాఁ డొకగడ్డిపోచ నాధారము చేసికొనునట్లు, రామారావు తలపోసెను.

శకుంతల— అవును, అనిరుద్ధునిపైన బహిరంగముగ నేరము మోపకుండగ, కళంకముఁ దలవంపులు లేకుండగ నిది జరుగవలసి యున్నది.

రామా:—అనిరుద్ధుఁ డేమనుచున్నాడు?

శకుంతల:—తా నావంతయైన నెఱుఁగ ననుచున్నాడు. సందర్భములు వానికి విరుద్ధములుగ నున్నవి. వాడు తన సత్ప్ర

వర్తనము, నిర్దోషిత్వము, స్థాపించుకొనువఱకు నిది వానిపైననే యుండును. కాఁబోవు జమీందారుఁడగువానిపై నిట్టికళంక ముండవచ్చునా?—యనగ, కన్నులు విషాదముచే బ్రజ్వలించుచుండ, నాతడు 'నేను అనిరుద్ధునితో మాటాడిన నేమైన లాభముండునేమో! అతడు నిజముగ నపరాధియైనచో నాతని కిట్టి యిక్కట్టు కలుగుట చిత్రము. సందర్భములు మాత్ర మితని కేల విరుద్ధములు కావలెను? ప్రయత్నించెదను.' అనెను.

శకుంతల:—ప్రయత్నింపవచ్చునుగాని యేమిలాభము? వాఁడు మారిపోయినాడని నేనే చెప్పియున్నానుకదా! వాఁడు తిన్నగ చెప్పునని నాకు తోచదు." అనుచు నామె బండివంకకు నడువసాగెను.

రామా:—అట్లయినచో నీఁక దేశాంతరమే నాకు శరణ్యమా?

శకుంతల వడంకెను. 'అప్పుడే వలదు. ఇంకను కొన్ని నాళ్లు కలవుకదా! ఏమి జరుగనున్నదో, భగవంతుని పైన భారము వేయుదము.'

రామా:—(విషాదముతో) దైవమే యున్నచో నిది జరుగకూడదు. నేను న్యాయముగ, గౌరవముగ, చేయఁగల దెల్ల చేయక నీళ్లు వదలుకొనను. నిజముగ మనయనురాగమే భగవంతునియనుగ్రహమునకు పాత్రమైనచో మనల నీఘోరావస్థనుండి యావరమేశ్వరుఁడే రక్షించును.

ఇట్లు నారాయణరావుపెండ్లినిగూర్చి దుఃఖించునది పీరొక్కరే గాదు. అతడే నిజముగ హత్యచేసెనని తలంచు చుండిన సుశీల యుద్రేకముతో నీపెండ్లి నెట్లైన నాపెదనని శివరామయ్యగారితో నా క్షణముననే పలుకు చుండెను. 'అమ్మా! తొందర పడవలదు. మీరు మీరహస్యమును బయ ల్పరచినచో నేరమునకు నిదర్శనములు చూపులోపల నారా యణరావు పలాయనము జెందును, మఱల మీ కాశాభంగ ముకలుగును. దౌర్జన్యము చేసిరని మిమ్ములనే మఱల బంధిం చినచో మీరు విముక్తి జెందునప్పటికి చాలకాల మగును. అమ్మా! తొందరఁ జెందకుడు. ఆలోచించి మెల్లన ప్రవర్తిం పుడు.' అని శివరామయ్యగా రామెతో ననుచుండిరి.

సుశీల:—వ్యవధిలేదు. ఇకఁ మూడుదినములే కదా!

శివ:—అయిన నేమి? ఈలోపున నేమిజరుగనున్నదో? నిజముగ నాతడు దుర్మార్గుడైనచో పాపము బిడ్డలుకాక మా మనా? పరమేశ్వరుఁ డూరకొనునా? శాంతింపుడు. గడపటి క్షణమువఱకు నోపికపట్టి యుండుడు. నందోరాజా భవిష్యతి.

# పందొమ్మిదవ ప్రకరణము.

## —• అన్నప్పగారి ప్రతిజ్ఞ •—

భోజనము లైనపిమ్మట జమీందారిణియు తనగదిలో
నికి పోయెను. అచ్చట నెప్పటివలె మొదట నిలువుటద్దము
దగ్గర కొంచెము తడవు నిలిచి పరిచారికతో మాటలా
డుచుండెను. ఆమె మో మిప్పుడు పూర్ణముగ మారియుండెను.
'చూచితివా మందారా? లాభము లేకపోయినది. ఋణముల
సంగతి బయల్పరచినను అన్నప్పకు శకుంతలదక్క లేదు. ఈ
యన తా నన్నమాట మీరఁజాలఁడట! ఆహా! సత్యహరిశ్చం
ద్రుఁడు! పెండ్లి పీటలమీఁదనుండగ తన సర్వస్వమును బోవు
చుండగ నైన జూడఁగలఁడు కాని, చేసిన వాగ్దానము తప్పఁడట.
ఉపాయము కనఁబడగా దానినిబట్టి పోయి కృతార్థుఁడు కాదల
చడు. ఎంత పట్టుదల! సర్వనాశన మగును లెమ్ము, రోగము
కుదురును.'

మందార:—ఈ సర్వనాశన మాయనకు మాత్రమే
కాదు; మనకును సర్వనాశనమే.

జమీం:— అవును. ధనము చేకూరనిచో మన కిది
సిద్ధమే! ఇప్పటికే యతనికి గోపమువచ్చియుండును. క్రిందటి
మారు పంపిన ధన మాతని కందియుండునుగాని, యది స్వల్ప

ము. తొంబది రూప్యములు మాత్రమే. వేలు లక్ష్యములేని వాని కిది యెంత?

మందార:—అతడు తృప్తిపొందనిచో మొదటికే మోసమువచ్చును జమీ!

జమీందారిణి:—మోము సిటుత్రిప్పి, కనుబొమలెత్తి-'ఏమి చేయు మనియెదవు? ధనమెక్కడనుండి తెమ్మనియెదవు? అన్నప్ప దమ్మిడియైన నీయఁడు. మఱియు నీవివాహము జరిగినచో నొక్కమారుగ మనపైఁబడును. అందువలన నిక గొన్నివత్సరములవఱకును మనము కన్నులతో ధనముఁ జూడఁజాలము! అబ్బా! యీతఁడీ ధనమెల్ల నేమిచేయుచున్నాఁడో! కృష్ణారావుగా రింతధన మేమిచేసితి వని నన్నడిగిరి!

మందార "ఆఁ!" యని యూరకొనెను.

జమీం:—"ఈపెండ్లి నెట్లైననాపవలెను." అనియెను ఇరువురు మిన్నకుండిరి.

వివాహము నాపవలెనని ప్రయత్నించువా రొక్క జమీందారిణిమాత్రమే కాదు. ఒకవంక సుశీలయు, నింకొక వంక అన్నప్పగారును, వేరొకవంక రామారావును కూడ వివాహ మెట్లైన నాగిపోవలెనని కోరుచుండిరి. వీరి యాలోచనల కన్నిటికి దేవతలు "తథాస్తు" అనుచుండిరి. అన్నప్పగారి కీక్షణమున జమీందారిణి పైన మాత్రమేకాక ఆకుటుంబముపైన సంఘముపైన లోకముపైన గూడ తీవ్రమగుకోపమువచ్చెను.

తనకు వివాహమూ, జరుగలేదు. బంధు మర్యాదలూ, జరుగుట లేదు. మునిసిపలు ఎన్నికలలో నన్నప్పగారెన్నుకొనబడలేదు. ఆయన డాంబికము, పైమెఱుఁగులు, నటనములు, నాయనకు లాభింపలేదు. ఆయన వీరెల్లరిపైనను, అందు ముఖ్యముగఁ దనకు వీలున్న జమీందారుగారి పైనను, పగదీర్చుకొన నుద్యుక్తులైరి. "ఆహా! వీరెల్ల రెంతదుర్మార్గులు! వీరు తన్ను గారవించునట్లు నటించిరి. పరిహసించిరి, మోసపుచ్చిరి. నాదగ్గర నున్న తనఖాపత్రములు చిత్తుకాగితము లనుకొనిరి కాఁబోలు! నాప్రభావమును ప్రజ్ఞయు వీరికి జూపించెదనుగాక! ఈజమీందారీకెల్ల నేనే యధికారినై గౌరవమును పొంది, అడుగులకు మడుగులొత్తించుకొనెదగాక! ఇదియే నాప్రతిజ్ఞ! నెల్లూరిప్రజలు నన్నెన్నుకొననందులకుపశ్చాత్తాపపడునట్లు గూడ చేసెదగాక! కాని, శకుంతల మాట యేమి? ధనముగౌరవము పేరునెట్లైన సంపాదించుకొనవచ్చును గాని, శకుంతల నెట్లు సంపాదింప గలను? ఆమె నాదుర్మార్గుడు పెండ్లాడిన పిదప నేమికార్యము? ఆమెను పెండ్లాడినచో నివియెంత?" అని అన్నప్పగారు తల పోసిరి. ఆయన బందియందు కూర్చుండి జమీందారుగారి యింటికి వచ్చిరి. శకుంతలకొఱకు మరియొకమారు ఘోరకలహముచేసి ప్రయత్నింప నిశ్చయించుకొనిరి. ఎట్లైన నీ వివాహము నాపవలెను. పాపయ్య నామస్మరణమును మఱల ప్రయోగింప నిశ్చయించుకొనిరి. అన్నప్పగారిదివఱకువ్రాసిన

లేఖకు సింహాళమున గల రౌయికసంఘమువారివద్దనుండి ప్రత్యు త్తరము వచ్చెను. ఆకమ్మయం దిట్లుండెను.

"మహా రాజశ్రీ అన్నప్పగారికి

విధేయులు రామదాసు కంపెనీ వారు వందనములు.

తమరువ్రాసిన లేఖయు, వ్యయమునకై పంపిన ధనమును, చేరినవి. మేము ప్రయత్నించి తెలిసికొనగ నీ క్రిందిసంగతులు తెలిసినవి. మీ రడిగిన మనుజుఁడు చెన్నపట్టనమునుండి పదేండ్లక్రిందట నిచ్చటకు వచ్చెను. ఇతడెవరో తెలియదు. ఇతని కే యుద్యోగమును లేదు. క్లబ్బులలో చీట్లాడుటయు, గుఱ్ఱపుపందెములకుఁ బోయి యచ్చట ధనము నోడుటయు నాయన వినోదములు. మా ప్రతినిధి పరిశీలింపగ, నితని కెచ్చటినుండియో తఱచుగ పెద్దమొత్తములు మనియార్డరుగ వచ్చుచుండు నని తెలిసినది. మఱియు నాయనకు వచ్చిన కడపటి పెద్దమొత్తము రెండునెలలక్రిత మయిదువందలు. (అన్నప్పగారు తాము బదులిచ్చినవే యని గ్రహించిరి.) తరువాత నేలొకో చిన్నమొత్తములు వచ్చినవట. పాపయ్యగారిని గూర్చి మీ రేల యడుగుచున్నారో తెలియదు కాని, మీ రేదైన వ్యవహార మాతనితో చేయదలచికొన్నచో నాతడు నమ్మదగిన వాడు కా డనిమాత్రము మేము చెప్పగలము. అందువలన జాగ్రత్తగ నుండుడు. ఇత డనేకసందర్భములలో పందెపు

వ్యవహారములలో మోసమునకై పట్టుకొనఁబడినాడని తెలిసి నది. కనుక తెలిపినాము. ఇక విశేషములు లేవు.

చిత్తగించవలెను.

కొలంబో. రామదాసు కంపెనీ."

అన్నప్పగారు సంతోషముతో "ఓ హో!" యని తల పంకించిరి. బండి జమీందారుగారింటిముందు నిలిచెను. అన్నప్పగారు బండి దిగి, గుమ్మముదగ్గర వెంకయ్య కనబడగ "నమ్మగా రేమిచేయుచున్నారు?" అని యడిగెను.

వెంకయ్య "పెండ్లిపనులు జేయించుచున్నారు" అనెను. అన్నప్పగారు విషపునవ్వు నవ్విరి. అది "నాప్రజ్ఞ చూడుము" మనునట్లుండెను. ఆమెను చూడగనే ఆమెయందు కలిగిన మార్పు కనిపెట్టిరి. ఆమె యలక్ష్యముగ కనబడుచుండెను. 'ఈమె గర్వమును బూర్తిగ నడగించెదఁగాక' యని అన్నప్ప గారనుకొనిరి. ఆయన మెల్లన 'మీతో నే నొకమాటను చెప్ప వలసియున్నది,' అనిరి.

జమీందారిణి కొడలు ఝల్లుమనెను, కాని పైకి నెమ్మదిగనే యుండి 'ఏమది'? యని ప్రశ్నించి, 'కొంచెమాగుము. పని తొందరలో నున్నాను' అనెను. కాని మఱలసందేహించి భయపడి—'అయిన నది ముఖ్యావసరమైనదియైనచో చెప్పుడు?' అనుచు గదిలోనికి దీసికొనిపోయి కూర్చుండుమన

నాయునయు మీసము దువ్వుచు నప్రయత్నముగ గుండెల మెల్ల న జరచి కొనుచుండిరి. ఆయన జేబులోనే యాలేఖ యుండెను. ఆలేఖ నిప్పు డెట్లు ప్రయోగింతునా?' యని యాత డాలోచించుచుండెను. ఇది నిజముగ నుపయోగించు సంగతు లంతగ లేవు. అయినను ధైర్యముతో, తన జిత్తులమారి బుద్ధి నుపయోగించి, దీని నామెపట్ల నుపయోగించి, తమకార్యసిద్ధికై పని చేయదలంచిరి.

అన్నప్ప:—ఇంతవఱకు వచ్చినది కదా యని పెండ్లియగుచుండగఁ జూచుచు నూరకుందు నని మీ రనుకొనుచున్నారేమో? అట్లు తలంపకుడు. ఈవివాహము జరుగ గూడ దని నేను దృఢప్రతిజ్ఞుడనై యున్నాను. ఇది నాగౌరవమునకును, భావిజీవితమునకును నత్యంతావశ్యకము. నెల్లూర నాఘనత ప్రసిద్ధి కెక్కవలె నన్నచో శకుంతలను బెండ్లాడుట ముఖ్యము. అందువలన నే నూరకుండను. జాగ్రత్త.

జమీందారిణి (కోపముతో, నేలనుదన్ని) "నన్నేమి చేయు మనియెదరు? నేను. చేయగలిగిన దెల్ల చేసితిని. నా తప్పులేదు. మీదురదృష్టమున నా ప్రయత్నము ఫలింపలేదు. కాలము మించినది. ఇంకను మీ రాసించుట అందరాని మ్రాకులకఱ్ఱులు సాచుటయే. కావున శాంతింపుడు."

అన్నప్ప:—"ఆఁ! శాంతించుటా!! ఎట్లు? మీప్రజ్ఞనుపయోగింపరాదా! నాపెండ్లిమాట నటుంచి ముందుగ నిది తప్పింపుడు."

జమీందారిణి:— నా ప్రజ్ఞయెల్ల వ్యర్థయయ్యెను. ఋణముల సంగతియు మీకోరికనుగూర్చియు కూడ కృష్ణారావుగారికి తెల్పితిని. ఆయనతో నేను కలహించియుంటిని. నాయవస్థ మీ రే మెఱుగుదురు? ముందుకు పోయిన నుయ్యి, వెనుకకు బోయిన గొయ్యి.

అన్నప్పగారు తమ యెఱ్ఱనిమీసముల ద్రిప్పుచు జిరునవ్వునవ్వి వికసముగ-"అవును మీరు నాకు సాహాయ్యము చేయుటకు మీ కేమిలాభమున్నది? ఏమి భయమున్నది? అయినను మత్తగజమున కంకుశము వంటి దాని నొకటి నేను సంపాదించితిని లెండు." అని తనలోపలిచొక్కా జేబునుండి తటాలున నీలేఖను దీసి; "ఇదిగో! ఆనాడు పాపయ్యనుగూర్చి పరిశీలించి నిజము తెలిసికొందుననిపలికియుంటినికదా! నేను తెలిసికొంటిని, సత్యమును,విపులముగ, సాంతముగ." ఆయనమాటలయందు బాధ కలిగించి, కవ్వించు నొక విషశక్తి యున్నట్లు జమీందారిణికి తోచెను. "నే నచ్చట నొకరిని పరిశోధించి వ్రాయి మంటిని. ఇదియే వారి ప్రత్యుత్తము. ఇదిగో కాలంబోముద్ర!" యని పోస్టుముద్రను చూపుచు పలు

కుచు నామె స్త్రీశార్దూలము వలె వచ్చి యాలేఖను గొని పోవునేమో యన్నంత భయముపొందె మఱల భద్రముగ నా లేఖను లోపలి జేబులో నిడికొని బొత్తాములను పెట్టుకొనిరి. ఆమె కష్టములవలన, దీర్ఘచింతవలన రక్తవిహీనమైన కన్నులు, వికృతములై లోతునకుఁ బోయి, దవడలు చప్పిపడి చూచుట కసహ్యాకరముగ నుండెను. మోమున నాశ్చర్యము, భయము ప్రతిబింబితము లయ్యెను. ఆమె నిర్ఘాంతపడెను. ఆమెచూపులు వెఱ్ఱిదానివి వలె చంచలము లయ్యెను. అన్నప్పగారు మఱల "ఈ లేఖయందలి సంగతులను మీకు చెప్పనవసరము లేదు కాని, భయంకరములని మాత్రము చెప్పిన జాలును. ఇదిగో మీకు కడపటిమారు చెప్పుచున్నాను. ఈవివాహమును జరు గకుండ మీరు చేయని పక్షమున, పాపయ్య సంగతిని, ఆవ్యవ హారమును వెల్లడిచేసెదను.'' అని బెదరించిరి. ఆసంగతియు, ఆవ్యవహారములు నేవో తనకే తెలియవు! ఎంతటి బొంకు!! ఏదో సంగతి యున్నదనిమాత్రి మీకుశాగ్రిబుద్ధి గ్రహింప గల్గెను. అందువలన నిట్లు బెదరించుట లాభకరమని గ్రహించి యట్లుచేసిరి. ఆయన యూహయు, ప్రజ్ఞయు ఫలించెను. ఈ రెండవ ప్రయత్నము, ఈగంతు, అదృష్టవశమున బాగుగ పని చేసెను. అత డిట్టి ఫలితము కల్గు నని యూహించలేదు. అతడు చూచుచుండగనే జమీందారిణి నిశ్చేష్ట యయ్యెను. ముచ్చె మ్మటలు పోసెను. మందారచేత దాహము తెప్పించుకొని

యూపెను బొమ్మవయెను. ఆమె గంభీరము, ఒయ్యారము పోవ వికృతాకార యయ్యెను. కళావిహీన యై వడ వడ వడంకుచు, మెల్లన దెలివిదెచ్చికొని - "ఆః! దీని కెల్ల నర్థమేమి!" యని పలికెను. కాని, ధైర్యము నటియింపలేక పోయెను. అన్నప్ప కమ్మతాపులు వెదజల్లు నూనసముల దిప్పికొనుచు, మఱింత దగ్గరగ బోయి, "వ్యవహారతకు సహజమగు యుక్తితో మీకు రేపటివరకును గడు విచ్చితిని. ఈలోపున నెట్లు ప్రయత్నించెదరో? మీరు ఈవివాహము నాపవలెను. అట్లు ఆపనిచో నేను కష్టపడి సంపాదించిన సంగతులను బయల్పరచి మీకును వాఁయ్యగారికిని గల సంబంధ మాదిగాగల వృత్తాంతమును చెప్పినైతును. ఇఁక సెలవుదీసికొనెదను." అని గిరుక్కున విజయోత్సాహ్య మఱలి తీవిగ నడచిపోయెను. జమీందారిణియు భయోద్రేకముతో తప్పటడుగులు వైచుచు, గదిలోనికిఁ బోవుచుండెను. అనిరుద్ధునును పరాకుతో నానడవలో నీమె కెదురయ్యెను. కాని పీరోండొరుల గమనింపలేదు. ఆమెయు తన రహస్యమందిరమునకుఁ బోయి ప్రియపరిచారికబుజముపైఁ జెయ్యి వైచి 'మందారా! కొంప మునిగినది. ఈపెండ్లి నెట్లైన నాపవలెను. ఉరిపెట్టుకొనియైన నాపవలెను.' అనెను. మందార అయ్యో! యనెను.

# ఇరువదియవ ప్రకరణము

## —: సందర్శనము :—

అనిరుద్ధునందు కలిగిన మార్పు నాతని చెల్లెలును, తక్కిన బందుగులును మాత్రమే కాక, ఆతని నెఱిగినవారెల్లరు గనిపెట్టిరి. అతనిపై నిరాపనింద పడినదని వినినప్పటినుండియు నాతని చురుకుదనమును గంభీరభావమును పోయి, మందబుద్ధియు, నిర్లక్ష్యమును గలుగుట గమనించిరి. ఈతడు దుర్వ్యసనములఁ బడిపోవుచున్నాడని యెల్లరు ననుకొనిరి. ఇతఁడు పురమందిరమున పగలెల్ల కాలక్షేపము సేయును. అచ్చటగల వార్తాపత్రికలు చదువుట, చతురంగమాడుట మాత్రమే యాతని పనులు కావని పలువు రనిరి. ఈతఁడచ్చట కాల్చు సిగరెట్లకు మితిలేదు. ఇతడు త్రాగుట మొదలిడినాడని కూడ పలువు రనుమానించిరి. ఒకటియున్న లోకము పది కల్పించును కదా! అనిరుద్ధుడు పిచ్చివానివలె తిరుగుచుండెను. అప్పటినుండి యనిరుద్ధుడు తండ్రికంట బడలేదు. ఆనాటి సాయంకాలము అనిరుద్ధు డెప్పటివలెనే మెల్లన, నవనతవదనముతో నింటికి వచ్చుచుండెను. అతడు నీరసముగ నుండెను. నిద్రాహారములు లేమి, వేడిచే కన్నులు చింతనిప్పులవలె నుండెను. అతడు సింహద్వారమున బోక ఉత్తరద్వారమునుండి భవనములోనికి బోవదలంచెను. అప్పుడు చీకటిపడినది. ఇత

వితో పోవుచుండిన సీమకుక్క నేల వాసనజూచి గుఱ్ఱుపెట్ట సాగెను. అనిరుద్ధుడును కోపముతో! ఛీ! యూరకోను మని విసిగికొనెను. కాని కుక్క యూరకుండ లేదు. ఇది దేనినో పసికట్టినది. ఊరిలో రెండుమూడు చోటుల దొంగలు పడినా రని వెంకయ్య అనిరుద్ధునితో పలికియుండెను. వారేమైన నీప్రాంతముల దిరుగుచున్నారా? యని అనిరుద్ధు డనుమాన పడెను. తత్క్షణము కొంచెము చురుకుగ సిటునటు చూచి, తటాలున నాకుక్క మెడపట్టీని పట్టుకొని దానిని వెంబడించెను. అంత నొకమారా కుక్క మొఱుగ ప్రయత్నింపగ, నాతడు దాని మూతిని పట్టుకొని మిన్నకుండునట్లు చేసెను. ఏదో చిన్న యలుకుడు వినబడెను. పరికించి చూడ నా యుత్తరపు గవాక్షముచెంత నొక ఛాయామాత్రవిగ్రహము కనబడెను. ఇది స్త్రీవిగ్రహ మని అనిరుద్ధుడు గ్రహించెను. ఆవ్యక్తి యింకను కదలక యచ్చటనే నిలిచి యుండెను. అతడు రెండు మూడడుగులు ముందుకు నడచెను. కుక్క తటాలున మొఱిగెను. ఆక్షణమే యామె వెనుకకు దిరిగి చూచెను. ఆమె దృష్టు లీతనిముఖముపై బడెను. ఈతడు నామెను చూచెనుగాని, యామె యెవ్వరో యాతడెఱుఁగడు. అందువలన తీక్ష్ణముగ "ఎవరువారు? నీ కిచ్చట నేమిపని?" అని పలుకరించెను. కాని, యితడనుకొనినట్లు లామె పారిపోవక, ఆవెల్తురునుండి మాత్రము తొలగి నిలిచి, యాతనినే

రెప్పవాల్పక చూచుచుండెను. అతడు నాశ్చర్యముతో ముం
దుకువచ్చి "ఎవ్వరవు నీవు? నీ కేమికావలెను?" అని మఱల
నడిగి, యామెను బట్టుకొని పోవుచుండ, నాక్షణమున వేరొక
స్త్రీ యచ్చటకు వచ్చెను. ఆమె మందార. ఆవెల్తురున వీరికిఁ
దగ్గరగ పోవునప్పు డామె మోము వెలవెల పోయెను. అని
రుద్ధు డామెను చూచి 'మందారా! నీ వీమానిసి నెఱుగుదువా?"
యన నామె తడబడుచు "నేనెఱుగను. ఈమె ఇచ్చటికి మంచి
యుద్దేశముతో రాలేదని మాత్రము చెప్పగలను. మనవారిని
బిలిచి తరుమ గొట్టించుడు. ఇట్లే దివఱ కొకమారు వచ్చియుం
డగ జూచితిని" అనెను.

అనిరుద్ధుఁ డంతట నా స్త్రీని పట్టుకొని "దొంగలకు
గార్యదర్శికాఁబోలు! నీవు తక్షణము పోయి ఇంటిలోని వార
లనెల్లర బిలిచికొని రమ్ము. నేను తప్పించుకొని పోకుండ చూ
చెదను." మందార సరియే యని పోవుచుండగ నీమె తడబడు
చుండుట ననిరుద్ధుడు చూచి భయమున వడకు చున్న
దనుకొనెను. అనిరుద్ధుడు మఱల "ఆగవాక్షమునుండి నీవేల
తొంగి చూచితివి? నీవు న్యాయముగ బని యుండినదానవైన
చో పగలేవచ్చి యుండవలెను గాని, యిట్లు రాత్రియందు
పొంచి పొంచిచూడ నేల? నీ నిజవర్తమానమును చెప్పుము.
చెప్పనిచో నిన్ను శిక్షింపఁ జేసెదను. నీ వెవ్వరవు?"
అనగా.

ఆమె—"నేను నీ జననిని" అనెను. అనిరుద్ధుడామెను విడచి యెదరిపడెను. ఆమెను దేరిపారఁ జూచి 'ఆఁ! హా! హా!' యని వెడగు నవ్వు నవ్వెను. ఆమెయు మెల్లన నాతని భుజముపైఁ జెయివైచి, యాతనిని జూచెను. అతఁడు నామె యంత పొడవుండెను. ఆమె మఱల "అవును. నేను నీతల్లిని. నిశ్చయముగ నిన్ను గన్నదానను–నిర్భాగ్యురాలను." ఈమె కంఠస్వర మనిరుద్ధున కామెయందు భక్తిని కలిగించుచుండెను. అతని బుద్ధిమాంద్యమెల్ల పోయి, చురుకుదనము వచ్చెను. అతని గుండె దడదడ గొట్టుకొనుచుండెను. అతఁడు "మాతల్లివా? ఎట్లగుదువు? ఆమె యిప్పుడు కారాగారమున లేదా?" అని అప్రియత్నముగ పలికెను. ఆమె 'అవును ఆమె కారాగారమున నుండెడిది. ఇప్పుడు విడుదల పొందినది. అందువలన నిప్పుడు నీయెదుట నిలిచియున్నది.' అనగా నతఁడు తటాలున ముందుకు దుమికి - అమెను వెల్తురున కీడ్చుకొనిపోయి యామె మోమును చూచెను. చూచుటయే తడవుగ నాతఁ డాశ్చర్యముతో "ఆఁ! అచ్చముగ శకుంతల పోలికయే!! ఈ కనుముక్కుతీరు లామెవే!" అని పలుకుచు దీర్ఘాలోచనాపరుఁడయ్యెను. ఆతని కామెయం దొకవిధమగు భక్తియు ననురాగమును గలిగెను.

తల్లి:—'బిడ్డా! నేను నీతల్లి నని నీయంతరాత్మ నీకు చెప్పుటలేదా?' యని తనచేతుల జాచెను. ఇక మాటాడలేక

పోయెను. ఆత డింకను సందియపడుట చూచి, "ఈ చేతులు రక్తసిక్తములు కావు. నేను త్రికరణ శుద్ధిగ నిరపరాధిని. నిన్ను పదేండ్లక్రిత మెడబాసి నప్పుడువలెనే, ఇప్పుడును నేను నిర్దోషిని. నాకు భగవంతు డొక్కడే సాక్షి. నాపై నిరాప నింద పడినది. హత్యాచ్ఛాయయందు నేనిప్పు డున్నాను. ఆ హత్య—" అని యింక నేమో చెప్పబోవుచుండ, అనిరుద్ధు డామెను 'నూరకుండు' మని నోరుమరాసి, "మాటాడవలదు. వారెల్లరు వచ్చుచున్నారు. ఇదిగో నామూలగోడ వెనుక దాగికొనుము. వారలను తప్పుదారిని బంపించెదను." అని యామె నచ్చట విడిచి, కొంచెముముందుకు పోయెను. అనేకుల పాదముల ధ్వనియు, కేకలును వినవచ్చెను. అంత వారి కెదురుపడి, తనకే యాశ్చర్యమును కలిగించిన, నెమ్మదితో "అదిగో! ఆదుర్మార్గురా లాదారిని బట్టి పారిపోయిన" దని బయటకు చూపుచు, "పరుగెత్తుడు నే నించుక పరాకుగ నుంటఁ జూచి పారిపోయినది" అని పలికెను. వారెల్లరు నావంకకు బరు వెత్తిరి. మందారకూడ నావైపునకే పోయెను. వీరెల్ల రట్లా వెన్నెలలో పోవుచుండ, తనయుక్తికి లోలోన సంతసించుచు, నాత్మణమునుండి తాను బాలుడుకాక ప్రపంచజ్ఞానము వచ్చిన పురుషుడ నైతి నని గ్రహించికొనెను.

# ఇరువదియొకటవ ప్రకరణము

## —♦ మననము ♦—

"వారల నావంకకు బంపివైచితిని. మన మా చెల్లమా టునకుఁ బోవుదము" అని గోడచాటున దాగియుండిన రాధా దేవితో ననిరుద్ధుడు పలికెను. అత డిప్పు డుద్రేకముతో నుండి నను దీనముగ లేడు. ఆతని కండ్లలో విషాదము కనబడుట లేదు. అతని మాంద్యమెల్ల పోయినది. ఇప్పు డా యావనతవద నము, తప్పటడుగులు, దీర్ఘాలోచనము, గొణుగులు, ఎల్లపో యినవి. ఇతడు గంభీరముగ ముందు జాగ్రత్తతో మెలకు వతో ప్రవర్తించెను. 'అటుపోవుదము రమ్ము. మనము మాట లాడుకొన వచ్చు'నని తన తల్లిచేతిని పట్టుకొనెను. ఆమె ము ఖారవిందము సీత దూరక చూచుచుండెను. ఆపదలవలన శుష్కించి, కాంతివిహీనమై యున్నను, గంభీరమై వర్చస్సు కలిగియున్నది! తన సహోదరివలె నీమెవికూడ వంక వెండ్రు కలు! అతడు మఱల 'ఈమేలిముసుగు నేలధరించితివి?" అని ప్రశ్నించెను.

రాధాదేవి:—నా వేషమును, మోమును గుర్తింపబడ కుండ నుండుట కొఱకు.

అని:—ఆఁ! ని స్త్రీయూర నెవరైన నెఱుగుదురా?

రాధాదేవి:—ఎల్ల రెఱుగుదురు. అవును. నీవు మాత్రము నన్ను చూడలేదు. నే నీయూర నుండిన కాలములో నీవు చెన్నపట్టణముననే చాలకాల మ్ముంటివి. నే నీయూర వైద్య శాలలో ప్రధానస్త్రీయుద్యోగిని. సుశీలమ్మనుగూర్చి విని యుందువు.

అనిరుద్ధు డాశ్చర్యముతో నదరిపడి "ఆ! సుశీలమ్మ గారవా?"

ఆమె మందహాసము చేసెను. ఆచంద్రకాంతి యామె పైఁబ్రసరింప, నాతడు తన చెలియలు నట్లే మనోహరముగ నవ్వులనుగూర్చి తలంచెను. ఇంతలో భవనమున మాటలు వినవచ్చుచుండుటవలన నిచ్చట నచ్చటనుండుట శ్రేయస్కరము కాదని యెంచి యామెను మెల్లనరమ్మని యా చెట్లమాటు నకు దీసికొనిపోయెను. వీరు మెల్లన నాతోటలో దట్టముగ చెట్లున్న ప్రదేశమున నిలిచిరి. అనిరుద్ధు డామెపైన చంద్ర కాంతి పడునట్టుల నామెను నిలిపి తా నామెను తనివిదీర చూచుచు, మఱల "ఇది నేను నమ్మజాలకున్నాను. ఆమె జీవించి యుండగ నెట్లిచ్చటికి రాఁగలదు?" అని యామెను బ్రశ్న పూర్వకముగనాడ నామె యితనికి బ్రత్యుత్తరముగ "అని రుద్ధా! నీవు నాదగ్గరకువచ్చి నిలువవా? ఒక్కమారు కౌగి లించుకొననీయవా? పదివత్సరములనుండి నిన్ను, శకుంత లను చూచి కౌగిలించి ముద్దిడుకొను భాగ్యమునకై వేచి, విసిగి,

వేసరి, శుష్కించి యున్నాను. నేను నిన్నెడబాయునప్పుడు కడపటిసారి కౌగిలించుకొని ముద్దుగొనియుంట నీకు జ్ఞాపకముండదు. శకుంతల కన్నులు దెరువని పసికూన. కాని నేనుమాత్రము మా కౌగిలితోడ నాముద్దుతోడను తృప్తిపడి తరువాత దుఃఖముతో, తృష్ణతో కాలముఁ గడపితిని. మహానరకమగు నావరకమున మీ పైనాసగొనియే జీవించియుంటిని. అహోరాత్రము లు మిమ్ము లనుగూర్చిన తలంపులే, మిమ్ములనుగూర్చిన వేదనే. ఇట్లు నిన్ను జూడగల భాగ్యము నాకుగలుగునని నేను తలచియుండ లేదు. నాదుఃఖము నేటికి తీరినది." అని, అనిరుద్ధుని శిరము మూర్కొని కౌగిలించుకొనెను. ఆమె కన్నులనుండి యశ్రు కణములు జోటజోట రాలెను. ఆమె యింక మాటాడలేక పోయెను. అనిరుద్ధునికి దుఃఖమువచ్చెను. ఆతడును మాటాడలేక పోయెను. ఆమె మెట్టకేలకు అనిరుద్ధునితో 'బాబూ! నీకు నమ్మకము కలిగినదా? నీజనని నేనా?'

అని:—అవును. నీకంఠస్వరము- రూపము- శకుంతలను పోలియున్నది. అంతరాత్మయు నీవే తల్లివని బోధించుచున్నది.

రాధా:—నేను చనిపోయితిననియే నీవు భావించి యుంటివికదా!

అని:—అవును. కొన్నినాళ్లక్రిందటివరకు నట్లే యెంచి తిని.

రాధా:—అటుపిమ్మట?

అని:—అంతట నీ నిజచారిత్రమును నాయనగారు చెప్పినారు.

ఇంతలో నాతని కా రంగము జ్ఞాపకము వచ్చెను. దుఃఖము పొరలవచ్చెను. రాధాదేవి యిది విని కొంచెము జాగ్రత్తగ నానుకొని నిలిచి-'ఆయన యేమిచెప్పినారు? హత్యను గూర్చియా?'

అని:— అవును.

రాధా:—ఆఁ! నన్ను గూర్చి యేమనిరి? దోషియే యనిరా?

అనిరుద్ధుడు మాటాడక తలవంచికొని 'ఊఁ!' యనెను.

ఆమె తన చేతులను పైకెత్తి "ఓ పరమేశ్వరా! యీ నీలాపనిందనుండి నా కిఁక విముక్తిలేదా? నే నెల్లరికన్నులలోను దోషి నేనా? దైవమా! నాపైఁ గనికరము లేదా?"

అనిరుద్ధుడు తటాలున దలనెత్తి ఆమెతో- 'నిజము చెప్పుము. నీవు నిర్దోషివా? నిరపరాధివా?'

రాధా:—నేను మనో వాక్కాయ కర్మముల నిరపరాధి నని చెప్పియే యున్నానుకదా? నేనుమిమ్ముల నెడబాసినప్పటివలె నిప్పుడు నామనసును, చేతులును, పరిశుద్ధములు; అకలుషములు. నేను నిర్దోషినని నీప్రేమచేత నాహృదయ సీమను చొచ్చి చూడగల నీవును గ్రహింప లేదా?" యని యామె దీనముగ పలికెను

అనిరుద్ధుడొక్కమారుగ 'నమ్మయ్యా! బ్రతికితిని?' అనుచు నామెను గౌగిలించుకొనెను. ఇంతవఱకు నడచుకొనిన దుఃఖ మొక్కమారుగ వెలికి రాగా, నతడు వెక్కివెక్కి యేడ్చెను. రాధాదేవియు అనిరుద్ధుడును తమ కష్టసుఖములను చెప్పుకొనిరి.

అనిరుద్ధుడు— "అమ్మా! నే నేమి చేయవలెనో చెప్పుము. అది యెంతకష్టముగునట్టిదైనను, ఎవరి కనిష్టమయినను, మా తండ్రి వలదనినను గూడ చేసెదను." 'అమ్మా' యనుపిలువు వినబడినంతనే రాధాదేవియొడలు పులకలెత్తెను. ఆమెకు పట్టలేనంత సంతోషము కలిగెను. ఆమెపెదవు లదరుచుండెను. అమ్మా! యని అనిరుద్ధుడు పిలుచుట యీామె వీనులకు విందొసంగెను. తన బిడ్డలు తన్నట్లు పిలుచుట వినుట కీమె ఎన్నివత్సరములనుండి యాసించెను.! ఇంతకాలమున కీమెకన్నులకఱవు దీరినది. ఇంతకాలమున కీమెకోరిక ఫలించినది. అంతట నామె

"బిడ్డా! ఎంతమాట!! నాయనగారు వలదనినది నీవు చేయుటేల? అట్లు పితృవాక్యముల నుల్లంఘింపు మని నే నెన్నటికిని బోధింపను. ఆయనపై నాకుఁగోపము లేదు. ఆయన నిజముగ పొరపాటుపడియుండిరి. నాకోపము, పగయు నాయనపైకాదు. ఎవడు ఘోరహత్యచేసి, అందుల కొక నిరపరాధి శిక్షపొందుచుండ సహించి యూరకొనగలిగెనో, అన్యాయముగ తనశిక్షను తప్పించుకొని నాపై నేరమును మోపి ఇప్పటి

కిని తలయెత్తికొని ఘనుడ నని తిరుగుచున్నాఁడో ఆదుర్మార్గు నిపై నాపగదీర్చవలెను.

అని:—వాఁడెవ్వఁడు? తత్క్షణము నీపగ సాధించెదను. చెప్పుము.

రాధా:—ఆసంగతిని నేడు మీాతండ్రికే చెప్పివేయవలె నని వచ్చితిని. ఇది నీ కిప్పుడు చెప్పెదను. నీవు ధైర్యశాలివి. ఇతరులు నీపైనమోపు కళంకము నీయందులేదు. గుణదోష ములు లేవు. నీవు స్వచ్ఛమగు వంశమునకు పట్టుగొమ్మవు. నీవి వర్తన యకలుషము. ధైర్యసాహసాది సద్గుణము లిప్పుడు నీవు చూపవలెను. నీచెల్లె లాపదయందున్నది. దానిని రక్షింప వలెను.

అని:—ఆఁ! ఆఁ!! ఆఁ!!!

రాధా:—అవును. ఆపాపి యీానారాయణరావే!

## ఇరువదిరెండవ ప్రకరణము.

—♦ అ ను మా న కా ర ణ ము లు ♦—

ఇరువురు నొకింతతడవు పూరకుండిరి. దక్షిణమునుండి గాలితిరిగి ఆకులను గదల్చుచుండెను. వీరియవస్థకై తాను వగ

చుచున్నదో యను ప్రకృతి తోచుచుండెను. అనిరుద్ధుడామె నాశ్చర్యముతో చూచుచుండెను. ఈమె కష్టములు పడిపడి తుదకు చిత్తచాంచల్యముఁ బొందినదా యనికూడ అనిరుద్ధుడను మానపడెను. అతఁడు నమ్మజాలక, తలద్రిప్పుచు "అట్లు కానేరదు."

రాధాదేవి:—నే నూరక చెప్పుటలేదు. నేను నెల్లూరికి వచ్చినప్పటినుండియు నీ విషయమునుగూర్చి పరిశోధనలు చేయుచునే యున్నాను. ఈహత్యనుగూర్చిన సంగతులెల్ల మననము చేసితిని. ఆమూలాగ్రముగ బరికించితిని. వార్తలను చదివితిని. వాఙ్మూలములనుగూడ పఠించితిని. విచారణమందు తెలియని సంగతులను త్రవ్వి యెత్తితిని. నిదర్శనములెల్ల నారాయణరావే దోషియని తెలుపుచున్నవి. ముఖ్యముగ నారాయణరావు స్వభావము నీక్షింపుము. అతనిప్రవర్తన మంచిది కాదని యాచెడుసహవాసము చేసి చెడిన నీవెఱుఁగుదువు.

ఆమె యింపుక యాగెను. దూరమునుండి యలజడి వినబడగ. అనిరుద్ధుడు భయము లేదని చెప్పి యామెను వెళ్ళుతురునుండి నీడకు రమ్మని చెప్పెను.

రాధాదేవి:—నారాయణరావు మొదట దుండగీఁడు, దుర్మార్గుడు నగు యువకుఁడై చెడునడతలఁ దిరిగెను. అతని నడవడికిఁ గోపించి తన స్వార్జితము నాతనికీయ నని యాతని తండ్రి బెదరించుచుండెను. అతనికి వ్యయమునకై పంపిన ధన

మునెల్ల గొలది దినములలో వేశ్యాసఖ్యముచేసి, అష్టోత్తరి జపము సేయుచుండును. తనస్నేహితులకడ నెఱిగినవారికడ ఋణములు సేయుచు, దీర్పలేకుండును. ఇతనికి మీ పెదతండ్రి లెక్కలేనంత రొక్కము నిచ్చుచుండెడివాడు. వీరిరువురు పట్టణమున కలసిమెలసి తిరుగుచుండిరి. అత డాయనను పాడుచేసెను. ఇట్లుండ హత్యజరుగుట కొక వత్సరముముందునుండియు నేకమైయుండిన వారింకొక నెల కిది సంభవించు ననగ గలహించిరి. వీరొండొరుల జూచికొనలేదు. ఉత్తర ప్రత్యుత్తరములు జరిగినవి. నాకు వీరిలేఖలలో నొకటి లభించినది. ఇదిగో చూడుము:—జూలై పదునైదవ తేది!

ఆపండువెన్నెలయం దనిరుద్ధ డాలేఖను మెల్లన జదువ గలిగెను.

"మహారాజశ్రీ నారాయణరావు గారికి.

నేనెంత నిదానించి నెమ్మదిగ జూచినను మీప్రవర్తన నాకు తృప్తికరముగ లేదు. పెద్దమనుష్యుడ నని పేరుపెట్టుకొనియు దుర్మార్గుఁడు నీచుఁడు నైన చేయనితుచ్ఛపుబని మీరు చేసితిరి. నేను మీకు కొంత ఋణపడి యుంటినిగాని, లేనిచో మీకు మాటల వ్రాయనైన వ్రాయదలచి కొనలేదు. మిమ్ము ను చూడనైన నిచ్చగింపను. మిమ్మును చూచి ఇదిగో పాపుడు, దుర్మార్గు డని చూచినవారెల్లరు ఛీ! ఛీ! యని యుమిసినను పాపము లేదు. ఈలేఖవలన మీకు కోపమువచ్చినను నాకు భయములేదు.

ఇట్లు,

నీలపురపు శ్రీరామారావువ్రాలు."

అనిరుద్ధుడు చదివి యామె కొసగి, "ఇది నీ కెట్లు దొరకినది?" అనెను.

ఆమె "అతఁన యింటనే! పూర్వము నారాయణరావు ప్రయోగించి, ఇప్పుడు మూలబడవైచిన యొక పాతపెట్టెలో నిది యుండెను. ఇప్పు డాయనయింట బనిచేయుచు నాతో కారాగారమున నుండిన అప్పలమ్మ యనునది నా కిచ్చినది." అని మందహాసముతో "ఈస్త్రీ న న్నొకప్పు డసహ్యించుకొనుచు నాకపకారము చేయదలచి యుండెను. ఒకమారు నడచి నడచి యూరిబయట విషజ్వరముతో పడియుండ వైద్యశాలకు దీసికొని వచ్చిరి. అచ్చట నామె నన్ను పోల్చుకొని, నారహస్యమును వెల్లడించి యుండునుగాని దానిని నే నేమరక కనిపెట్టి రోగమును గుదిర్చి సామమున లోకువ చేసికొంటిని. ఇప్పుడు నా కామె చాలసాహాయ్యము చేయుచున్నది. చూచితివా! ఈలేఖ నారాయణరావు ఏదో దుర్మార్గము నొనరించెననియు, మఱియు శ్రీరామారావుగారి కిది చాలా కోపము కలిగించెననియు తెలుపుచున్నది." గాలి రివ్వుమని వీచుచుండెను. చెట్లు కదలుచు చంద్రకాంతిని క్రింద నృత్యము చేయించుచుండెను. ఆమె మఱల మాటాడునప్పుడు కంఠస్వరము మార్పుఁజెందెను. "ఇఁక హత్యనుగూర్చి విచారింతము. హత్యకుఁ బూర్వము మూడు నాల్గు దినములు నారాయణరావు భవనమునకు వచ్చుచు పోవుచునుండెను. రామారావు

గారు దర్శన మీయలేదు. ఆహత్య జరిగిన దనుకొనఁబడు కాలమున నాల్గయిదు నిముసములలో నాతని నీయావరణ మందు నేనే చూచితిని. ఆనాఁడతఁడు భవనమునకు సింహద్వార మునుండి పోవక దొడ్డి గుమ్మమునుండిపోయి మఱల వచ్చుట వలన నాతఁ డట్లు వచ్చెనని యెవ్వరు నెఱుఁగరు. ఆసందర్భనమున వీరాడికొనినమాటలెవ్వరు నెఱుఁగరు. ఆలేఖను వ్రాసినలేఖరియు నందుకొనినయాతఁడును పరస్పరము కలహింపక మానుదురా? నారాయణరావు తాను భవనమునుండి తిన్నగ రైలుబండిలో చెన్నపట్టణమునకుఁ బోయితినని సాక్ష్యమును పలికియుండెను. ఇది యసత్యమని డాక్టరు రామారావు రుజువుచేయఁగలఁడు. అతఁడీతని నామరునాటియుదయమున నాయుడుపేటలో చూచె నట!" అనిరుద్ధుఁ డేమియు పలుకక వినుచుండెను.

ఆమె "ఆమరునాఁడాతఁడు మధురకు బోయెను. అతఁడు తరువాత కొన్నిమాసములవరకు నున్న యూరిలోనుండక తిరుగుచునే యుండెను. ఇతఁడు సాక్ష్యమునకు వచ్చి యాదినముననే మాయమయ్యెను. ఇత డెన్నోమారువేషములతో తిరుగుచుం డెను. ఒకయూర నుండె ననుకొన్నప్పు డింకొకయూర నుండుచు వచ్చెను. అతని తండ్రి యాత డిట్లు తిరుగుచుండగనే గతించెను. ఇతఁడు త్తరక్రియలకొరకైన రాలేదు. ఎవ్వడో బ్రాహ్మణుని పెట్టి చేయించిరి. ఇతఁడు తనయాస్తిని రెండేండ్లవఱకును స్వాధీ నము చేసికొనలేదు. ఇతనికి హత్యనుగూర్చిన భయముకానిచో

ఇంతజంకేల? " ఆమె మఱింత విషాదమును దెలుపు కంఠస్వర
ముతో "వారు నే నొక బాంకు నిచ్చుటనో సంపాదించి రామా
రావుగారిని జంపితి ననిరి! ఒకయాడుదానికన్న పురుషునికి,
అందు నారాయణరావునకు బాంకు సంపాదించుట, చంపుట,
సులభసాధ్యములు కావా? "

అనిరుద్ధున కేమియు తోచుటలేదు. ఆతం డొక తెరు
కాండమునకు జేరగిలంబడి నిలచెను. అతని కీ ప్రపంచ మెల్ల
పాపభూయిష్ఠముగఁ దోచెను. న్యాయముకొఱకు తల్లి పడు
చున్న యాతన యీతని గుండె దడదడఁ గొట్టుకొనునట్లు చేసెను.
అతఁడు పిడికిళ్లులు బిగించి, పండ్లుకొరుకు చుండెను.

ఆమె మఱియు "సీతనిపై నా కనుమానము పూర్తిగ
నుండుటకింక ననేక కారణములు కలవు. నిదర్శనములు నున్నవి.
శ్రీరామారావుగారి జీవితముపై నున్న ఇరువదివేల భీమాను
ఆయన తనకియ్యవలసిన మొత్తముకుగాను వ్రాయించికొనెను.
అతని కాయన యిరువదివేలు బాకీ లేరు. పదునైదు వేలు
మాత్రమే ఋణపడియుండిరి. అందువలన నీ వ్యవహారమున
నారాయణరావుగారైదు వేలలాభము సంపాదించిరి. ఈపత్రి
మీహత్యజరుగుట కారుదినములకు ముందు వ్రాసియిచ్చినట్లు
రామారావుగారి వ్రాతమూలము తెలుపుచుండగా ఆరునెలలకు
ముందు జరిగినటుల నారాయణరావుగారు తమసాక్ష్యమున
చెప్పియున్నారు! ఆయన స్వహస్తముతోడనే యీమార్పు

నాపత్రముపైఁ జేసియున్నారు. చూచితివా? అసత్యము లప్రమాణముల నెట్లు చేయుచున్నాడో!"

అనిరుద్ధుఁ డూపిరి త్వరగ పీల్చుచు 'ఇంతేనా? ఇంకను కలవా?'

ఆమె "ఇంతవఱకును సమకూర్పఁ గలిగిన సంగతు లింతియేకాని మెల్లగ నెన్నియైన సంపాదింపవచ్చును. శివరామయ్య గారి సాహాయ్యమున నీసంగతులనుసంపాదింపఁగలిగితిని. ఇంకను నిదర్శనములెల్ల సంపాదించుటకుగాను నేను కొన్ని నెలలవఱకును వేచియుండ దలచితినికాని ఇక నాలస్యము చేసినచో నీకూ్రరవ్యాళమునకు మనశకుంతల యెఱయైపోవునని భయపడి యిట్లువచ్చితిని. నీవీసంగతులెల్ల నీతండ్రితోఁడ నీరాత్రియే చెప్పి యీవివాహమును దప్పింపవలెను. నీవు దీనిని చేయఁగల సమర్థుఁడవు. నే నిప్పుడు విముక్తి జెందితినని నీ వాయనకు చెప్పినను చెప్పవచ్చును. నాకు మఱల ఘోరనరక మనుభవింపవలసి వచ్చినను భయములేదు. నాయుదంతమును, సచ్ఛీలమును, అనపరాధి నగుటయు చెప్పఁగలిగితిని. ఇక నేను మరణించినను సంతోషమే."

అని యామె యాతనిని మఱల కౌఁగిలించుకొనెను. అతనిదేహ ముష్ణముగ నుంటఁజూచి యామె యదరిపడెను. అతనియొడ లప్పుడు జ్వరపీడితుని దేహమువలె నుండెను. ఆమె "బిడ్డా! నీ వుద్రేకము పొందవలదు. నెమ్మదిగనుండుము. మీకు దగ్గరగనుండి చూచుకొనుచు నానందించుటకన్న నాకేమి సంతోషము? మిమ్ములనుగూర్చి తలంచుకొనుచు కాలము

గడపుచుందును. మిమ్ములనుగూర్చి వినదగినదెల్ల హృదయము దడదడఁ గొట్టుకొనుచుండ వినుచుందును. నేను బీదలకు, రోగుల కేదైన నుపకారము చేయఁగలిగినచో నది మీయందలి యను రాగమువలన నాకుగలిగిన బలముచేతనే! మీకు నాసంగతి నావంతయైనఁ దెలియకుండ నుంచితి రని నేను వినినప్పుడు నా కెంత బాధకలిగినదో పరమేశ్వరుఁ డెఱుఁగును. ఆమెవలన మీ రెంతో బాధలనొందుచున్నారని విని దుఃఖించితిని. నే నెంతో నెమ్మదిగ ఓరిమితో నాబాధలెల్ల నడంచుకొని మఱల నెన్న టికైన నా కిట్టి యన్యాయముచేసినవాని ద్రోహమును బయ ల్పరుప దైవము తోడ్పడునని యిట్లు జీవించియుంటిని. నేను నిర్దోషినని, నిరపరాధినని, నిజముగ నన్యాయముగ నీదుఃఖ ముల ననుభవించితినని, వెల్లడియగుకాల మెన్నటికైన వచ్చు నని యాసపడియుంటిని. అనిరుద్ధా! ఏమిది నీ వింతత్వరగ నూపిరి బీల్చుచున్నావు? ఆఁ! ఎచ్చటకు బోవుచున్నావు? - ఆఁ-"

అనిరుద్ధుడు పరాకుగ కన్నులు ప్రజ్వలించుచుండ బొంగురుగొంతుకతో "అతనిదగ్గరకు-" అని యామె పట్టు తప్పించుకొని "ఆదురాత్ముని జూచెదను, అడిగెదను, అసత్యము లాడినచో దండించెదను." అని వెడలిపోయెను.

సుశీలమ్మగారు గజగజవడకిరి. ఆమె వానివంక నిశ్చేష్ట యై చూచుచుండెను.

# ఇరువది మూడవ ప్రకరణము.

—♦ జమీందారిణి – నారాయణరావు ♦—

రాత్రి తొమ్మిదిగంట లైనది. జమీందారిణిగారు నారాయణరావుగారింటికి బండికట్టుమనిరి. ఇంతరాత్రివేళ నిల్లు పోవు టేల నని యాప్పు డచ్చటికి వచ్చిన శకుంతల వింత పడెను. శకుంతలను జూచి జమీందారిణి యిట్టిసుందరి నెవ్వడు విడువ నంగీకరించును? అని యనుకొనెను. జమీందారిణి చాల కలతఁజెందిన మనసుతోఁ బండిలోఁ గూర్చుండెను.

బండి నారాయణరావుగారి యింటిముందుగ నాగెను. జమీందారిణి కొంచె మిటు నటు చూచి, తలపంకించి యింటి లోనికి పోయెను. నారాయణరావుగారి యిల్లు దొరల బంగా ళావలె నుండును. నారాయణరావు వచ్చి యామెను చూచి యాశ్చర్యపడెను. "ఏమిది, మీ రిట్లింత పొద్దుపోయిన తరు వాత వచ్చితిరి?" అని యడిగెను. జమీందారిణి కొంచెము తొందరగ – "రావలసి వచ్చినది. ఇఁక నాలసించుటకు వీలులేదు. రేపు పెండ్లి జరిగినచో కొంపమునుగును. మీ రీ వివాహము మానుకొనవలెను. లేకపోయిన మాకు సర్వనాశనము కలు గును. అన్నప్ప మమ్ముల నిలువెడల గొట్టును" అనెను. నారా యణరా వాశ్చర్యపడుచు "మీరు నూరు చెప్పుడు, లక్ష చెప్పుడు, నేను శకుంతలను పెండ్లి యాడుట మానను."

అని ,యనుచుండగ జమీాందారిణి వెఱ్ఱికేక వేయుటచూచి "ఆ! ఆ!! ఏమిది? మూర్ఛవచ్చుచున్నదా యేమి?" అని ఆతురతతో పలికెను. ఆక్షణమున నొక. ప్రతి యాలమారు లోనుండి నారాయణరావుగారు తీయుచున్న కాగితములలో కనబడిన యొక చిన్న ఛాయాప్రతిమను జమీాందారిణి చూచి యట్లు కేకవేసి నిశ్చేష్ట యయ్యెను. ఆమె తటాలునఁ దెలివి తెచ్చుకొని "నా కిప్పుడప్పుడే మెల్లువచ్చుచుండును. సరియే కాని ఆపురుషుఁ డెవ్వఁడు?" అని యాప్రతిమవంక వ్రేలిడి యడిగెను. నారాయణరావుకూడ ఈ ప్రతిమను చూచి అదరిపడి మఱల మనసును కుదుటఁబెట్టుకొని "వీఁ డొకశిఖండి. పాపయ్య యనెడివాడు. ఇతని పటము కనబడినంత యాకస్మికముగ వీని పాడురూపు ప్రత్యక్షము కాకుండును గాక! పదివత్సరములకు బూర్వము వీనిని నే నెఱిగి యుంటిని. అప్పుఁ డీతఁ డొక పెద్ద జూదరి. మీా రీతని నెట్లెఱుఁగుదురు? కాని వీనిని మీా రెఱిఁగి నప్పు డింకను మీా రీ యుచ్చదశలో లేరు కాబోలు?" అని యామెను బరిశీలించి చూచుచు నట్లుకేలకు "పాపయ్య నా కొక స్త్రీప్రతిమను జూపియుండెను. అచ్చముగ మీా పోలికయే సుడీ! ఇన్ని వత్సరములనుండియు మి మ్మెచ్చటనో చూచితి నని వితర్కించుచుంటిని. నీలపురపు సుందరమ్మగారు -ఆఁ- నీవు పాపయ్యయింటనుండెడి సుందరివి కావా!" యనెను. జమీాందారిణి దీర్ఘాలోచనముతో "అవును. పాపయ్యకును నాకును

చాలకాలము క్రిందటనే విరోధములు వచ్చినవి.'' అనెను. ఆతని కప్పుడు కలిగిన భావములు చెప్ప వీలులేదు. అతఁడా మెను మరల చూచెను. అత డిప్పుడు చనవుగ మాటాడసాగెను. "అట్లైనచో నీ వెట్లు జమీందారిణి వైతివి? దీని కేమిగాని, ఆ పాపయ్య ఇప్పు డెచ్చట నున్నాఁడు? బ్రతికి యున్నాఁడా?"

జమీందారిణి పెదవులను దగ్గరగఁ జేర్చి "అతఁడు చనిపోయి నాలుగేండ్లైనది." అనెను.

నారా:—"ఓహో! చనిపోయినాఁడా; బ్రతికితిని" అనెను.

జమీందారిణి యాశ్చర్యముతో తనకు సంబంధమే లేనియట్లు "పాపయ్యయన్న మీ కింతభయ మేల" అనెను. సంతోషము, నుత్సాహమును నారాయణరావు నలక్ష్యునిగఁ జేయ—"వాఁడొక దుర్మార్గుడు. నాకు విరోధి" యనెను. జమీందారిణి రహస్యమెల్ల వెడలగ్రక్కింపదలచి, శ్రావ్యధ్వనితో "సత్పురుషులును రసికులు నగు మీకుఁగూడ విరోధులుకలరా''

నారాయణరావు "లేకేమి? మీరూరక పొరపాటు పడుచున్నారు. నిజముగ వీఁడు నాకు గర్భశత్రువు. అయినను వానికి నిశ్చయముగ నే నపకారణముఁ గలిగించితిని" అని చిరునవ్వుతో మేజపైనున్న మేలైన చుట్టనొకదానిని దీసి మునిపంటనోరికి, అంటించి, దానివలన మఱింత యుత్సాహముకలుగ "నీవృత్తాంతమెల్ల మీ కిప్పుడు చెప్పిన నష్టమేమి?

వాఁ డిప్పుడు వచ్చినాఁడుకదా! మరియు మనము శీఘ్రముగ నే
బందుగులము కాఁబోవుచున్నాము. అందువలన మనము యొండొ
రులగౌరవములకు బాధ్యులము. ఇదియుగాక నీసంగతి నా
యౌవ్వనమున జరిగినది. కాలదోషముపట్టినది. యౌవ్వనమున
నొడ లెఱుంగక ప్రవర్తించుట సహజమేకదా!" యని చిరు
నవ్వు నవ్వెను. జమీన్దారిణి దీర్ఘాలోచనము సేయుచుండెను.
కాలము వృథపోవుచున్నది. నిముషము లెగిరిపోవుచున్నవి,
కాని తాను తలంచుకొనిన కార్యము సఫలమగుచున్నట్లు
లిమెకు తోచుచుండెను. ఈ వృత్తాంతము తన కుపయోగించు
ననియే కాఁబోలు నామె యాతనిని మరింత పురికొల్పునటుల
తన సానుభూతిని తెలుపు మందహాసముతో "ఔను. సహ
జమే!" అనెను. నారాయణరావు నుత్సాహముతో "అది.
చాలకాలమునకుఁ బూర్వము జరిగినది. పదివత్సరములకుఁ
బూర్వము నాకు ధన మత్యంతావశ్యక మయ్యెను. నిజముగ
నా కెల్లప్పుడును ధన మత్యావశ్యకమై యుండెను. ఎట్లై
యిన నేమి; నా కప్పుడు ధనము చాల నవసరమై యుండెను.
మాతండ్రి నాకు మాసమునకుఁ దగిన వెచ్చమునకన్న నొక
దమ్మిడినైన నధికముగ నిచ్చువాడు కాడు. ఆమాసమున
నాకు ధనము కావలెనని యడుగ 'నీ కిచ్చునది న్యాయముగ
జీవించు యుక్తునకుఁ జాలినదే. నీసంగతినాకు వినిబడుచున్నది
లెమ్ము. నీవింకను దుర్మార్గములఁ దిరిగిన నీకు నాయాస్తిని దక్క

నీయను సుమీ' యని బెదరించెను. ఆయన తనపంతము నెర వేర్చికొని యుండును." అని తన పొగచుట్ట నుసిని మేజాయం చునకు రాచి, మఱల "నిజముగ నాయనయిచ్చు రొక్కము నాకు సరిగ నొకవారమున వ్యయమగుచుండెడిది. యువ కులు తమతోడివారివలన లోభియని పరిహసింపఁబడకుండగ చేయవలసిన వ్యయములు ముసలివారికి తెలియవు. నే నంత కంతకు ఋణములలో దిగబడి పోవుచుంటిని. నా కేమియు తోచ లేదు. ఋణదాతలు నలుప్రక్కలఁ జుట్టుకొనిరి. వారిలో చాలమందికి నాసంగతి తెలియును. వారిని మాతండ్రికిఁ దెలి యకుండ నుంచుట కష్టతరమయ్యెను. నా స్వవిషయముల గూడ పెద్దమ్మవా రెదురై పందెములందు నే నొడ్డిన ధనము పోవుచుండెను. నాకు తక్కిన విషయములఁ గూడ నష్టమే కలిగెను.

జమీందారిణి:—ఓహో!

నారా:—నా యదృష్టరేఖ మఱల బయటపడు నంత ద నేక నొకనిదగ్గర బదులుపుచ్చుకొన గలిగితిని. కాని అతఁడుమా త్రి మెంత కాలమిచ్చును? నిజముగ నాకు స్నేహభావమున బదు లిచ్చువా రొక్క రామారావుగారు మాత్రమే! అప్పు డాతఁ డును ధనమునకై చిక్కులు పడుచుండెను. అయిన నెట్టులో నాకొక రెండువంద లిచ్చెను. మహాసముద్రమున నీ యాను వెంత? ఈ సమయమున నొకగొప్ప పందెములో నొకగుఱ్ఱము

గెలుపొందదని యొడ్డితిని. ఆ గుఱ్ఱ మోటుపడనిచో నాకు సర్వనాశనము కలుగును. నాకెవఁడో యీగుఱ్ఱము గెలువదనియు నింకొక గుఱ్ఱము గెలుచుననియు రహస్యముగఁ జెప్పియుం డెను. అందువలన నిట్లు పందెము వేసి యందువలన వచ్చు ధనమువలన సుఖముగ నారు నెలలు కాలక్షేపము సేయుద మనుకొంటిని. నే నట్లు గెలుపొందదని యొడ్డిన గుఱ్ఱపు యజమాని పేరు పాపయ్య. అతని నే నీ పందెము జరుగుటకు ముందు చూడఁబోయితిని. నేను తన గుఱ్ఱము గెలువదని యొడ్డిన సంగతి నాతఁ డెఱుఁగడు. అందువలన తనగుఱ్ఱమును పలువురు పరీక్షించి యున్నారనియు, తనదే తప్పక గెలుపొందుననియు, వేఱొకగుఱ్ఱము గెలుపొందునని ప్రబలిన వార్త నీలివార్త యనియు నాకు రహస్యముగ చెప్పివేసెను. అప్పుడు నామన సెట్లుండునో యోజింపుడు. నాస్థితి, అవస్థ, దీనిపై నాధారపడి యున్నవి. నే నిం దోటుపడితినేని పకీరునగుదును. నాతండ్రి వెడల గొట్టును. ఋణదాతలు కారాగారమునకుఁ బంపుదురు. నాగతి యేమి? పాపయ్యతో 'చాల బాగున్నది. నీ గుఱ్ఱము యొక్క గెలుపుపై నేనుగూడ పందెము నొడ్డెద' నని నమ్మించి వెడలి పోయితిని.

జమీందారిణి కనుబొమ లెగురవైచి తల పంకించి తక్కిన విషయము లెల్ల తెలిసినట్లుండెను గాని మాటాడలేదు. నారాయణరావు తన ధోరణిలో నీమెను జూడకయే పొగ

చుట్టను నాలుగుమారులు పీల్చి మఱల "నాకు చాలభయము కలిగెను. కత్తులపై సామువలె నుంటెను. ఈ గుఱ్ఱము నెగ్గిన చో నాజీవితము నిష్ఫలమగును. దుఃఖమున బడిపోవుదును. నా యాట లిక సాగవు. చిన్నతనపుచొరవ చొప్పున గొన్ని వేల నొడ్డితిని. ఈ గుఱ్ఱమును చూచినంతనే నాకు దిగులుపుట్టినది. మంచి కళావంతమగు పంచకల్యాణి. చాల చురుకైనది. అందువలన నిది న్యాయముగ నెగ్గియేతీరును. నెగదని తలంచి యూరకొనుట ప్రమాదకరము. అందువలన నే నొక యుక్తిపన్నితిని."

# ఇరువదినాలుగవ ప్రకరణము.

## —♦ గుఱ్ఱపు పందెము ♦—

నారాయణరావు మఱల చుట్టను బీల్చి యిట్లు చెప్ప సాగెను. "అంతట నేను వేషమునుమార్చి గుఱ్ఱపువాని వేషమును ధరించితిని. నాకు గుఱ్ఱపుసాలలసంగతి బాగుగఁ దెలియును, అందు నీసాలను జాగ్రత్తగ పరిశీలించియుంటిని. సహజముగ పందెపుగుఱ్ఱమును బాగుగ కనిపెట్టియుందురు. పరుని కిందుచొచ్చుట సాధ్యముకాదు. కాని నా వేషము భాషయు నితరునివివలెలేవు. నారాయణరావునని యెవ్వఁడు పోల్చుకొనజాలడు. అంతకుముందుగ నేను పోయి చూచియుంటవలన

నచ్చటి సంగతి సందర్భములు నాకు బాగుగఁ దెలియును. ఆరాత్రి పాపయ్య చాల నప్రమత్తత కలిగి యుండునుగాన నే నాతని కొాక దొంగసమాచారమును కల్పించి పంపితిని. అతని రహస్యములను నే నెఱిఁగియుంటవలన నీ చతురమగు యుక్తిని పన్నితిని. ఇది మోసమని తెలిసికొానిన పిమ్మటకూడ దీనిని చేసినవాఁడెవ్వఁడో పాపయ్య తెలిసికొానలేకపోయెను. అందువలన పాపయ్య తనయప్రమత్తతను విడిచి యిలువెడలి బయటకు బోయెను. నే నిదివరకే ఆలోచించుకొానిన ప్రకారమే నేను లోన బ్రవేశించితిని. బాగున్నదా యుక్తి?" జమీాందారిణి తలనూచెను. నారాయణరావు మఱల "ఈసంగతి శ్రీరామారావునకు తరువాత చెప్పితినిగాని యిందుల కాతఁడు నాపై గోపించినాడు. తనకుమాలిన ధర్మము కలదా? ఇట్టి సందిగ్ధావస్థయందు నే నింక నేమిచేయఁగలను? అన్యాయమని యూరకున్న నెట్లు?" జమీాందారిణికి ఉద్రేకము నుత్సాహము కలుగుచుండెను.ఇఁక చాలించిన బాగుండునట్లు తోఁచెను, కాని కార్యవాదియగుట 'ఊఁ!' యని యూరకొానెను.

నారాయణరావు "అట్లు లోపలప్రవేశించి యాగుఱ్ఱమునకు కొంత ప్రతిక్రియను మీాగాళ్లపైన చేసి మఱల క్షేమముగ నే బయటకుఁబోవుచుండ బయటయాలజడి వినవచ్చెను. ఇంతలో గుఱ్ఱపువాడు మేల్కొాని నామీాఁదఁబడగా వానితలపైఁ బలముగ మోదితిని. వాఁడు నేలఁబడెను. చచ్చె నను కొంటినిగాని వాని

తల దిమ్మెక్కెనని పత్రికలో చదివితిని. ఇంతలో పాపయ్య వచ్చి నన్ను చూచి పులివలె మీఁదపడెను. మా కిరువురకును బాహాబాహిద్వంద్వయుద్ధము జరిగెను. నేనుబలవసినగుటఁచుదకు వానిని నేలపైఁబడవైచి బాగుగ మర్దించి, స్మృతితప్పునట్లు చేసితిని. పాపయ్య కాన్నాళ్ళు మంచము పట్టినాడు. అంతట నాపందెము గెలుపొందుటే గాక, నీవంచకల్యాణి తరువాత చాలమంచి దని, యేటెకు గుఱ్ఱముమీద నొడ్డి యెనువేలు గెలిచితిని. పైపందె మొకటివేలు. మొత్త మిరువదివేలు నాకు లాభము వచ్చెను. ఇందు నాఋణములు పోవగా మిగిలినదానిలో పదునేనువేలు శ్రీరామారావునకు బదు లిచ్చితిని. మొట్టమొదట నేను పందెములలో నీధనము గెలుపొందితి నంటినిగాని తరువాత సంగతి చెప్పివైచితిని. అంత నాతఁడు ఛీ ఛీ యని రోసి నా మోము చూడక నన్ను తిట్టుచువచ్చెను. అతని హత్యకొక నెలకు ముందు మాకు పరస్పర కలహము వచ్చెను. అతనితో సమాధానము చేసికొన నెంత ప్రయత్నించినను లాభము లేకపోయెను. నా యయోగ్యత కాతఁడు కుపితుఁడయ్యెను." అని తనచుట్ట నావల బారవైచి కొంచెము సరిగ కూర్చుండి, మఱల "రామారావు నాపైఁ గోపించెను. హత్య నాఁటిరాత్రికూడ మా కీవిషయమున నభిప్రాయభేద ముండెను. ఆరాత్రి యతనితో మాటలాడి నేనుపోయిన పదినిముసములకే యాఘోరహత్య జరిగెను. ఇది నాకు చాలదుఃఖమును కలిగించి

నది. అతనికి నాపైనఁ గోపమువచ్చినను అతనివంటి స్నేహితుఁడు నాకు లభింపఁడు. అందు నొకస్త్రీవలన చంపబడుట విషాదకరము—" అనెను. జమీందారిణి కంపము జెందెను.

నారాయణరావు 'నిజముగ నిది దుఃఖకారణము. పాపయ్యగుఱ్ఱము పందెమునకు పోవనందున వాఁడు దివాలాదీసెను. అతఁడు నన్నెక్కుడనైన చూచిపోవునేమో యని భయపడుచునే యుంటిని. వాఁడు నాపైన పోలీసువారికి ఫిర్యాదు చేసెనుగాని వారు ఉపేక్షించిరి. తనప్రాణముండగ నెప్పటికైన నాపైఁ బగఁదీర్చికొనెదనని వాఁడు ప్రతిజ్ఞ చేసెను. అందువలన నే నున్నచోట నుండక తిరుగసాగితిని. అతఁడు చనిపోయినందువలన నాశని విఱుగడయై పోయినది!" అనెను. జమీందారిణి యాపులించి "ఊఁ! మరినాకుప్రత్యుత్తరమిందు. ఆలస్యమైనది." అని వింతస్వరముతో సగర్వముగఁ బలికెను. నారాయణరా వీమెపలుకుల కాశ్చర్యపడి తేరి పారజూచెను. జమీందారిణి 'అపును. మీరు శకుంతలను పెండ్లియాడనని వాగ్దానము చేయవలెను. మీ రీరాత్రియే యీపురమును విడిచిపోవుడు. ఏదైననెప ముంచుడు. భకతంతివార్త నంపుడు. ఇది తప్పదు.'

నారాయణరావు తలనూపుచు "అట్లుచేయఁజాలను, చేయను. మీ రిట్లు నన్ను కోరుట వెఱ్ఱిపని."

జమీలా:— పాపయ్య చనిపోయినాఁడని శుభవార్తను దెచ్చి నందులకైన నామనవి వినరా?

నారా:—ఆహా! ఏమిమాటలు? పాపయ్య చచ్చిపోయినాఁడని వినుటవలన నాకు తృప్తియేగాని వాఁడున్ననేమి, పోయిననేమి?

జమీలా దారిణి విషపునవ్వుతో "అట్లయినచో మీకా లాభనష్టములను పూర్తిగనే కలిగించెదను. వాఁడు చచ్చినాఁడని నేను మీ రహస్యములను వెడలఁగ్రక్కించుటకే పలికితిని. మీకు నాతనికిఁగల సంబంధముఁ దెలిసికొంటిని. మీరు మీ ప్రవర్తనమును విపులముగఁ జెప్పితిరి. పాపము మీ సంతోషము తృప్తియు నిరర్థకములు. పాపయ్య బ్రదికియే యున్నాఁడు. పూర్ణారోగ్యమున నున్నాడు. వాఁడెక్కడ నున్నాడో కూడ నే నెఱుగుదును. మీ రీ క్షణమున నీ పెండ్లి మాని యీ యూరు విడిచిపోవనిచో మీ యునికి నాతనికి దంతి నంపెదను. జాగ్రత్త."

నారాయణరావు నిశ్చేష్టుడయ్యెను. ఆహా! ఈ స్త్రీయెంత జిత్తులమారి! అతఁ డేదో పలుకబోయెనుగాని జమీలాదారిణి "ఇవి వట్టి బెదరింపు మాట లనుకొనవలదు. మాకు సర్వనాశనము కలుగుటకు సిద్ధముగ నున్నది. ఎట్లయిన నీ పెండ్లిమాన్పుటకుఁ గంకణముఁ గట్టుకొని యున్నాను. అన్నప్పపై నాకు

దయయు లేదు, మీపైన నాగ్రహమును లేదు. అతఁడన్న నా కసహ్యమే. మీపైన మా కభిమానమును కలదు. అయిన నేమి లాభము? మొదటికే మోసము వచ్చుచుండగ నెట్లూర కొన కలను? కనుక మీ రిది వినుఁడు. పాపయ్య పూర్వము కన్న జిత్తులమారియు కార్యవాదియు నై నాఁడు. ఇదివరకు కన్న నెక్కుడు దుర్మార్గుడును దుష్టుడును నై నాఁడు. ఈయూరు మీ రీరాత్రి విడిచిపోవుఁడు. పోకున్నచో మీసంగతిని తప్పకుండ బయల్పరతును. మీరు మారుమాటాడవలదు. రేపీవివాహము జరుగకూడదు. జరుగనీయను" అని దృఢముగ పలికెను.

నారాయణరావు చిరునవ్వుతో- "ఇది నాటక మను కొంటివా యేమి? పిచ్చివేషములు వేసినచో సురభి కంపెనీలో నీవుచూపిన ప్రతాపమును బయల్పరచెదను. జాగ్రత్త! ఇఁక దయచేయుము." అనెను.

జమీందారిణికి నోట మాటలేదు. ఆమె బంశీ నెక్కెను. బండిపోవు వలను జూచుచు నతఁడు నిలువఁబడియుండెను.

# ఇరువదియైదవ ప్రకరణము.

—◆ అంతర్నాటకము ◆—

రాత్రి పదకొండున్నర గంటలైనది. పెండ్లికొడుకు నెవరో హత్యచేసిరను వార్త ప్రబలినది. 'అయ్యో! అనిరుద్ధా! అని ఒక ఆర్తనాదము నారాయణరావుగారి కంఠస్వరమున వినఁబడెను. నేను మఱల పోవునప్పటికి నారాయణరావుగారు చచ్చి పడియుండిరి.' అని అనిరుద్ధుఁడు పోలీసువారికి వాఙ్మూలమిచ్చుచుండెను. తన తల్లిసంగతి తప్ప తక్కినవెల్ల చెప్పివైచెను. తనకు నారాయణరావుగారిపైన అనుమానము కలుగుటయు ఆ నాటిరాత్రి $10\frac{1}{2}$ గంటలకు తా నాయనను గట్టిగ నీసంగతిని గూర్చి యడిగితి ననియు ఆయన తాను నిర్దోషి ననగా, అతఁడు హత్యగాఁడగుటమాత్రమే గాక, ఒక స్త్రీని నరకమునఁ ద్రోసి, తాను సుఖించుచు, నా స్త్రీ కొమార్తెనే పెండ్లాడఁ దలఁచి తమకుటుంబమునకు దాపురించిన రాక్షసివలె తనకు గనపడెననియు, 'నీ వబద్ధమాడుచున్నా' వని అతని మోమున నొక గుద్దుగుద్ది, 'దురాత్మా! ఇక్కడనే యుండుము. నిన్ను పోలీసువారి వశముచేసెద' నని తాను ఒక ఫర్లాంగు పోవునప్పటికి 'అయ్యో! అనిరుద్ధా!' యను నార్పు వినబడినదనియు చెప్పెను.

నారాయణరావుగారితో అత్యవసరమగు పనియుండి ఆరాత్రి యచ్చటికి హయగ్రీవుడు పోయియుండెను. నారాయణరావు ఆర్తనాదము విని తాను పరుగెత్తిపోయి చూడగా ఆదుబ్బులలో నుండి యొకపురుషుడు త్వరితముగ పారిపోవుచుండెననియు, తాను వానిని వెంబడించి తన కత్తికర్రతో నాతని కుడిభుజముపైన గాయపరచితి ననియు, వాడు పిక్కబలము చూపెననియు సాక్ష్యమిచ్చెను. ఇంక కొంతమందిని విచారించిరి. అనిరుద్ధుని సాక్ష్యము తృప్తికరముగ లేదనిరి. సందర్భములతడే దోషియని చూపుచున్న వనిరి. రాధాదేవి కొమరునిపై ఖూనీల నీహత్యానేరమును మోపి నెల్లూరు టవును పోలీసువారరెస్టుచేసిరి. కళంక మెక్కడికిపోవునని నెల్లూరి వారనసాగిరి.

ఇచ్చట భవనమున జమీందారిణియు తన ప్రియపరిచారికయు కష్టసుఖములు చెప్పుకొనుచుండిరి. "ఎల్లరు నాతనిపై దోషేళ్ళవలె పడుచున్నారు! ఏమిజరుగునో తెలియదు!" అని మందార పలుకుచుండగ జమీందారిణి యూరక తల పంకించుచుండెను.

మందార:—చూచితివా! నేను చెప్పినట్లే యైనది. ఆమెయే యీతనికి గనబడి, తన చారిత్రమును చెప్పి, తానా హత్యను చేయలేదని యొట్టుపెట్టుకొని యుండును. ఇది నిజమే! ఆమె యవస్థయుండే మన ముండినచో మన మట్లుచేయ

మా?'' అని పకపక నవ్వెను. కాని ఈ నవ్వులో సంతోషము లేదు. ఆమె మఱల ''చూచితివా? అనిరుద్ధుని వింతప్రవర్తనమున కిదియే కారణము. కొన్ని దినములలో నీతఁడు ప్రాజ్ఞుఁడును ధీశాలియునై దీర్ఘాలోచనాపరుఁడును ధైర్యశాలియునై నాఁడు. ఈ మార్పు చూచి మనము మందబుద్ధియు, దుర్వ్యసనముల ఫలము ననుకొంటిమి. సుందరీ! ఇతఁ డిప్పుడు భయంకరుఁ డగును జమీ!''

జమీందారిణి యింక నట్లే చూచుచుండెను. ఆమె కన్నులయం దిప్పుడు కళ లేదు. జ్వరతీవ్రమునఁ దెలుపు కాంతి మాత్రము కనబడుచుండెను. అనేకదినములనుండి కలిగిన దీర్ఘాలోచన, ఆతురత, నిద్రలేమియు, నీమెను వికృతరూపినిఁ జేసెను. ఆమె మోమున ముడుత లధికమయ్యెను. ఆమె కన్నులు మఱింత చంచలములయ్యెను. ఆమె నెవ్వరైన నిప్పుడు చూచి నచో నలువదియైదేండ్ల స్త్రీ యనక మానరు. ఆమె యట్లే పరాకుగ చూచుచు ''ఏమైననేమి? బందెలోపడినాఁడు. మఱల నందుండి తానే విడిపించుకొని రానిమ్ము. విడిపించుకొనలేక పోయినఁ బోనిమ్ము. మఱియు మంచిది- చూచితివా- అతఁడు కాఁడను నిదర్శనములు కూడ నున్నను అతఁడే యనుటకుఁ గూడ చాల నిదర్శనము లున్నవి.''

మందార కొంచెము గద్గదస్వరముతో ''ఇదెల్ల భయంకరముగనున్నది. ఇది యెట్లు పరిణమించునో!'' అనెను.

జమీం:—“నాకును తోచుటలేదు. ముందుగ అన్నతో మాటాడవలెను. ఇప్పు డాతఁడు మనకుఁ గొంచెము సాహాయ్యము చేయుననుకొనెదను. ఏలన, నీతనికి శకుంతలపై నింకను ఆశకలదు. ఆమె నతనికే పెండ్లి చేయవలెను. మనకిది యొక్కటే త్రోవ. అప్పుడే శకుంతలతో అన్నప్పను పెండ్లి చేసికొనవలసి యుండునని చెప్పివైచితిని.”

మందార:—ఆఁ! అప్పుడే? ఇంత తొందరపడితివేమి సుందరీ? ఆపెండ్లికొమరుఁడు చచ్చియుండ, అన్నగారు శిక్షింపబడ సిద్ధముగనుండ నిచ్చట నప్పుడే పెండ్లిమాటలా?

జమీందారిణి వెడగునవ్వుతో— “అయిన నేమి? మన మేల భయపడవలె?”

మందార:—ఆమె యేమన్నది?

జమీందారిణి పిడికిలులు బిగియించి, “ఏమన్నది? దుర్మార్గురాలు, యెదిరించినది. గంభీరముగ నిలువఁబడి నావంక నిర్భయముగ చూచి, ‘నే నాతనిని పెండ్లిచేసికొనను. మీ రేమి చేసినను సరియే’ అనిపలుక ‘నేనును గర్జించుచు సరియే లెమ్ము. చచ్చినట్లు పెండ్లియాడ వలసివచ్చును లెమ్ము. ఎగిరిపడకు’మని చెప్పితిని. ఇందు తనయిష్టము నెవరుచూతురు? ముందు మనయవస్థ చూచికొనవలెనుగదా! మనము పకీరుల మగుట కిష్టపడము. కృష్ణారావుగారుకూడ నిందుల కంగీకరింప వచ్చును. వరునిచావు- అనిరుద్ధుని కవమానము సంభవించిన

తరువాత నామె నెవరు పెండ్లాడుదురు ? నే నామెకీహత్య నని రుద్ముడే చేసెనని చెప్పితిని. ఆమె వాఁదు చేయలేఁదని సమ రించినది. అంత నిట్టిగర్వము రాధకూతురునకు తగ దంటిని. బాగున్నదా ? —అని విషపునవ్వు నవ్వెను.

మందార:— ఈ యెత్తిపోడుపు బాగుగనాటినదా? బాగుగనే నాటియుండును!

జమీన్‌దారిణి:—ఇది కఠినముగనే తగిలినది. ఈ మాటలామెకు నాటినవి. బోరగిలపండుకొని యుత్తరపుగదిలో నేడ్చుచున్నది. ఈసంగతి యీామె కిదివరకు తెలియకపోవు టచేత వింతగనే యున్నది. మన మీాయస్త్రమును ముందుగనే ప్రయోగించి యుండవలసినది. ఇది యామెగర్వము నడఁచి యుండును.

మందారమందహాసముఁ జేసెను. భయోపేతములగు కన్నులతో జమీన్‌దారిణి "ఏమిది మందారా! గవాక్షపుటద్దములపై జల్లుపడుచున్నట్టులున్నది?" అని కలతజెంది వడకుచు నడిగెను.

మందార:—అబ్బే! ఏమియులేదు. మందు వేసవిని జల్లుపడుటేమి? నీకు మతిభ్రమముగ నున్నది సుమీా! జాగ్రత్త!

జమీన్:—"అవును. మఱచితిని. నాకు త్వరితముగనే జబ్బుచేయును. లేనిచో పిచ్చియైన యెత్తును. తల బరువుగ

నున్నది. ఏమియు తోచదు - గుండెదడ - ఆయాసము - దిగులు - అబ్బా! పాపములుకూడ బ్రిద్దలగుచున్నవి. మనకీ ధనవిషయికమగు దురవస్థ చాలదా? పులిమీఁద పుట్రివలె నిదియు రావలెనా?" అని తనచీరె చెఱగుకురుట కదరిపడి మఱల 'అబ్బా- ఈస్త్రీ వెలువడుట నా కత్యంతము భయంకరముగ నున్నది. ఆమె యెచ్చటకు పోయియుండును? ఎచ్చట నున్నదో? నీవు మొట్టమొదట చూచినప్పటి నుండియు నీప్రాంతముల దిరుగు చున్నట్టు లున్నది. అయిన నెవ్వరును గుర్తింపక పోవుట విచిత్రము - ఎల్లరు నామె నెఱిగి యుందురుకదా!

మందార:—సుందరీ! పదిసంవత్సరములకుపూర్వ మున్న దానికిని, ఇప్పటిరూపమునకు నెంత తారతమ్య మున్న దను కొనుచున్నావు?

జమీార్:—ఎంతమార్పున్న నేమి? ఎన్ని వత్సరము లైననేమి? చీకటియందైనను నీ వామెను గుర్తింపగలవు.

మందార:—(మందహాసముతో) అవును, భయాసహ్యములు, ఎంత మందబుద్ధికైనను చురుకుదనమును కలిగించును.

జమీార్ దారి ణించుకవడకెను. "నేను నామెను గుర్తింపగలనేమో? నే నామె నెన్నడును చూచియుండలేదు. కాని ఆమెను చూచినచో సహజముగనే తెలిసికొనగలుగుదును. నాకేదో శక్తి యామెను చూపును. ఆమెవైఖరి నాకు తెలుపు ననుకొనెదను." అనియామెయనెను.

మందార:—అవును. ఆమెను చూడగనే గుర్తింప వచ్చును. ఆమెమో మామెచారిత్రమును దెలుపునట్లు వింతగ నుండును. సరియేకాని యీమె యిట్లు తిరిగి వచ్చిన దని శకుంతలకు తెలియునా? అనిరుద్ధుడు చెప్పినాడేమో!

జమీర్:—అట్లయి యుండదు శకుంతల నడవడిని బట్టియు మాటలను బట్టియు నామె కీసంగతి తెలియ దనియే నాయభిప్రాయము. అట్లు చెప్పుటకు వానికి వీలు చిక్కలేదు కాబోలు! ఇంతవరకు నాతఁడు తిరుగుచునే యున్నాఁడు.

మందార:—వాఁడట్లు చెప్పివైచినచో మనకు శకుంతలను లొంగదీయుట కష్టము.

జమీర్:—ఇఁక చెప్పుటకు వానికి వీలుండదు బాగుగ దిగబడిపోయినాఁడు.

మందార:—అవును, ఇదియుగాక ఇతఁడా మెకొమరుఁడగుటవలన మఱియు బీకికొని తినుచున్నారు.

అట సుశీల విషాదముతో శివరామయ్యగారికి తాను చూచిన సంగతులు చెప్పుచుండెను. "నారాయణరావు అయ్యో, అనిరుద్ధా! యనుచు ప్రాణముల విడచినాడు! నా కొడలు తెలియలేదు. మెల్లన పొదలలో దారిచేసికొని పోవునప్పటి కాతఁడు యమసదనము జేరెను. నా కది క్రొత్త చోటు. దారి తెలియలేదు. లేనిచో నేను నారాయణరావు ప్రాణములను రక్షించి యుందును. ఏలన నాతఁడు జీవించి

యున్నచో నావగ నింకను బాగుగ దీర్చికొన గలుగుదును నాశిశువుయొక్క యాధిక్యత నాతఁడును చవి చూడవలెనని నా యభిప్రాయము" అని నిట్టూర్పు నూర్చెను.

శివ:—అమ్మా! ఏమి చేయుదును? దినముల మాహాత్మ్యము.

ఆమె విషాదముతో "అయ్యా! అనిరుద్ధుని రక్షించెడి భారము మీదే సుడీ! మీరున్నారనియే నాధైర్యము." అని-వైద్యశాలకేగె. శివరామయ్యగారిచ్చిన పొట్లము విప్పిచూడగ, నందు ననిరుద్ధునికి బంపిన ధనము కొరకు మార్వాడి దగ్గర తాకట్టుపెట్టిన రత్నముతాపిన ప్రధానపు టుంగరమును మాంగళ్యము నుండెను. సుశీల శివరామయ్యగారి దయార్ద్ర హృదయమును గూర్చి మెచ్చుకొనుచు నీలోకమున నింక నాకీయన యొక్కఁడే దిక్కు అనుకొనెను.

## ఇరువదియాఱవ ప్రకరణము

—◆ జమీందారిణిరోగము ◆—

జమీందారిణి కొన్ని దినములనుండి జబ్బుగ నుండెను. ఆమెరోగ మెట్టిదో ఎఱిగినవారు లేరు. వైద్యులకుసహిత మిది తిన్నగ గోచరించుట లేదు. మెస్టర్ద్వార యిది నరముల

బలహీనతవలన గలిగిన దనెను. మీకు భయంకరముగా క్లేశ మేదైనకలిగెనా యని యడిగెను. ఆమె లేదనెను. అదినము సాయంతనము అన్నప్పగా రామెను చూడవచ్చి యుండిరి. ఆయనతో "నేను వేసిన ప్లాను బాగున్నదా!" యని జ్వరతీవ్రమున నిటునటు సోఫాపై దొరలుచు జమీందారిణి పలికెను.

అన్నప్ప—సందియ మేమి? కార్యములెల్ల అనుకూలము గనే యున్నవి. మీరు స్వస్థతఁ జెంది శీఘ్రముగ శుభకార్యము జరిగించు టే తడవు.

జమీం:—అవును అంతయు, బాగుగనే యున్నది. కాని శకుంతల కొక నెలగడవున్నైన నీయపలెను. ఏమందురా, ఆమెకు నిశ్చయమైన సంబంధము భగ్నమై వారమైన తిరుగ లేదుకదా! లేనిచో లోకులు పలువిధములఁ దలతురు. ఈ యాలస్యమునకు మీరు భయపడవలసిన పనిలేదు. మీకృపయు నావట్టుదలయు కృష్ణారావుగారిని వంచును. ఆయనకూడ అంగీకరించును. సరియేకాని కారాగారమునుండి ప్రత్యుత్తర మేమైన వచ్చినదా? ఆమెనుగూర్చి వ్రాసి కనుగొనెదనంటిరే!

అన్నప్పగారు మోమున విన్నదనముతోఁ తమవృత్తికి సహజమగు నభినయముతో సానుభూతిని దెలుపుచు, "వచ్చినది- వచ్చినది - మీ రనుమానించినది నిజమే- రాధాదేవి విడుదలపత్రముపొంది వెలువడినది—"

జమీం:—ఆఁ! నేఁ జెప్పలేదా? . యనెనుగాని, యామె చిక్కినమోము మఱింత వెలవెలపోయెను. ఆమె

లేవఁబోయి లేవఁజాలక మఱల నట్లే పడుకొనియుండెను. ఆమె కన్నులుమాత్రము క్రోధానలముచేఁ బ్రజ్వలించుచుండెను. ఊపిరికూడ సరిగ వచ్చుటలేదు. ఇదివఱకువలెనే అన్నప్పగా రాశ్చర్యపడిరి. “అమ్మా! మీకీ భయ మెందులకు? ఆమె వెలువడిన మీ రేల కలతఁజెందవలెను? నే నానాఁడే చెప్పితిని గదా! ఆమె బ్రదికియు మీకుటుంబమునకు వచ్చినదే యగుట నిశ్చయము. అట్టినేరముచేసిన స్త్రీ నెవరు పరిగ్రహింతురు. ఆమె నెవరో యీప్రాంతముల చూచినారని మీ రంటిరికాని, ఆమె నెల్లూరునకు వచ్చినదని నేనునమ్మను. ఆమె బిడ్డ లిచ్చుటనుండుట నిజమేకాని, అట్టిస్త్రీకి బిడ్డలపైన బ్రేమ యుండు నని నాకు నమ్మకము లేదు. ఆమె దుష్టస్వభావము కుంతలను బాడుచేయును. ఇది నే నిచ్చగింపను. ఆమె భవనమున కాలిడఁజాలదు. మీశాంతికి భంగకరముగ వచ్చి చూడనైన చూడఁజాలదు. విడుదలపొందినవారు ఒరులశాంతికేమైన భంగకరముగ వర్తించిరేని వారికి మఱల కారాగారవాసము సంభవించును. కొంచెము తప్పుచేసినచో మఱల నీమెను వెరకమునకు బంపవచ్చును.” అని అన్నప్పగా రనిరి.

జమీందారిణి కించుక ధైర్యము కలిగెను. సోఫాపైనించుక లేచి కూర్చుండెను. ఎట్లైన నాస్త్రీని మఱల బంధింపవలెను. ఆమె కారాగారకవాటముల వెనుక భద్రముగనున్నదని వినువఱకు నీమె మనసునకు శాంతిలేదు. మొదట నామె

యెచ్చటనున్నదో కనుగొనవలెను. ఎచ్చట నెట్లు జీవించుచున్నదో, అను తలంపులు జమీందారిణికి కలిగెను. మహోద్రేకమామె కిప్పుడు కలిగెను. అందువలన కలతయు నుష్ణము నధికమయ్యెను. కొన్నిగంటలలో జ్వరము తీవ్రముగ వచ్చెను. ఇప్పుడది మెదడునకు వ్యాపించి సంధిలోనికి దింపుటకు సిద్ధముగ నుండెను. మెస్టనుదొరకు కబురంపిరి. అతఁడును వచ్చి "ఈమెరోగము నాకుఁ జూడఁ జిత్రముగ నున్నది. నామందు లెల్ల నేమూల బడిపోవుచున్నవో! ఈమెకు దుఃఖమును క్లేశమును లేవని మీరనుచున్నారు. ఆమెయు నట్లే చెప్పుచున్నది. నిజముఁ జెప్పుఁడు. ఆమె కత్యంత దుఃఖకరమగు బాధలేమైన గలవా? భయోత్పాతములుకాని చిక్కులుకాని కలవా?

కృష్ణారావుగారు:—ఆమె కిట్టి తీరనివ్యాధిఁ దెచ్చిపెట్టునట్టి దుఃఖము లెవ్వియు లేవనియే నా యభిప్రాయము. ధనవిషయికములగు చిక్కులు మాకు కలవుగాని, యవి యీమె కిట్టిరోగమును కలిగించునట్టివి కావు. డాక్టరుగారూ! ఇది భయంకరముగ నున్నదనుచున్నారు, ప్రాణభయ ముండదు కదా!

మెస్టను కొంచెము సందేహించుచు, "ప్రాణభయ ముండకూడదు కాని, ప్రాణాపాయకరమగు స్థితి సంభవింపవచ్చును. ఈమెయం దిప్పుడు కలిగినమార్పు భయంకరముగ నున్నది. దాది నెవ్వరైనను నియోగించినచో బాగుండును."

కృష్ణా:—"సరియే, మీరు చేయఁగలిగినదెల్ల చేయుఁడు. వ్యయమునకు సందేహింపవలదు" అనుచు నిరువురును జమీన్దారిణి పండుకొనియున్న చోటునకుఁ బోయిరి. ఆమె శిరోజములు వీడియుండెను. కళావిహీనమైన మోమును, శల్యగతముగనున్న శరీరమును చూచుటకు జాలి కలిగించుచుండెను. అయిన నామె యొయ్యారముగనే కనుబడ ప్రయత్నించుచుండెను. ఆమె కళకాంతులకు వన్నెబెట్టునని దక్షిణాది చీరలన్న నామెకు బ్రీతి. ఏరసినమాటలు విని "దాదియా? అవును. నియోగింపుడు. దాదియుండిన బాగుండును. నాకు గొంచెము బాగుగ నుపచారములు సేయునేమో! ఆఁ! జ్ఞాపకము వచ్చినది. మీ వైద్యశాలయం దెవ్వతెయో యొక గొప్పదాదియున్నదఁట. ఆమెను బంపుఁడు, ఆమె యెవరు? అనెను.

మందార:—సుశీలమ్మ యఁట.

మెస్టను:— ఓహో! ఆమెయా! ఆమె యొక యధికారిణి. ఆమె మీకు సరిపడదు. ఆమె యొకరిమాట వినదు. తన కెంత తోచిన నంతియే!

కృష్ణా:—అయిననేమి? నిజముగ నామె నిపుణురాలే యైనచో నిది యొకలోపము కాదు.

జమీన్దా:—రమ్మనుడు ఆమెనేరమ్మనుడు. ఆమెయు నేక ప్రాణములను రక్షించెనట. వైద్యు లెల్లరికన్న నిపుణురాలట.

మెస్టను మోమును ప్రక్కకుతిప్పికొనెను. ఈమె పలుకులు విని సహింపలేక పోయెను. అయినను జమీన్దారిణి

గారి మాట కెదురు పలుక సాహసింపక "సరియే. మీచిత్తము. నేను చెప్పవలసిన దెల్ల చెప్పితిని, ఇప్పు డిచ్చుటకు రమ్మని చెప్పినచో రాదసికూడ నే నెఱుగుదును. ఆమెకు గొప్ప వారన్న భయభక్తులు లేవు. బీదలగు రోగులకే యామె యెల్లప్పు డుపచరింపు చుండును. అందువలన నిప్పు డామె యవకాశము లేదనును."

ఈపలుకులు నిజమే యయ్యెను. ఆమె తానప్పుడు ప్రాణాపాయావస్థయం దుండిన బీదరోగి యొకని కుపచరింపు చున్నాననియు, వానిని విడచి వచ్చుటకు తనకొప్పదనియు, జమీందారుకు వేయి క్షమాపణల గోరుకొనుచు గౌరవముతోడనే ప్రత్యుత్తర మిచ్చి పంపెను. ఇటు నటు బాధతో పొరలుచుండిన జమీందారిణి యీమాట విని కుపిత యయ్యెను. ఆమె తనమాట నొరులు వినకపోవుట సహింపలేదు. మందారా! నీవు తత్క్షణమే వైద్యాలయమునకు బోయి యామెను దీసికొని రమ్ము. సత్వరము.రమ్ము ఆలసింప వలదు. అనగానుందార 'వల్లె'యని మెస్తనచ్చుటజమీందారిణిని గనిపెట్టి యుండ, తాను గుఱ్ఱపుబండిలో వైద్యాలయమునకు బోయెను. ఈమె యచ్చటికి పోవుట కిదియే ప్రథమము. అచ్చటికి పోయి పేరుచెప్పకయే" జమీందారిణిగారి పరిచారికనని చెప్పి ఒకస్త్రీ తన్ను జూడవచ్చిన"దని చెప్పుడని కబురంపెను. సుశీల' పనితొందరలో నున్నాను కొంచెము వేచి యుం

డు' డని చెప్పెను. ఆమె యట్లు కూర్చుండి, " ఈ పేరుపొందిన స్త్రీ యెట్లుండునా, ఏమనునా యని వితర్కించుకొనుచుండెను. నిజముగ నీమె సుశీలమ్మను చూచి యుండకపోవు టాశ్చర్యమేకాని యామె భవనము విడిచి బయటకు పోవుటలేదు. ఒకప్పుడు తాను వీథిలో బోవుచుండగ ముందు గౌరవింపబడుచు పోవుచుండిన పొడవగు స్త్రీ విగ్రహ మెవ్వరని నామెయే సుశీలమ్మగారనిరి. ఇంకొకప్పు డీమె యొక యంగడిలోనికి బోవ నచ్చట నుండి యామె ప్రక్కద్వారమునుండి పోవుచుండెను. ఆ యంగడివాని బిడ్డకు జబ్బుచేయుటవలన జూచిపోవుచున్నదని చెప్పిరి. అందువలన సుశీలమ్మగారి మోము నంత స్పష్టముగ చూచి యుండలేదు. ఈమె యిట్లు వితర్కించుకొనుచుండ సుశీలమ్మగారే ప్రత్యక్షముగ వచ్చి నిలచిరి. ఆమె చూచుట తోడనే మందార నిశ్చేష్టురాలయ్యెను.

# ఇరువదియేడవ ప్రకరణము.



## — మందార యారాటము —

ఇంకొక పావుగంటకు మందార భవనములోనికి రోజుచుపరుగెత్తికొనివచ్చి తన యజమానురాలికి భయోద్రేకము

కలుగఁ జేయుట ప్రమాదకర మగు నను మాట మఱచి, సుందరీ-సుందరీ- ఆమె-" అని యేమో చెప్పదలచి మెస్టనుదూర గవాక్షము చెంత నిలిచి యుండుటఁ జూచి నాలుకఁ గరచి కొనెను. అతఁడును గిఱుక్కునతిరిగి చూచి ఆరోగికిట్లు ఉద్రేకము కలుగునట్లు పిలిచినందుల కాశ్చర్యముతో నామె వంక కన్ను లెఱ్ఱఁజేసి చూచెను. మందారయు కలతఁజెందిన హృదయమును మెల్లన గుదుటఁ బెట్టుకొని! "అమ్మా సుశీలమ్మగారి కారోగిని విడిచి వచ్చుటకు వీలు లేదట. రాజాలనని చెప్పినారు—" అనెను. మెస్టను తల పంకించుచు, నేను చెప్పలేదా ? ఇంకొకదాదికి గబురంపెద ననుచు వెడలి పోయెను.

మందారబొంగురు గొంతుతో 'ఆమెయే!' అనెను

జమీందారిణి.—(వెఱ్ఱిచూపుతో) "ఆఁ!ఎవరు? ఎవరి మాట?"

మందార:—ఆరాధయే - ఈసుశీల. నేనీమె నింత వఱకును చూచియుండక పోవుటవలన నెంతపుట్టెను! ఆమె నిప్పుడు చూచునప్పటికి భయాశ్చర్యములతో కేకలిడుదాన నైతిని. సందియము లేదు; ఈమె రాధయే. చాల మార్పుచెంది యున్నది. నాకే భయము కలుగ జేయునంత మార్పు చెంది యున్నది. సందియములేదు. ఆమెయే.

జమీందారిణి కెవ్వన నార్చెను. "ఆఁ! నిజమే—? నిజమే ?

మందార:—(ఈమెస్థితి విషయముగ నుంట గ్రహింపక) "నిజమే? సందియము లేదు. మొదట నేను భ్రమజెందితి ననుకొంటిని గాని, ఆరూపము - చూపు - కంఠధ్వని - సందియము లేదు రాధయే—"

జమీందారిణికి వెఱ్ఱిచూపు వచ్చెను. ఆమె తడబడుచు "అట్లైన నిన్నుచూచుట కేల వచ్చినది ?" అని పండ్లు బిగించి చూచెను.

మందార:—రా కేమిచేయును ? ఆమె నన్నెఱుఁగదు-అనిరుద్ధునితో మాటాడుచున్నప్పుడు నేను పోయినప్పు డొక్కమారు మాత్రమే యామె నన్ను చూచినది. చూచినదిగాని గమనింపలేదు. నే నామె నెఱుఁగుదు నని, గుర్తించినానని యామె యెఱుఁగదు.

జమీందారిణి మూల్గెను. తటాలున సోఫాపైనుండి లేచి చరచరనడచి గదిలోనికి వచ్చి ఒకకుర్చీలో కూలబడెను. ఆమెతీరు మందారకు భయము కలిగించెను. ఆమెను మఱలబండుకొమ్మని యెంతబ్రతిమాలినను పండుకొనదయ్యె. ఆమె-"ఆఁ! ఆమెయే ?" అని పలుమారు పలుకుచుండెను. ఒడలు కంపముఁ జెందుచుండెను. పిడికిలులు బిగించుచుండెను.

మందార:—సుందరీ! నీవు పండుకొననిచో కొంపమునుగును. మెస్ట నిచ్చుటికివచ్చి నిన్ను చూచిన మోసమువచ్చును. ఊఁ ! —

జమీందారిణి మాటాడలేదు. కన్నులు జ్యోతులవలె ప్రజ్వలించుచుండెను. ఆమె చూపునందు తెలివిలేదు. నిలుకడ లేదు. అమెకు భూమియు తనగదియు గిఱ్ఱున తిరుగుచున్నటు లుండెను. ఆమె తడబడుచు నేమేమో యనుచు తటాలున నాగి "ఆఁ! ఆఁ!! అగుము" అని వినుట నభినయించి "మందారా! వానతుంపరులు పడుచున్నవా?" అనెను.

మందార:—(యాశ్చర్యముతో) లేదు. అద్దపు తలుపులఁ దీయనా? ఆకాశము స్వచ్ఛముగ నున్నది. చూడుము.

జమీందారిణి:—వలదు వలదు. తలుపులుతీయవలదు. ఆఁ! ఆఁ!! అదుగో అదుగో — దయ్యములు లోపలికి వచ్చుచున్నవి — అని యూర్చెను.

మందార గుండియలు ఝల్లుమనెను. ముచ్చెమటలు పోసెను. 'సుందరీ, అమ్మా సుందరమ్మా' యని చెయిపట్టుకొనెను గాని, యా జ్వరపీడిత మాటాడలేదు. ఆమె వెఱ్ఱివెఱ్ఱి మాటలాడుచుండెను. ఈ వింత ప్రవర్తనము చూచి తన జిత్తుల మారితనము వీడి బేలయై మందార యేడ్చెను. ఆమె సాహాయ్యము కొఱకై యాన నలుప్రక్కలఁ జూచెను. ఆమెకు భయమును, విస్మయమును సమతూఁగ మధిక మగుచుండెను. ఆమె మఱల నొకమారు జమీందారిణికి తెలివిఁ దెచ్చుటకు ప్రయత్నించి, ఆశాభంగమునకు దుఃఖించుచు రెండుచేతులను జేర్చెను. ఒకమా రామెను లేవనెత్త యత్నించెను గాని, బలహీనయు పిన్నదియు నగుట నట్లు చేయఁజాలక దిగులుపడియెను.

ఇంతలో నీరంగస్థలమునకు మెస్టను వచ్చెను. అతఁడీ స్థితిని చూడకుండ బయట నుండునట్లు చేయుట మందారకు సాధ్యము కాదు. అందువలన నామె కేమియు తోఁచక యాతని వంక దీనముగ చూచెను. రోగి యవస్థ యిం దిట్టి ఘోరముగ మార్పు కలుగుట చూచి, మెస్టను మందార ననుమానముతో చూచెను. "ఏమిది? ఆమె యెందుల కిట్లు లేచి కూర్చున్నారు? నేను పోయిన తరువాత నామె కేదైన చెడువర్తమానము తెలిసిన దా యేమి?"

మందార తెల తెల పోవుచు, తలవాడించుచు "లేదండీ! ఏ సమాచారమును వినలేదు. అకారణముగ నాకస్మికముగ నిట్లు లేచి, నేనెంత వలదని వారించుచున్నను వినక యిట్లు కూర్చున్నారు. మాటాడుట లేదు. అసందర్భముగ నేమేమో యనుచున్నారు."

మందార కప్పుడా వైద్యునిపై చాల కోపమువచ్చెను. జమీన్దారిణి రక్త హీనములగు పెదవులనుండి వెడలుచున్న వాగ్ధోరణి నీత డూరక యేల వినవలెను? ఈకోపము శీఘ్రముగ భయముగ మారెను. ఇంకొక యరగంటలో నింకొక డాదివచ్చెను. దొరగారి యాజ్ఞవలన మందార జమీందారిణి నీస్థితిలో విడిచి బయటకుఁ బోవలసి వచ్చెను. ఆరోగి యనుచున్న మాటలెల్ల వీ రిరువురును వినెదరని మందార భయపడెను. మందార పెదవులను పిడికిలులను బిగించి

యూరక యిటునటు తిరుగాడుచు యాచుట్టుపక్కల నెవ్వరును లేకుండ చూచి, గదితలుపుల దగ్గర నిలిచి చెవియొగ్గి వినును. కాని గదిలో కత్యు యొకప్రక్క నుండుటవలన గుమ్మము దగ్గరకు ప్రలాపములు వినబడవు. ఇంక గొన్ని నిముషములకు మెట్టనుదొర యీవలకు వచ్చెను. 'అమ్మగా రెట్లున్నా'రని మందార యడుగ, కొంతశాంతముగ నున్నారని చెప్పెను. ఆరాత్రియెల్ల దాది జాగ్రత్తగ కనిపెట్టి యుపచరించు ననియు, తాను మఱునాటి యుదయముననే వచ్చెద ననియు మెట్టను చెప్పి పోయెను.

మందార మెల్లగ లోనికి బోయెను. వైద్యశాలయం దాతఁడు సుశీలపై నేరమును వ్రాసెను. వైద్యులకు దాదులు సఖ కారణములు లోబడకుండుటనుగూర్చి యుపన్యాస మిచ్చెను. కాని వైద్యశాలాలధికారుల వలన వైద్యశాల విధుల సీమ యతిక్రమింపలేదని నిర్ణయింపబడెను. చేతనున్న రోగిని విడువుమని యెచ్చట కలదు? మెట్ట నింటికి పోయి నిదురించెను. గాని తెల్లవారుఝామున మూడుగంటలకే భవనము నుండి కబురువచ్చెను. అతడును వేగముగ బోవ వీధిగుమ్మము దగ్గర కృష్ణారావుగారు నిలిచి యుండిరి. ఆయన మోము వివర్ణమై యుండెను.

కృష్ణారావు:—"ఆమెకు చాల నెక్కువగనున్నది. విషమ స్థితియని తోచుచున్నది. ఆ కేకలు వినుటకే భయముగ నున్నవి.

ఆరాటము, వేదన యధికముగ నున్నది. పిచ్చి భ్రమలు కలిగి యున్నటుల తోచుచున్నది.'' అనుచు మెస్టనును లోనికిఁ దోడ్కొనిపోయిరి. ఆమెకూత లీవంకకు గూడ వినవచ్చుచుండెను. వీరు లోనికి పోవునప్పటి స్థితి యాశ్చర్యకరముగ నుండెను. జమీన్దారిణి పడకనుండి లేచి పరియత్నించుచు చుండెను. ఈమె యున్మత్తవలె తోచుచుండెను తలవెండ్రుకలువిరియఁ బోసి యుండెను. అనుక్షణము ఒకచేతినో కాలినో విడిపించుకొని యెగిరి పడుచుండెను. ఆమె తన సవతి వైద్యాలయమున నున్నదనియు, నరకమునుండి వచ్చినదనియు పలుకుచు సుశీలనుగూర్చి దూషించుచుండెను. నారాయణరావు దయ్యమై మీదపడుచున్నట్లు కేకలిడుచుండెను.

కృష్ణారావు:—"ఈమె సుశీలమ్మగారి నిట్లేల దూషించుచున్నది? ఆమె నెఱుగదు, చూడనైన లేదుకదా!" అనిరి

మెస్టను:—"సంధిమాటల కర్థమేమి? సుశీల రాకనందుల కీమె మనసు కలత జెందినట్లున్నది" అనెను. నారాయణరావును గూర్చిన వింతమాటలు వీరి కాశ్చర్యముకలిగించెను.

కృష్ణారావు:—"ఆఁ! చనిపోవునాయేమి" అని మెస్టను చెవిలో ప్రశ్నింప, మెస్టను "అనెను. అప్పుడే యాభయములేదు. కాని యిది విషమస్థితి. మెదడున కీజ్వరము వ్యాపించినది.

కృష్ణారావు:—"అదిగో! రామారావుకూడ వచ్చినాడు, నేను పట్టణమునకు తంతి నంపనా? ఎందులకు? మీరింత

మంది యిచ్చటనున్నారుకదా!" అనుచు, రామారావును లోనికిరమ్మనిరి.

మందారజమీన్‌దారిణి దగ్గర నుండుటజూచి, మెట్ట నాకొను బయటకు పొమ్మనెను. మందార దుఃఖమునకు భయమునకు మేరలేదు. ఆమె గదిదగ్గర నిటున టూరక తిరుగుచు ఎవరైన వచ్చునప్పుడు స్తంభముల మాటున దాగుచు, అనుక్షణము నధికమగుచున్న భయోద్రేకము నడచుకొనలేక పిచ్చియెత్తిన దానివలె నుండెను. అప్పు డాగదిలోనుండి వచ్చుపిచ్చికూతలు తప్ప వేరేధ్వను లేమియు వినబడుటలేదు. ఈ దురదృష్టవంతురాలు వడకుచుండెను. తెలతెలవారుచుండెను. ఆమె కన్నులు లోతునకు బోయియుండెను. దవుడలు నొక్కుకొనిపోయెను. తా నిట్లు తహతహ జెందుచుండుటను పరులెవ్వరైనను చూచిపోవుదురని భయపడుచుండెను. మృత్యువాసన్నమయ్యెనో యని తోపఁజేయు భయంకర మగు నార్పొకటి వినబడి యప్పుడే పదునైదు నిముసములైనది. మందార తలుపు దగ్గర చెవియొగ్గి వినెను. ఇంక నామె వాగుచునే యున్నది. ఈమె మాట లితరులు గ్రహింపకుందురు గాక యని మందార వేయిదేవుళ్లకు మ్రొక్కెను. రాధాదేవినిగూర్చి తాను చెప్పిన మాటలే యిట్టి భయంకరావస్థను దెచ్చిపెట్టిన వని మందార గ్రహించెను. ఈసంగతి నామెకు చెప్పకుండగ నేల దాచనైతి నని మందార తలపోసెను గాని తానట్లు గుట్టుగ నుండలే నని

సరిపుచ్చుకొనెను. "సుందరి నాకంటె దిట్టవైన గుండెకలది. అందువలననే యెంతలెంతవైన రహస్యములగూడ గుట్టుగ నుంచును. కష్టము లేవైన వచ్చినచో నామె యే సమయోచితముగ రక్షించుచుండును కదా! నే నామెకు దీనిని చెప్పియుండనిచో నన్నామె చంపివేసి యుండును. పాపము పడిపోయినది? ఇప్పుడు నేనేమి చేయుదును? ఒకటి తోచుచున్నది. రాధయిచ్చట నున్నదని వినుటవలననే కదా యీమెకు సంధియెత్తినది? ఎట్లో సమయము కనిపెట్టి రాధ పారిపోయినదని చెప్పెదను. ఇదియే దీనికి మందు. ఇదియుగాక నీ ప్రయత్నము వలన కొన్ని కష్టములు కలిగినను ఇట్లు రహస్యము లెల్ల వెడల గ్రక్కబడుచుంటకన్న మంచదికాదా?" యని తల పోసెను.

మెస్తను బయటకు వచ్చెను. అతనికి మందారపై నను మానమును కోపమును తగ్గలేదు. మందార 'అమ్మగా రెట్లున్నా' రనగ నతడు నిర్లక్ష్యముగ పోబోవ, "అయ్యా! సుశీలమ్మగారు మీ వైద్యశాల విడిచిపోయినగాని మా యమ్మగారి రోగము కుదురదు." అనెను మెస్త నామెను తీవ్రముగ చూచి నీకునుబిచ్చి యెత్తినదా?" అనెను.

మందార:—"అయ్యా, నిజము చెప్పుచున్నాను వినుడు. జమీందారుగారి ప్రథమభార్య కారగారమునుండి విముక్తురాలైనది. ఇది మాయమ్మగారికి తెలిసినది. ఇంతియకాదు

ఆమెయే సుశీల యను పేరిట మీా వైద్యశాలలో పనిచేయు చున్నది. ఇది మా యమ్మగారికి రోగము దెచ్చినది."

మెస్త నవనమ్మకముతో "అబద్దము—" అనెను.

మందార "కాదు, కాదు. చూడుడు." అని కొన్ని పోలికలను చూపి, ఇవి శకుంతలమ్మ యందు కనబడుట లేదా? ఆమె చేతులు మోటుబారి ఉపచారము వలన గాక కఠిన వరకము వలన నిట్టినవని మీాకు తోచుట లేదా? ఆమె పుట్టు పూర్వోత్తరములు మీా కెన్నడైన చెప్పినదా? ఆమె యీా భవనము చెంతకు రెండు మూడు మారులు రహస్యముగ వచ్చి యుండెను. ఇట్లేల రావలెను? నిశ్చయముగ నామె విడుదల బొందిన రాధాదేవియే."

మెస్తనుకు నమ్మకము కలిగెను. ఆశ్చర్య పడెను. కొన్ని క్షణములవరకు నిర్ఘాంతపడి యుండెను. ఇట్లు సుశీలపై తనకు గల పగ దీర్చికొనగలుగు నుపాయము దొరకుటకు సంతసించెను. 'ఆమెసంగతి యింతకాలము దాగియుండు టాశ్చర్యకరము! ఇక వెడలగొట్టించెదను. తన వైద్యశాస్త్రానుభవ గర్వముతో నన్నవమాన పరచిన తుచ్ఛురాలికి కిట్టి శిక్ష చేయవలసినదే!' 'యని యనుకొనెను. రాధాదేవియే సుశీల యని వినినంతనే అందర కాశ్చర్యము కలిగెను. కారాగారము నుండి వచ్చిన స్త్రీ వైద్యాలయోద్యోగినిగ నుండరా దనిరి. శివరామయ్యగారి మాట నెవ్వరు వినకైరి. ఆమెయు రాజీనామా నిచ్చెను. ఆమెకు రావలసిన జీతము నప్పుడే యిచ్చిరి. అంతట నీమె లోకమున మరల నిరాధారయయ్యెను.

# ఇరువది యెనిమిదవ ప్రకరణము

## —♦ కష్టసుఖములు ♦—

జమీందారిణికి రోగము కుదిరినది. అన్నప్పగారా మెను తన వ్యవహారమును పరిష్కరింపు డని తొందర చేయ సాగిరి. అయినను కృష్ణారావుగా రందుల కంగీకరింపమని నీమె సాకులు చెప్పుచుండెను. శకుంతల యీదినము జమీందారిణి దగ్గర నుండగ నీతఁడు వచ్చెను. జమీందారిణి అన్నప్పను తనకొక రెండువందలను బహుమీయుమని యడిగెను. అన్నప్ప కోపముతో "ఇదివఱ కిచ్చినవి చాలును లెండు. నాదగ్గర నివ్వడు రొక్కములేదు. పాపయ్యను రమ్మంటిని, బయలుదేరి వచ్చుచున్నాడు. జాగ్రత్త" యని చెప్పి వెడలిపోయెను.

శకుంతల యీకలహమును చూచి భయపడెను. ఆమెకీ సంభాషణమున కొంతమాత్రమే తెలిసెను. జమీందారిణి శకుంతల ననుమానముతో చూచుచు, "ఇక నొకపక్షములో అన్నప్పగారిని నీవు పెండ్లాడవలసి యుండును గాన సిద్ధముగ నుండుము." అనఁగా శకుంతల మాటాడక, మోముఁ ద్రిప్పుకొని కంటఁ దడిపెట్టుకొని యెట్టకేలకు ధైర్యముఁ దెచ్చుకొని "నే నాయనను పెండ్లిచేసికొనను" అనెను.

జమీందారిణియు (విరసముగ నవ్వి పోడుచుచు) "ఏల? అతని కేమి తక్కువ? పెళ్లిచేసికొను మన్నప్పుడు మొదట ననేక

లిట్లే చెప్పుచుండురు. తరువాత బాగుగనే కాపురము చేయు దురు. నీ వీతనిని పెండ్లియాడక తీరదు. ఇదియుఁగాక నీ కేమి యతిశయము? ఒకవాంతకురాలి కొమరిత స్వయంవర మపే క్షించుట చాల వింతగనున్నది.'' అని పలికెను.

శకుంతల మాటాడలేదు. తత్క్షణమే యామె నచ్చట విడిచిపోయెను. జమీందారిణి మందారను బిలిచి "చూచితివా అన్నప్ప కొంపతీసినాడు. అతనిని రమ్మని వ్రాసినాఁడట; వచ్చు టకు ధనమంపినాడో లేదో? పంపలేదనుకొందును. పంపనిచో నదృష్టవంతులమే. అతని నచ్చటనే తృప్తిపరచి యుంచుటకు మనమెట్లయిన ధన మంపవలెను. పెండ్లియగుటకు ముందన్నప్ప దక్షిణ్యకైన నీయఁడు. ఆ పాచికనువేసి యోడిపోయితిని. అతఁ డుగ్రుడైనాడు. నేను సరిగ పనిచేయుట లేదని కోపగించి నాఁడు. అందువలన నింక పెండ్లిప్రయత్న మాలసింపరాదు నేను బ్రదికియుండినచో నిది పదునైదుదినములలో జరుపుటకు యావచ్ఛక్తిని వినియోగించెదను. ఇంక నొకటికలదు" అని యుద్రేకమ్ముజెందెను.

మందార:—ఏమది?

జమీందారిణి:—"ఆమెను మఱల కారాగారమున ద్రోయవలెను. ఈరెండు కార్యములు సఫలములైనచో నాకు శాంతికలుగును. అందాక శాంతిలేదు. కాని, యీలోపున నతఁ డే వచ్చినచో!" జమీందారిణి గజగజ వడఁకెను.

మందార:—సుందరీ! నీ పుణ్యముగాని, దానినిగూర్చి పదేపదే తలంపకుము. నీరోగము మఱల తిరుగబెట్టినచో నిఁక మనకు సర్వనాశనమే. అతఁడువచ్చిన నేమగునో, నీకు సంధి యెత్తినసదియే యగును. మఱియు నీపెండ్లి ప్రయత్నములు నీప్రమూలపడిన జరుగనేరవు.

జమీన్దారిణి:—(నిట్టూర్పు విడిచి) "అతని, కంపుట కెల్లెననుఅన్నప్పను సొమ్ము అడుగవలెను. తాకట్టుపెట్టుటకునగలైననులేవు. నవరత్నములవిమూతప్రము మిగిలినవి. వీని నీ యూర తాకట్టు పెట్టిన మోసము వచ్చును. పట్టణమునకు బోవలసియుండును. ఇప్పుడు నేనట్లు పోవుట శ్రేయస్కరము కాదు. నే నారోగ్యముగ నుండినచో శకుంతల కిక్కడ దొరకని వస్తువుల దెత్తునను నెపమున బోయియుందును."

మందార:—అతఁడు మఱల వచ్చుచో కొంప మునుగదా ?

జమీన్దారిణి:— (నిట్టూర్పు నూర్చి) "అతనికి సొమ్మునంపుటకు నేనెన్ని యిడుమల బడుచున్నానో!,.ఎంత గడ్డి దినుచున్నానో దేవుని కెఱుక" అనెను.

మందార దీర్ఘాలోచనముతో, "సుందరీ! ఆనాఁడతనికి బంపిన రూప్యములు నీకెట్లు వచ్చినవి? ఆపాండీపై దొంగ చేవ్రాలు చేసినది నీవేనా? అప్పటినుండియు నే ననుమానించుచునే యున్నాను. అన్నప్ప యిచ్చినాడని నీవన్నమాట

నమ్ముటకు వీలులేదు. ఆదినమే మీరు కలహించిరి. ఆఁ! నీవేనా?"

జమీందారిణి:—"అవును. ఏమి చేయుమనియెదవు? నప్పుడట్లు చేయనిచో మనగతి యేమైయుండును? నారాయణరావుకు పెండ్లి నిశ్చయమగుట విని, అన్నప్ప మండిపడెను. నేనేమి చేతును, దైవమాయని యుంటిని. అంత నారాయణరావుతో మాటాడబోవగ, నాతని గదియందు హుండీల పుస్తకము నాకంటబడగ నేనొక కాగితము జింపుకొనివచ్చితిని. అతని చేవ్రాలాతఁ డిదివరకు వ్రాసియుండిన లేఖనుండి గ్రహించి యనుకరించితిని. అతని యలవాటు నే నెఱిగి యుండుటవలన నా హుండీ కాగితమును రామస్వామి కిమ్మని నీతో చెప్పితిని."

ఈమాటవిని మందార యదరిపడెను. "ఆఁ! నారాయణరావుగా రిమ్మన్నారని యాతని కిమ్మనిన 'కవరు'లో దీని నుంచితివా!"

జమీందారిణి:—(మందహాసముతో) "అవును, అందువలననే నిన్ను జాగ్రత్తగ మారువేషము వేసికొని పొమ్మంటిని. దైవానుగ్రహమువలన నెల్ల బాగుగ నెరవేరినది. సంతపేటలో నిన్నెఱిగిన వా రెవ్వరును లేరు. నీవునన్నించుక పోలియున్నను అప్పటి వేషభాషలను గూర్చిన వర్ణనము ప్రతి స్త్రీకిని చెల్లును. చమత్కారముగ నున్నదా? నారాయణ

రావు అప్పుడు రహస్యముగ వచ్చిన అనిరుద్ధు ననుమానిం
చుట న్యాయమే కాని యిదియిట్లు పరిణమించు నని నేనప్పుడు
తలంపలేదు. ధనము కొఱకు మన మెంతటి సాహసకృత్యము
నైన జేయవలసి యుండును. అతనికి ధనమంపుట మనకు
ముఖ్యము. మన మానము ప్రాణముగూడ దానిపై నాధార
పడియుండ, మన నమ్మకొనినట్టియున వానికి ధనమంపవలసి
యుండుట నిజమేకదా; ఏమి చేయుమనియెదవు."

మందార భుజము లెగురవైచుచు "అవును, అతనికి
సంతత ధారాపాతముగ ధనము గురిపింపవలసి యుండుటవలన
నీవిన్ని బాధలు పడుచున్నావు. ఇప్పుడుకూడ అన్నప్ప మూర్ఖ
ముగ ధనమియ్యనిచో కర్తవ్యమేమి?

జమీందారిణి:—ఎట్లో వానిదగ్గరనుండి సంపాదింప
వలెను. ఇచ్చునట్లు చేయవలెను. నేనిప్పుడు వాని దగ్గరకు
పోవలెను. ఆకాశము తెరపిగనున్నదా! జల్లుపడుట లేదు
గదా!

మందార యాశ్చర్యపడెను. జమీందారిణి యిట్లు
నిమిషనిమిషమును తత్తరముతో ప్రశ్నించుచుండుట కామె
భయపడెను. జమీందారిణి యారోగ్యము పూర్తిగ చెడినది.
అందువలననే ఇంత గుండె దడయని మందార యనుకొనెను.

వీరిరువురు నన్నప్పగారు రాత్రిణమున నేమి యోజించు
చుండిరో యెఱిగినచో నిర్ఘాంతపడి యుందురు. ఆయన

యిప్పుడు మందారను గూర్చి తలంచుచుండిరి. ఆయన మఱల వీరిరువురకు నొక్కచోట నుండగ పోలిక చూచి ఆశ్చర్యపడిరి. ఇది భ్రమయే మోయని వితర్కించిరి. ఇది కాకతాళీయన్యాయమే మోయని తలచిరి. మఱియు, జెలికత్తెలు తమ యజమానురాండ్రను రూపమున వేషమున భాషల ననుకరించుట సహజము గనుక, నొకవిధమగు పోలిక కనబడుచున్న దనుకొనిరి. అయిననేలొకో ఆయన పలుమరు ఈపోలికను గూర్చి తలంచుచుండిరి. దీనికేదో అర్థముండకపోదని తోచుచుండెను. కృష్ణారావుగారి యలక్ష్యము, అనాదరణము, జమీందారిణి అసహాయ్య దశయు తొందరం జెందుచున్న అన్నప్పగారికి చాల నాశాభంగము గలిగించెను. ఆయనకు జమీందారిణిపై సత్యంతాగ్రహము కలిగెను. అందువలన నామెను భయపెట్టి తన కార్యము సాధించుటకొఱకు పాపయ్య నిచ్చుటకు రప్పించుట ముఖ్యమని యెంచి ఆ వింతపురుషుని కిట్లు తంతి నంపెను

"తక్షణమే బయలుదేరి రమ్ము. సందర్భములు నీకనుకూలముగ నున్నవి. నీకై యెదురుచూచుచున్నాను.

—నీ. సుందరమ్మ అనుమతిని, అన్నప్ప."

నారాయణరావుహత్యను గూర్చిన నేరమునుగూర్చి యింకను పోలీసు విచారణ ముగియలేదు. శివరామయ్యగారి సహాయమున యెచ్చట నెప్పుడు హాజరు కమ్మన్న నప్పుడచ్చట హాజరగునట్లు అనిరుద్ధుని వలన పూచీకత్తును పుచ్చు

కొని యితర పెద్దమనుష్యు లిరువురవలన జామీనుకూడ పుచ్చుకొని అతనిని వదలి యుండిరి.

సుశీల వైద్యశాల వదలిపోవుచుండగ ననిరుద్ధుఁ డామె యసహాయ్యురాలైనదని దుఃఖించి, యామెతో చెన్నపురికిపోయి యామె కొకవసతి నేర్పరచి, యింట శకుంతల యేమి బాధ లనుభవించుచున్నదో యని యాతఁడు మఱలివచ్చెను. తల్లిని గూర్చిన చింత, చెల్లెలిని గూర్చిన భయము, తనపైనేరమును గూర్చిన చింతయు ననిరుద్ధుని బాధించుచుండెను. జమీందారిణి అన్నప్పతో గుసగుస లాడుచుండుటయు అన్నప్ప కోపముతో గర్జించుచుండుటయుఁ జూచి అన్నప్పకు శకుంతలను బలవంతముగ జమీందారిణి పెండ్లిచేయు నేమో యని అనిరుద్ధునకు భయముకలిగెను. అంతట నీతఁడు శకుంతలకీ సంగతు లెల్ల చెప్పివైచి, యామెను చెన్నపురికి తమ తల్లిదగ్గరకు రమ్మని బలవంతము చేయసాగెను.

శకుంతల:—'అన్నప్పను బెండ్లాడనిచో మన జమీందారి నతఁడు వశము చేసికొనునట. ఇట్టి దురవస్థ నాయనగారికి కలుగుటకంటె నే నాతనిని బెండ్లియాడిననే మంచిదని తోచుచున్నది' — అని తలవంచుకొనెను.

అనిరుద్ధుఁడు:—'శకుంతలా! నీలపురపువారి యాడుపడుచు నమ్ముకొని యాపదువుకూడు భుజించుటకన్న మేముబిచ్చమెత్తుకొని తిరుగుట మేలు. నాకీ జమీందారి వలదు. నీవు

నేను చెప్పినట్లు విననిచో అన్నప్పను జంపి నేను పెన్నలా పడెదను.'

శకుంతల యెట్టకేలకు చెన్నపురికిఁ బోవుట కంగీకరించెను. వారా రాత్రియే రైలుబండినెక్కి చెన్నపురికి పోయిరి. శకుంతలకు మార్గమధ్యమున తనతల్లి యుదంతమునెల్ల చెప్పుచు అనిరుద్ధుఁ డామె గుణములను కీర్తించుచుండెను. వీరు చెన్నపురిలో బసలోనికి పోవగ నందెవ్వరును లేరైరి. ఇంటివారి నడుగగా నాముదుసలి యామె శిక్షిత యనియు నామె తానచ్చట నున్నట్లు పోలీసువారికి చెప్పకొనవలసి యుండియు, నట్లు చేయ నందున నామెను మఱల కారాగారమున నుంచిరనియు చెప్పిరి. అనిరుద్ధునికిని శకుంతలకును విషాదమును దుఃఖమును కలిగెను.

---

## ఇరువది తొమ్మిదవ ప్రకరణము.

—♦ పాపము బ్రిద్దలగును ♦—

శకుంతల ననిరుద్ధుఁడు తీసికొనిపోయె నని అన్నప్పగారు విని మండిపడిరి. ఇక నాలసించిన లాభములేదని జమీందారు గారిని 'ధనమిచ్చెదరా ? శకుంతలనైన తీసికొనివచ్చి నాకు పెండ్లిచేయుదురా, లేక ఇల్లువిడలి పోయెదరా ?' యని నిర్భ

యముగ నడిగిరి. 'కావలసినచో నాలుగు నెలలవరకు నెల కేబది రూపాయి లిచ్చుచుందును. నాలుగు దినములలో మీ రొక యద్దెయింటికి పోవలెను. లేనిచో, వ్యాజ్యము దాఖలుచేసి ఆస్తి స్వాధీనపరచుకొనెద' ననియు ననిరి. జమీందారుగారు వ్యాజ్యము లేల యని భవనము విడిచి యద్దెయింటికి పోయిరి. అన్నప్పగారి చర్యచూచి జనులు నిందించిరి. జమీందారిణి పాపయ్యకు ధన మంపవలసి యుండెను. ఆమెకు శకుంతలపై నెంతో కోపమువచ్చెనుగాని, ఏమిచేయగలదు? ఆమె చేతఁ గాసైన లేదు. సేవకులు, వస్తువులు భవనములెల్ల అన్నప్పగారి వశమైనవి. కొన్నాళ్లవరకును అన్నప్పగా రిచ్చెదమని వాగ్దానముచేసిన మనువర్తియందు కొంతభాగమైనను ముందుగ చేతఁబడిన బాగుండు నని యామె తన ప్రియపరిచారికను వెంట బెట్టుకొని, అన్నప్పగారి కార్యాలయమునకుఁ బోయెను. అన్నప్పగారును లేరు. పెద్దగుమాస్తా వెంకన్నగారును లేరు. ఇప్పుడు పాయగిరివుఁ డచ్చట కూర్చుండియుండెను. అతని కీమెకు ధన మీయ నధికారము లేదు. అందువలన 'నన్నప్పగారు వచ్చెదరు కూర్చుండుఁ'డని చెప్పెను.

మందార:—'ఉందమా? పోవుదమా?'

జమీం:—ఉండవలెను. లేనిచో మనయవసర మెట్లు తీరును? అతనికి ధన మంపనిచో కొంపదీయును. ఈ మన్ను వర్తి రాళ్లలో తరుగును గూర్చి యీయన కేమిచెప్పవలెనో తెలియకున్నది.'

హాయగ్రీవుడు:— వీరు రహస్యము లాడుకొనుచుండ తనపని జూచుకొనుచు 'అమ్మా! మీ రీ ప్రక్క గదిలో కూర్చుండుఁ' డని చెప్పెను. అంతలో నొక తంతివార్త నొకడు 'అన్నపూర్ణగారు చూచికొని జమీందారిణీ గారి' కని యిచ్చెను. హాయగ్రీవు డాశ్చర్యముతో దానిని దీసికొనిపోయి జమీందారిణీ గారి కిచ్చెను. ఇరువురును నిశ్చేష్టులై కొంత సందియముతో హాయగ్రీవుని జదువుమనిరి.

'చెన్నపట్టణము తిరిగివచ్చితిని. రేపు ప్రొద్దున బయలుదేరి వచ్చుచున్నాను. —పాపయ్య.'

ఇదివిని జమీందారిణి అయ్యోయని నిర్ఘాంతపడెను. వడకెను. మందార నిశ్చేష్టురాలయ్యెను. ఇంతలో జమీందారిణి తెలివి తెచ్చుకొని యా కాగితమును బుచ్చుకొనెను. వీరి విపరీతవర్తనము జూచి హాయగ్రీవు డాశ్చర్యపడెను. కాని అచ్చట నిలుచుట మర్యాద కాదని పోఁ బోవుచుండగ మఱలనొక్క మారు 'అయ్యో' యని జమీందారిణి మూర్ఛిల్లెను. అంతట కొంచెము చన్నీటిని ముఖమున జల్లగ నామెకు స్మృతి వచ్చెను. ఈ తంతివార్త యీమె కింతటి భయమేల కలిగించెనా యని హాయగ్రీవు డాశ్చర్యపడెను. అంతట నతనికి వీరి రహస్యము కనుగొన గుతూహల మయ్యెను. అతడు తలుపువెనుక నిలిచి వీరిమాటలు వినసాగెను.

మందార:—"సుందరీ, నీ వింత యధైర్య పడినచో నెట్లు? ఏదో యుపాయము చూడవలెగాని, వాని కేదైననిచ్చి పాగ నంపుదము —" అనెను.

జమీందారిణి నిట్టూర్పునూర్చి "ఇచ్చుటకు గాసైన లేదు. ఏమి చేయను? ఇంతకు నీయన్నప్ప కొంపముంచినాడు, వచ్చినతరువాత వానినోరు మూయగలమా?"

మందార:— "కొంపముంచి రహస్యము బయ ల్పడను గదా? అతని కైదైన దావ్రివచ్చినచో అన్ని సంగతులు చెప్పి వేయును." అనెను. ఇంతలో వెంకన్నగారి సాక్ష్యమువలన అన్నప్పగారి జమీందారి తనఖా కోర్టులో నమ్మబడలేదని విని దాని నిజానిజములను గూర్చి యడుగుటకు శివరామయ్య గారే యచ్చటికి వచ్చిరి. ఆయనను చడీచప్పుడు చేయవల దని హాయగ్రీవుడు సౌజ్ఞ చేసెను. వా రిరువురును తక్కిన సంభాషణమువినిరి.

జమీందారిణి—"అబ్బా నాకేమియు తోచుటలేదు. ఎక్కడికైనను పోవుద మన్నను చేత గాసైన లేదు. అతడు కొంప ముంచివేయును. అన్నప్ప యెంత దుర్మార్గము చేసి నాడు!—" అనెను.

మందార—"అతఁ డన్నప్పకు తంతి నిచ్చుట చూడగా వీ రేదో కుట్రచేసినా రేమో యని అనుమానముగా నున్నది. అతడు రాజసాక్షిగ దిరిగిపోవునేమో సుమీ! అన్నప్ప యిచ్చుదానిలో సగము నాకు పారవేయుము. నాదారి నేను చూచుకొనెదను. బ్రదికియున్న బలుసాకు తినవచ్చును. ఆశివ

రామయ్యగారు రాధాదేవిని విడిపించుటకు ఆమె నిర్దోషియని స్థాపించుటకు విశ్వప్రయత్నములు చేయుచున్నాఁడట. ఇతఁడా యనచేతులలో బడెనా, ఇక మన కురి తప్పదు. అని మందార యనెను.

జమీందారిణి నిటూర్పునూర్చి హయగ్రీవుఁడుగారిని బండి చూడమను పోద మనెను. శివరామయ్యగారు వారు పోయినపిదప హయగ్రీవుని వలన తంతిసంగతి తెలిసికొని, వీ రీయూరు దాటిపోకుండ రేపటి సాయంత్రమువరకు నీవు కనిపెట్టి యుండవలయు నని చెప్పి వెడలిపోయిరి.

---

## ముప్పదియవ ప్రకరణము.

### అపరాధపరిశోధనము.

"సందేహములేదు. వీరి కా హత్యతో సంబంధము గలదు. ఎవరు చేసిరోగాని వీరిలో నొకరు చేసి రనుట నిశ్చయము. ఆలోచించిన కొలఁది జమీందారిణికిని పాపయ్యకును శ్రీ రామారావుగారి హత్యతో సంబంధము కలదని స్పష్టపడు చున్నది. జమీందారిణి రోగమున పలికిన సంధిప్రలాపముల కర్థమిప్పుడు తెలిసినది. ఆనాడు రాధాదేవి యుద్యానవనమున

జూచినవారు వీరిలో సాక్షు రనుటకు సందియము లేదు. కాని హత్యచేసినవారిని నిరూపించి పై నేరము స్థాపించుటకు నిదర్శనములు దొరకువరకును వీరి నరెస్టు చేయుటకు వీలులేదు. పాపయ్యను రేపు కలిసికొని వానివలననే రహస్యమెల్ల బయల్పరచవలెను." అని శివరామయ్యగారు నిశ్చయించిరి. అన్నప్పగారారాత్రి చెన్నపురి వెళ్ళుచున్నా రనియు, మరునాటి సాయంత్రమువరకు నింటికిరారనియు హాయగ్రీవునివల్ల శివరామయ్యగారు తెలిసికొనినందున పాపయ్యను అన్నప్పగారి కార్యస్థానమునకే తాము తీసికొని రాదలచిరి. వీరాస్వామి యను పోలీసు జవానును బిలిచి శివరామయ్యగారు వానితో 'ఓయీ నీవు రేపు మధ్యాహ్నము 12½ వరకును అన్నప్పగారి వీధి గది గవాక్షము చెంత నిటునటు పహారా నివ్వవలె' ననగా నతఁడు చిత్తమనెను. ఈయేర్పాట్లు గావించుకొని మరునాటి మధ్యాహ్నము 10½గంటలకు భోజనాదికములు నిర్వర్తించి శివరామయ్యగారు రైలు స్టేషనుకు పోయిరి. అనుకొనినటులనే బండి సకాలమునకువచ్చి నిలచెను. శివరామయ్యగారు పాపయ్య నెట్లు గుర్తింప వలెనాయని యిటునటు చూచిరి. బండి దిగినవారిని పరీక్షింప నొక మందు్రి రైతులు, పదిమంది కోమట్లు, కొంతమంది బ్రాహ్మణులు, ఆర్గురు మహమ్మదీయులు, నల్గు రరవవారు నుండిరి. ఒకఁడు మాత్రము గ్లాస్గోబట్ట కట్టుకొని దిద్దికొనిన తలకట్టును. మీసములును, ఆకు పచ్చరంగు ఫ్లానల్ కోటును, వేసికొని

దూరపర్యాణము చేసినవాఁడని తెలుపు ధూళితో, ఎఱ్ఱని కన్నులతో నిటునటు చూచుచుండెను. అతడు తెల్లపోవు చుంటను చూచి శివరామయ్యగారు మెల్లన దగ్గరకుపోయి "అయ్యా! తమరేనా పాపయ్యగారు? "అని దక్షిణహిందూదేశ రైలుసంఘువారి గుఱ్ఱుగల లగేజిచీట్లు పెట్టెలమీఁద నంటింప బడియుండఁగ చూచుచు పలికిరి. ఆవింతపురుషుఁ డాశ్చర్య ముతో కనుబొమలె త్తి "ఔను నేనే! అన్నప్పగారు పంపి నారా ఏమి?"

శివరామయ్యగారు "అవును మిమ్ము వెంటబెట్టుకొని పోవుటకు వచ్చినాను.

పాపయ్య:—"అన్నప్పగారు చాల మంచివాఁ డండీ. మీ రాయన భాగస్థులు కాబోలు. నన్నుగూర్చి యెట్లు విని నాఁడో! జమీందారిణిరెమె చెప్పియుండునులెండు. అయితే న న్నెందుల కిచ్చుటికి రప్పించినారో మీ రెఱుగుదురా?"

ఈప్రశ్న కప్పుడు శివరామయ్యగారు ప్రత్యుత్తర మిచ్చినచో కొంపములుగును. ఆదుర్మార్గుఁడు మోసము దెలిసి కొనును. అందువలన గూఢముగ "మీకే తెలియును. తిన బోవుచు రుచు లడుగనేల" యని మందహాసముఁజేసి యావింత మానిసిని పరీక్షించిచూచిరి. పాపయ్యగారికి నలుబదియైదు వత్సరము లుండవచ్చును. అతడు సాధారణపు మానిసివలె నుండెను. దృఢకాయుఁడే కాని అతనికన్నులు పచ్చగనుండెను.

అతనికన్నులును ముఖమును ఘాటుగల పాశ్చాత్య సారాయ ములకలవాటు పడినవాఁడనియు, రాత్రులు నిద్రపోవని వాఁడనియు తెలియఁజేయుచుండెను. ఈతనిచూపు చంచలమై దుర్మార్గుఁడని తెలుపుచుండెను. మొత్తముమీద నీతఁడు నమ్మదగిన మనుజునివలె కనబడుటలేదు. ఈతడు రక్షకభటుల బారి నుండి ఇంతకాల మెట్లు తప్పించుకొని తిరుగగల్గెనా యని శివరామయ్యగా రాశ్చర్యము జెందిరి. పాపయ్య మఱల విశేష ము లేమని బ్రశ్నించెను కాని, వీరు అన్నప్పగారి కార్యస్థానమున వసారగదిలో క్షేమముగ బ్రవేశించు దనుక ఆయన మాటలాడలేదు. ఆ వసారగది కొకటే తలుపు. దానికెదురుగ కిటికీ గలదు. అందే మన జమీందారిణి నిన్న కూర్చుండియుండెను. వీరా గదిలోనికి పోయినతరువాత పాపయ్యగారిని కుర్చీలో కూర్చుండబెట్టి శివరామయ్యగారు తలుపువేసి దాని కడ్డముగ కూర్చుండిరి. తరువాత తమయుద్ధమును ప్రారంభించిరి.

శివ:— "అయ్యా పాపయ్యగారూ, ఇక లాభము లేదు. ఆ స్త్రీలు ఒప్పుకొనినారు. మీరే దుర్మార్గుఁడనుచున్నారు."

ఇది యొక గంతు, ధైర్యముతో చేసిన ఆరోపణము. ఇట్లొక మనుజునిపైన నేరము నారోపించుట కితని కేయధికారమును లేదు. అయినను శివరామయ్యగారు దండవిధాయిగ చిరకాలము పనిచేసి పోలీసు పద్ధతుల నెఱిగిన వారగుట నిట్లుపలికిరి. పాపయ్య మొదట నిశ్చేష్టుఁడయ్యెను గాని తటా

లునలేచి "ఆఁ! ఏమిది? ఏమి లాభము లేదు? ఏమి యొవ్వా కొనినారు? అన్నప్పగా రెచ్చుటనున్నారు. మీ రెవ్వరు?" అని గంభీరముగ పలికెను. అతఁడు గర్జించుచు "నీవు నన్నిచ్చట కేల తీసికొని వచ్చితివి? అక్రమ నిర్బంధమునకు నీపై యభి యోగము తెచ్చెద జాగ్రత్త" యని యరచెను.

శివ:—"ఆఁ! కొంచెము శాంతింపుడు. నేనీయూరి దండ విధాయిని నిన్నరెస్టు చేసెదను" అనుచు జేబులో నెడమచేతి నుంచి సంకెలలు గలగల లాడించిరి. ఇట్టి చిరపరిచిత మగు ధ్వని వినుటతోడనె పాపయ్యగారు దిగులుజెందిరి. కాని యా గదినుండి యాకస్మికముగ తప్పించుకొనుటకు వీలు కలదేమో యని యిటునటు చూచిరి. ఎట్టయెదుటనె బంధించిన తలుపున కడ్డముగ కూర్చుండిన శివరామయ్యగారు మందహాసముతో గవాక్షమువంకకు చూచిరి. ఆ చూపు చూచి పాపయ్యయు నావైపు చూడ నచ్చట వీరాస్వామి యొక్కటోపీతో యిటునటు పహారా నిచ్చుచుండెను. పాపయ్య యదరిపడెను. మోము వెలవెలవైచెను.

శివ:—"అయ్యా మీరు వృథగ నుద్రేకము పొంద కుడు. అందువలన లాభములేదు. ఆస్త్రీలు సత్యమును చెప్పి వైచినారు. దానిఫలము మీరనుభవింప సిద్ధముగ నుండుడు.

పాపయ్య:—ఆఁ! ఆ!! ఫలము నే ననుభవింప వలెనా? నాపైన నేరము మోపినారా? దుర్మార్గురాలు అసత్యమాడు చున్నది. ఆమెయే, ఆసుందరియే, చేసినదని మీ రెఱుఁగరా?

శివరామయ్యగారతనిని జూచి "నిజముగ నీవు నిర్దోషి వేని, శిక్షపొందుట కిష్టపడ్డవేని, నా సలహా విని, ఇప్పుడే ఇచ్చుటను రాజకీయ సాక్షివై లిఖితపూర్వకమగు వాఙ్మూలమును తక్షణము సాక్షిమ్ము. ఇట్లు చేయుదువేని వారే యిట్లుచేసి నీపైని నేరము స్థాపించి సుఖముగ నుందురు," అని పలికిరి.

పాపయ్య:—విషాదముతో "అయితే ఇందులకా నన్ను పిలిపించినది? ఇవియా; అనుకూలములగు సందర్భములు? నే నెన్న డిట్లగు ననుకొనలేదు. జమీందారిణియె నన్నిట్లు మోసపుచ్చినదిగా! సరియె అనుభవించును గాక. నా కసి తీర్చుకొనెదను. నేను రాజసాక్షిగ తిరిగి పోయెదను. కాగితమును గలము నిండు అనెను. శివరామయ్యగారందిచ్చిరి.

పాపయ్య నేరమును గూర్చిన రిపోర్టు వ్రాసియిచ్చెను. శివరామయ్యగారు దాని నాశ్చర్యముతో జదివి యాతనిని కలెక్టరు గారిదగ్గరకు తీసికొని వెళ్ళిరి. వాడచ్చట నేరమును గూర్చిన సత్యమునెల్ల చెప్పివేసెను.

ఇంతలో నీ పురుషుడూరిలోనికి వచ్చిన సంగతి యెట్లో జమీందారిణికి తెలియవచ్చెను. అయినను పారిపోవుటకు తన కత్యంతావశ్యకమగు ధనము తనకడ లేదు. అన్నప్పగారీయూరైరి. హయగ్రీవుని నేర్పువలన వీరికన్నప్పగారు కనబడనే లేదు. జమీందారిణి తన దగ్గర నేమియు లేదని నిన్న హయగ్రీవునికడ మొర

ట్టుకొనినను ఆమెకడ రెండు అయిదురూపాయలనోటు లుండెను ఈ మొత్తము తనను తన పరిచారికను చెన్నపట్టణమునకు గొని పోవును. తరువాత మరునాటినుండి భిక్షాటనమే కర్తవ్యము. ఈమె యొడలి నున్న వజ్రపు నగలును అన్నప్ప యింకను చూచి సంగ్రహింపలేదు. వానినిప్పుడు తీసికొని పోవచ్చును. దేశాంతరము పోవునప్పుడు కృష్ణారావుగారికి భయపడనేల ? ఈ తలంపుతో జమీందారిణి తన ప్రియపరిచారిక సాహాయ్యమున విలువగల వస్తువులను కాగితములను, వస్త్రము లను కలిపి యొక చిన్నమూటగ సిద్ధముచేసి పనిమీద జిన్న ప్రయాణము చేయుబోవు వారివలె వీరిరువురును నచ్చి గుఱ్ఱపు బండిలో నెక్కిరి. అప్పుడు జమీందారిణి మోమున భయో ద్రేకమున గలిగిన మార్పు స్పష్టముగ కనబడుచుండెను. ఆమె కాళ్ళు తడబడుచుండెను. ఆమె తనయాలోచనమున నిమగ్నయై బండివాఁ డొంటరిగ నుండలేదని గ్రహింపలేకపోయెను.

జమీందారిణి బండివానితో రైలుస్టేషనుకు దోలుమని చెప్పియుండెను. గుఱ్ఱపుబండి బయలుదేరి పదునైదు నిమిషము లైనపిదప నాగెను. జమీందారిణి యాశ్చర్యపడెను. బండి తలుపుదీసినది బండివాఁడుకాక, పోలీసుజవాను. ప్రక్కనే హాయగ్రీవుఁడు నిలుచుండెను. జమీందారిణి భయాశ్చర్యము లతో కోపము నభినయించుచు "ఏమి యీ యన్యాయము

నీ వెవ్వరవు? బండి నిక్కడ నేల నిలిపినావు! ఊఁ! తోల
మనుము."

పోలీసుజవాను తన మెట్టుకుళ్ళాయిని కొంచెము సరి
చేసికొని పండ్లికిలించి "అమ్మా యింక తోలవలసిన పనిలేదు.
రక్షక భటాధికారులు తమను లోపలికి దయచేయుమను
చున్నారు" అనెను.

జమీందారిణి మోసమున దగుల్కొంటినని గ్రహిం
చెను. తన ప్రయాణ సన్నాహమును గూర్చి తెలిసికొని
తన్ను పట్టుకొనిరని గ్రహించెను. ఆమె రోషముతో భీకర
ముగ "ఇది యా ఛండాలుని పనియే!" యని "మందారా!
నీ పుణ్యమాయె కాని మూటభద్రము." అనగ "అమ్మా నేను
భద్రము చేసెదను. మీరు దిగుడు" అని అప్పుడచ్చటకు వచ్చి
నిలిచిన, పోలీసు ఇన్స్పెక్టరుముందుకు వచ్చెను. జమీందా
రిణి కదలక మెదలక గంభీరముగ "నన్ను నిర్బంధింప మీ
రెవ్వరు? నా యిష్టము లేనిది నేను దిగను" అనగా పోలీసు అధి
కారి మిమ్ము నరెస్టుచేసినా ననెను.

అంతట పోలీసు జవా నొకడు వచ్చి మందార చేతి
లోని మూటను లాగెను. ఆమూటను లాగికొనుటకు జమీం
దారిణి వ్యర్థప్రయత్నము చేయగ, మందారయు చురుకుగ
నాబండి యావలితలుపు దీసెను. కాని ఆవంక నిట్టిది జరుగునని
యాలోచించి యొక రక్షకభటుడును హయగ్రీవుడును నిలిచి

యుండుట చూచి నిశ్చేష్టులైరి. ఇంతలో పలువురి బండి చుట్టును గుమిగూడుచుండిరి. పలాయన మనుష్యుణమును కష్ట తరమగుచుండెను. పోలీసు యినస్పెక్టరు దిగుమని కఠినముగ నాజ్ఞాపింపగా జమీందారిణి ఇక లాభములేదని గ్రహించి, ధైర్యముతో నీ యాపద కడవ బెట్టుకొన దలచి, యొయ్యా రముగ దీవిగ రక్షకభటాలయము జొచ్చెను. అచ్చట బయట నెల్లరు కుతూహలముతో వేచియుండిరి. అంతట కొంతసేప టికి పదకొండేండ్ల క్రిందట నీలపుర జమీందారగు శ్రీరామా రావుగారిని చంపినందులకై ప్రస్తుతపు జమీందారిణి సుంద రమ్మగారును, ఆమెకు సాహాయ్యము చేసినందుల కామె ప్రియ పరిచారికయు పట్టుకొన బడిరని తెలియవచ్చెను. ఎల్లరు నాశ్చర్యపడిరి.

# ముప్పది యొకటవ ప్రకరణము

## —♦ పాపయ్య సాక్ష్యము. ♦—

కేసు విచారణ ప్రారంభించిరి. ఊరిలోని వారెల్లరు విచారణను చూడబోయిరి. తమ సామర్థ్యమువలన భవన మును స్వాధీనము చేసికొనిన అన్నప్పగారుకూడ తమ గుఱ్ఱపు

బండిలో వచ్చిరి. ఆయన తాము కాకతాళన్యాయముగ పంపిన త్వంతివార్త వలన నిదియెల్ల బయల్పడినందుల కాశ్చర్య పడిరి. ఆయన వింతతో జమీందారిణిని పరిచారికను బరీక్షించుచుండిరి. ఆహా! పాపయ్యకు సంతతధారగ పోవుచుండిన ధనవృష్టికిదియా కారణము! "ఛీ, ఛీ!" యని అన్నప్పగారనుకొనుచుండిరి. ఇంత భయంకర మగు సంబంధములు వీరికి గలవని యెఱిగియుండినచో తాను చాలకాలము క్రిందటనె జమీందారిణిని వశపఱచికొని యుండెడివాఁడుకదా! "అరరే! ఎంత వెఱ్ఱినైతిని. వృథాగ చెయి జారిపోయినది. అని పెదవి గఱచుకొనిరి.

ఒకసాక్ష్యమున అన్నప్పగారి గుమాస్తా యగు వెంకన్నగా గబద్ధమాడనందున జమీందారుతనఖాల నొకవ్యాజ్యమున కోర్టువారు నమ్మలేదు. అందువలన అన్నప్పగారాయనను దూషించి వెడలగొట్టి యుండిరి. వెంకన్నగారిప్పుడీ సంగతులు విని యిదియెల్ల ముందుగ నాకు దెలిసియుండినచో నేనే వ్యవహారములెల్ల చక్కబెట్టికొని యుండవచ్చును కదా! అనుకొనిరి. ఆయన యిప్పు డన్నప్పగారి నెట్లయిన సాధింపఁ గంకణముఁ గట్టుకొని యుండెను.

పాపయ్య రాజసాక్షిగ దిరిగి న్యాయస్థానమున శ్రీ రామారావుగారి హత్యనుగూర్చిన నిజము నతి విపులముగ

చెప్పదొడగెను. శ్రీ రామారావును నారాయణరావును సహాధ్యాయులు. వీ రిరువురును చెన్నపురిలో జమీందారు బిడ్డలు చదువుకొను న్యూయింగ్టన్ పాఠశాలలో చదువుకొనుచుండిరి. చెన్నరాజధానిలోని జమీందారు లెవ్వరైన గతించినప్పుడు వారి తరువాత జమీందారుడు కావలసినట్టి మైనరు బాలురకు కోర్టు ఆఫ్ వార్డ్సువారు సంరక్షకులుగ నుందురు ఈ బాలుర కిరువదియొక్క వత్సరములు నిండువరకును వీరిని మైనరు లందురు. ఇట్టి బాలురకు విద్యాబుద్ధులు గఱపుట కొక సంస్థను చెన్నపురిలో మద్రాసుగవర్నమెంటువారి పరిపాలనకై వారే స్థాపించిరి. దీనిలో నితర జమీందారుబిడ్డలను గూడ చేర్చుకొని చదువుచెప్పుటకు ఉపాధ్యాయులను నియమించిరి. బాలు రుండుటకు వసతిగృహమును గట్టిరి. బాలుర ప్రవర్తనము గనిపెట్టుటకు ట్యూటరులను నియమించు చుండిరి. ట్యూటరులతో నాబాలుర డెచ్చటికైన బోవచ్చును. ట్యూటరుకు చెప్పకుండ పోయినచో దండింపబడును. బాలురు వ్యాయామక్రీడలందు స్వేచ్ఛముగ పాల్గొన వచ్చును. వారు సముద్రపు టొడ్డునకు పోవచ్చును. అప్పుడప్పుడు విందులు చేయవచ్చును. అప్పుడప్పుడు ట్యూటరులతో దగ్గరయూళ్ళకు బోయి వింతలు జూచిరావచ్చును. అందువలన బాలురు ట్యూటరులకు వశవర్తులుగ నుండిరి. ట్యూటరులును జమీందారు బిడ్డలొసగు లంచముల కాస

జెందినచో వారి నట్లు లోబరచుకొనియు లేనిచో వారికన్నుల గప్పియు కొందఱు జరిగిండారు యువకులు స్వేచ్ఛావిహారు లైరి. వీరిధనము నాసించి కొందఱు దుర్మార్గులు వీరి నాశ్ర యించి వీరిరహస్య కృత్యములందు వీరికి సాహాయ్యము చేయు టయేగాక వీరి నింకను దుర్మార్గములందు దింపుచుండిరి. ఈ యువకులు చెన్నపురిలోని క్రీడామందిరములందును నాట్య శాలలందును ద్యూతగృహములందును ప్రొద్దుపుచ్చ సాగిరి. వీరు మెల్ల మెల్లగ మద్యపానమునను వ్యభిచారమునను తగు ల్కొనిరి. ధనము జవ్వనము వీరిని మదాంధులఁ జేయఁగ వీ రనేక నీచకృత్యముల కొడిగట్టసాగిరి.

వీరి దుర్మార్గములు బయల్పడినచో కోర్టువారు వీరిని వెడలగొట్టి శిక్షింతురని భయపడి వీరు తమ దుర్వృత్తిని రహస్యముగ నుంచుట కనేకులకు సేవకులకు నితరులకును లంచ మిచ్చుచుండిరి. ఇట్లు స్వేచ్ఛావిహారము సలుపుచుండిన వారిలో శ్రీ రామారావును నారాయణరావును ప్రముఖులు అని పాపయ్య పలికెను. ఎల్లరు నాశ్చర్యపడిరి. 'నేనాకాలమున న్యూయింగ్టను వసతి గృహములో నొక చిన్న యుద్యోగిని. నాకును శ్రీ రామారావుగారికిని స్నేహమయ్యెను. అతఁడు చాల నుదారస్వభావుఁడు. శ్రీ రామారావు మాయింటికప్పుడప్పుడు వచ్చుచుండును. మందారవల్లిని నేను పెండ్లిచేసికొనలేదనియు

నీమెయు, నీమె సహోదరి సుందరియు పూర్వము సురభి కంపెనీలో నాటకములందు తిరుగుచుండిరనియు, నిప్పుడు నా వద్ద నున్నారనియు రామారావుగారు తెలిసికొని సుందరితో స్నేహము చేయసాగిరి. నేను చూచియు చూడనట్లూరకొంటిని. రామారావుగా రింతలో తనతండ్రి మరణింపగ జమీందారయ్యెను. అంతట మాకు — కాదు, సుందరికి అతనిదగ్గర నుండి సొమ్ము గ్రహింపవచ్చునని ఆశకలిగెను. సుందరి యెన్ని జాబులు వ్రాసినను రామారావు బదులు వ్రాయలేదు. అంతట నొకనాటి సాయంత్రము సుందరి, నేనును నెల్లూరు పోయితిమి. సుందరి దర్శనమిమ్మని రామారావుగారికి నాచే కబురంపెను. రామారావుగారు కోపముతో మీ రిచ్చటికేల వచ్చితిరని విసిగికొని "సరియే రాత్రి పదిగంటల కిచ్చటికి తీసికొనిరమ్ము. ముందుగనే చెప్పుచున్నాను. సుందరియాటలు నాదగ్గర సాగవని చెప్పుము." అని గిరుక్కున దిరిగి వెడలిపోయిరి. నీపై నతని కభిమానమ్ము లేదు, లాభములేదని నేను పలుకగ సుందరి కన్నులెర్రజేసి చెన్నపట్టణములో పనికివచ్చినదాన నిప్పు డెందుకు పనికిరానో చూచెద ననెను. మేము మా సాయంత్రము వచ్చియుండి మఱల తెల్లవారక మున్నె నెల్లూరును విడిచి పొగబండినెక్కి వెడలిపోయియుండినందున మా రాక నెవ్వ రెఱుంగరు'

అని .. పాపయ్య చెప్పుచుండెను. కోర్టులోతన యెదుట నిలచియున్న సుందరమ్మ భయంకరముగ నతనివైపు చూచు చుంట కీతఁడు భయపడలేదు. ఆహాత్యయందు జరిగినవి జరిగి నటుల చెప్పుచుండెను. "సుందరికి రెండు ఊహలు కలిగెను. ఆజమీందారుని తనవలలో వేసికొని యైన నాతనిసంపద నను భవింపవలెను. లేక అతనివద్ద రత్నము బయల్పరతునని బెద రించి యైన ధనము సంపాదింపవలెను. యెట్లైన ధనమును సం పాదించి సుఖపడవలెను. కాని శ్రీరామారావు వెఱ్ఱివాఁడు కాఁడు. అతఁడు చాల ధైర్యశాలి. వ్యవహారత. సుందరి తన్ను బ్రేమించి కృశించుటను గూర్చి పలికి నప్పుడపనమ్మకముతో వెడగునవ్వు నవ్వెను. ఆమె తాను దీనురాలనని అనహాయ్య నని చెప్పినప్పుడు, పట్టణమెల్ల చేతిలో గిరగిర త్రిప్పు జాణ వగు నీకేమనెను. ఆమె 'నిన్ను విడచి పోజాలను నన్నిచ్చట నె చంపు'మనగా, కావలసిన 'నొకవంద రూప్యము లిచ్చెదను. లేనిచో నిదియు నీయను. నాకడ కెన్నడును రావలదు. నీవు నాయింటికివచ్చి యల్లరిచేయవలదు. ఇచ్చట మర్యాద దక్కదు" అనెను. ఆమెకన్ను లెఱ్ఱచేసి యుగ్రురాలయ్యెను. అతడు నోట్లును తీసి యీయబోవ నామె రోసముతో "ఆఁ! నా కీవెధవ వందరూపాయులను లంచమీయ దలచితివిగా! ఈరూప్యములు • బుచ్చుకొనుటకు నేను బిచ్చకురాల నను కొంటివా?" యని పలికి తనకడపటి సాధనముపయోగింప

దలచి తాను నాటకరంగముల ఝళిపించు బాకునుదీసి..ఆత్మ హత్యను చేసికొనుట నభినయింపఁబోవ నదిచూచి, రామా రావామెచేతిని పట్టుకొనెను. ఆమె విడిపించుకొన బ్రయత్నించెను. ఈ ప్రయత్నమున నిరువురు పెనగులాడిరి. ఆమె యిచ్ఛాపూర్వకముగనే గ్రుచ్చెనో, లేక నాపెనగు లాటలో పొరబాటున గ్రుచ్చుకొనెనో, ఆ బాకుయొక్క నాడెమొన జమీందారుని వక్షమున నెడమ గుండెలోనికి దూసికొనిపోవ, నాతఁడు మొదలు నరికిన వృక్షమువలె వెల్లగిలబడిపోవుట నేను చూడగలిగితిని. అప్పుడు సన్నని జల్లు పడుచుండెను. చీకటి యెల్లయెడల నలముకొనుచుండెను. ఆగ్రుడ్డివెలుతురున నిది చూచి నేను నిశ్చేష్టుఁడనైతిని. సుందరియు నోటమాటలేక నిర్ఘాంతపడి యుండుటను చూచితిని. ఆమె మెల్లన వంగి తత్తర పడుచు చూచెను. ఆ శవమును గదల్చి పేరుపెట్టి పిలచెను. ఆమెకంఠస్వర మప్పుడు భయంకరముగ మార్పుజెంది యుండెను. అప్పుడు మెల్లన నేనామె దగ్గరకుఁబోవ నావచ్చుచున్న దెవ్వరో గ్రహింపలేక పాదముల చడివిని తత్తరఁజెంది, తటాలునలేచి, యచ్చటనె పడినబాకును దీసి పరువెత్తబోవ నేను 'సుందరీ' యని పిలచితిని. ఆమె పరాకుగ నుద్రేకముతో నాబాకును నొకవంకకు విసరివైచెను. నేనట్లో యామెను గలసికొని 'ప్రమాదమున జరిగినదా? లేక చేయవలెనని చేసితివా?' యని అడిగితిని. సుందరి "అవును- కాదు- అవును,"

అని పలికెను. తరువాత సీమె "బావా! మనము శీఘ్రముగ పొగబండి నెక్కవలె" ననియెను. వీ రిరువురు గలసి పొగబండి నెక్కిపోయిరి. ఆమరునాటి దైనికపత్రికల్లో పట్టణమున సీహత్యనుగూర్చిన సమాచారము చదివి తెలిసికొనిరి." సుందరికి భయోద్రేకముకలిగిమనశ్శాంతి లేకుండపోయెను. ఆనాటిరాత్రి నారాయణరావు కూడ నీయావరణమున నే యుండెనని వింటిని. ఈ తరువాత నాకాదుర్మార్గునిసంగతి తెలిసినది. వీడే నాకును నా పందెముగుఱ్ఱమునకును బాధ్యాపాయము కలుగ జేసినాడు. ఈ దుర్మార్గుడు నాకప్పుడు కనబడినచో( వీడచ్చట నుండెనని యానాడే నాకు తెలిసియుండినచో, నేనా భవనపు టావరణమున నాగి, 'వింతపురుషుడ నగుటవలన ననుమానింపబడి యీ హత్యకై పట్టుకొనబడుటకు కూడ తెగువచేసియుందును ఈ దొంగముండకొడుకుని—" అని ఇట్లేమేమో పాపయ్య దూషింపసాగెను. కాని న్యాయాధిపతి యాతని నూరుకొనుమని వారించి హత్యనుగూర్చిన మాటలు చెప్పుమని హెచ్చరించెను. పాపయ్య నుఅల చెప్పెను. "హత్య జరిగిన తరువాత జమీందారింటి సంగతులెల్ల పత్రికలవలన తెలిసికొంటిని. అటు పిమ్మట సుందరి తన చాతుర్యమువలన అవకాశముకొఱకు వేచియుండి శ్రీ కృష్ణారావుగారు తనభార్య శిక్షింపబడిన అవమానము దుఃఖమును మరచుటకు చెన్నపురివచ్చి క్రీడామందిరములందు దుర్వ్యసనములం దగుల్కొని యుండుట నెఱిగి,

ఆయనను మెల్లగ తనవలలో వేసికొని, మెల్లగ యాయనతో పోయి జమీందారిణి యైనది. ఈ హత్యసంగతి బయల్పడక మానదనియు, నీమెకు సహాయము చేసినందున నాకును శిక్ష కలుగు ననియు, నేను భయపడుచుంటిని. ఇంతలో నేను న్యాయింగ్టను కళాశాల వసతిగృహమున నొకస్త్రీని రాత్రి రహస్యముగ తెచ్చిన సంగతి బయల్పడినందున నా యుద్యోగము పోయినది. ఇందువలన నేను రంగూనో మరియొక చోటికో పోయి కాలక్షేపము చేయుదు ననియు, నాకు ధన మంపుచుండు మనియు, సుందరితో చెప్పితిని ఆమెయు ఇందుల కంగీకరించినది. మంజార సుందరితో నెల్లూరు వెళ్ళినది. నేను సింహళమున గాలక్షేపము చేయుచుంటిని. మొన్న మొన్నటివరకును సుందరి నాకు ధనమంపుచుండెను—" అని పాపయ్య పలికెను.

# ముప్పది రెండవ ప్రకరణము.

—♦ ఉపసంహారము. ♦—

పాపయ్య సాక్ష్యమువలన రామారావుగారి హత్యారహస్యము పూర్తిగ బయల్పడెను. రాధాదేవి నిర్దోషియని స్పష్టమయ్యెను. ఈ కేసు విచారణ పూర్తియైనపిదప సుందరమ్మగారిపై నింకొక కేసు వచ్చెను. అది, నారాయణరావును హత్యచేయించెనని, ఆనాటిరాత్రి నారాయణరావును జంపిన

హంతకుని తాను జూచితిననియు, వాని వెంట పరుగెత్తి భుజ మును ద్రాయపరచితి ననియు, హయగ్రీవుడు చెప్పినను వాఁడు కనబడనందునను అనుమాన కారణము లెల్ల అనిరుద్ధుఁడే దోషి యని నిరూపించుచున్నందునను, పోలీసువా రనిరుద్ధు నరెస్టు చేసియుండిరి. నేటికి అనిరుద్ధుని యదృష్టవశమున హంతకుఁడు దొరికెను. వాడు నారాయణరావుగారి నౌఖరుగనుండి శిక్షి తుఁడై పగవహించిన చిన్నస్వామి యనువాఁడు. వాఁడు చెఱసా లలో నుండగనే వాని భార్యయు బిడ్డయు చచ్చిరి. అందు వలన వాఁడు జీవనములేక త్రాగుబోతుగ నుండి నారా యణరావుగారిని దూషించుచు తిరుగుచుండెను. నారాయణ రావుగారి హత్య తరువాత వాఁడు కనపడనందున వానిని వెద కగా నొకయూరిలో దొరికెను. వానిని పోలీసువారు విచా రింపగా నేరము నంగీకరించి, తన నానాడొక స్త్రీ జమీందారు గారి యింటికి పిలుచుకొని పోయెననియు, నచ్చట నింకొక స్త్రీ తనకు నాలుగురూప్యముల నిచ్చి నారాయణరావుగారిని తుద ముట్టించినచో బహుమాన మిచ్చెదనని యాస పెట్టెననియు తానంగీకరించి యారాత్రి సంకేతము నేర్పరచుకొని రెండవ యామె గుఱ్ఱపుబండిలో పోవుచు సాజ్ఞ చేయగా తాను నారాయణరావుగారిని చంపితిననియు నంగీకరించెను. మొ దటిస్త్రీ మందారయనియు రెండవయామె సుందరమ్మ యనియు నిరూపించెను. పోలీసువారీ నేరమునకు వీనిపైనను సుందరమ్మపైనను మందారపైనను కేసుపెట్టిరి. మేజస్ట్రేటు గారు వీరినెల్లరను సెషన్సుకోర్టుకు కమిటు చేసిరి.

ఈ విచారణమున సంగతులెల్ల బయల్పడుచున్న కొలదియు, కృష్ణారావుగారి పరితాపము హెచ్చుచుండెను. రాధాదేవి నిర్దోషియని తీర్మానించి యామెను విడిచిన నాడాయన జ్వరపీడితుడయ్యెను. శకుంతలయు రామారావు ననిరుద్ధుడును రాధాదేవిని తత్క్షణమె యింటికిదీసికొని వచ్చిరి. అప్పుడు చిరకాల వియోగము ననుభవించిన దంపతుల సమాగమము విచిత్రముగ నుండెను. వారొకరినొకరు కౌగలించుకొని దుఃఖించిరి. విషాదానందము లొక్కుమ్మడిగ వారి మనోభావములను నింపెను. కొంతవడి కిరువురు దుఃఖోపశమనము జేసికొని యూరడిల్లిరి.

కృష్ణారావుగారును అనిరుద్ధుడును జమీందారిణిని గూర్చియేమి చేయవలెనని యోజించుచుండిరి. అంతట అన్నప్పగారి ప్రాతగుమాస్తయగు వెంకన్నగారు వచ్చి సివిలుదావావేసి శ్రమపడవలసిన యావశ్యకము లేదనియు అన్నప్పగారి తనఖా చెల్లదని ఒక వ్యాజ్యమున కోర్టువారీ వరకే తీర్మానించినారనియు, దానిమీద జేవాద్రిలు ఫోర్జరీయని తాను ఋజువుపరుపగలననియు, క్రిమినలు కేసు దాఖలు చేయుడనియు ప్రోత్సహించిరి.

అన్నప్పగారీసంగతి విని ఇక లాభములేదని గ్రహించి వచ్చి తనఖా ఆస్తిని తాను వదులుకొనుచున్నాననియు సుందరమ్మగారివలన మోసపోయితి ననియు, రక్షింపుడనియు. జమీందారుగారి కాళ్ళపైబడి వేడుకొనిరి. కృష్ణారావుగారు నిందు కంగీకరించిరి. వెంకన్నగారు మాత్రము తనపట్టు విడు

వక ఫ్రోర్జరీ కేసు దాఖలు చేసిరి. అంతట అన్నప్పగారు తమ చరాస్తితో నెచ్చటికో పలాయనులైరి. కృష్ణారావుగారు కుటుంబముతో మరల తమ పితృ్రియమగు భవనమున గృహప్రవేశమెరి.

గృహప్రవేశమైన కొద్ది దినములకే రామారావునకు శకుంతల నిచ్చి వివాహము జేసిరి. రామారావునకు నెల్లూరు వైద్యశాల ప్రధాన వైద్యాధికారి యుద్యోగము లభించెను. వైద్యాలయమునకు జమీందారుగారు గొప్పవరాళ మొసగి సుశీలమ్మగారి పేర స్త్రీల కొక ప్రత్యేక భాగమును నిర్మించిరి.

అనిరుద్ధుడు తన విద్యను పూర్తి చేయుదలచెను. 'ఇక నీ వాన్యూయింగ్టను కళాశాలకు బోవల' దని తల్లి యనుట వలన నతడు చెన్నపురి క్రైస్తవ కళాశాలలో చేరెను. అతడు న్యూయింగ్టను వదలిన కొన్నాళ్ళకా కళాశాలాధికారియగు "డీలాహే" గారు హత్య చేయబడిరి.* ఆనేరము నొక జమీందారుల బిడ్డపైన నారోపించగ నొక గొప్ప కేసు జరిగెను. చెన్నపురిలో నీహత్యను గూర్చిన సంగతులెల్ల పలువురు చెప్పుకొనుచున్నందున, నా కేసు నచ్చట విచారింపగూడదని ముద్దాయులువిన్నవింపగ బొంబాయి కోర్టులో విచారణ జరిగెను. ఆవిచారణలో న్యూయింగ్టను స్కూలులో జరుగుచుండిన యక్రమములెల్ల వెల్లడియయ్యెను. ముద్దాయివలన దోషము

15. Nov. 1919

లేదని వదలిపెట్టిరి. అంతట నీపాఠశాల పరిస్థితులు గౌరవాస్పదములుగ లేవని ప్రభుత్వమువారు దానిని మూసివైచిరి

న్యూయింగ్టన్ పోయినదిగాని గుఱ్ఱపుబందెములు పోలేదు. ఈ దుర్వ్యసనమున దిగి జమీందారులు, ఉద్యోగులు, న్యాయవాదులు వర్తకులును గూడ తమ సర్వస్వమును గోల్పోవసాగిరి. గుఱ్ఱపుబందెములు వేయుట నాగరకతకు లక్షణమయ్యెను. అనిరుద్ధుఁడు మాత్రము మఱల నెన్నడును గుఱ్ఱపుబందెములకు బోలేదు.

నెల్లూరు సెషన్సు కోర్టువారు సుందరమ్మకు యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షయు, మందారకు నాల్గేండ్ల వరకమును విధించిరి. చిన్నస్వామికి కూడ ద్వీపాంతరవాసము విధింపబడెను.

అనిరుద్ధుఁడు పట్టభద్రుఁడై యింటికి వచ్చెను. అంతట నాతనికి శ్యామల నిచ్చి పెండ్లిచేసిరి. శకుంతల కొక కొమారిత గలుగ నామెకు సుశీల యని పేరిడిరి. రాధాదేవియు కృష్ణారావుగారును సుఖముగ నుండిరి. ఇదియెల్ల వెంకయ్య కత్యంతానందకర మయ్యెను. జమీందారుగారు 'నీవు పనిచేయలేవు, ఇంటిదగ్గిర కూర్చుండు'మని యుపకార వేతన మిచ్చుచున్నను, అతడు వారికొలువు మానక చిన్నసుశీల నెత్తుకొనుచు, నధ్యాత్మము బాడుచు, సీలాపనిందకథ నెల్లరకు చెప్పుచు కాలక్షేపము చేయుచుండును

# దక్షిణాఫ్రికా

విజ్ఞాన చంద్రికా గ్రంథమాలలోని 36 వ పుష్పము.

గ్రంథకర్త.

దిగవల్లి వేంకట శివరావు, బి. ఏ., బి. యల్

ఇది గాంధి మహాత్ముని జీవిత చరిత్ర.

దక్షిణాఫ్రికా భారతీయుల చరిత్ర.

దక్షిణాఫ్రికా దేశ చరిత్ర.

నేడు రాజకీయనాయకులు భరతఖండమునకు కావలెననుచున్న "డొమినియన్ స్టేటసు" అనబడు రాజ్యాంగపద్ధతి ఇందు చక్కగ వర్ణింపబడినది.

432 పుటలు. 5 దేశపటములు, 6 అర్టుచిత్రములు, 6 బొమ్మలు, చక్కని అచ్చు, క్యాలికో బైండు. వెల పోస్టేజి. గాక రు 2—0—0 లు. భారతి, ఆంధ్రపత్రిక, హిందూపత్రిక, కాంగ్రెసు పత్రికలు ప్రశంసించినవి.

"The author has traced the course of Indian emigration to South Africa from its earliest times to 1927. The Satyagraha movement of. Mahatma Gandhi, the recent attempts to settle the dispute.... are clearly outlined in a lucid and graphic manner. The author has taken pains to consult standard authorities on the subject. We heartily commend it to the Telugu public."

ఆన్సారీ మాడరన్ రివ్యూ పత్రిక 1929 జనవరిలో వ్రాసినది.

వలయువారు:—

దిగవల్లి వేంకటశివరావు, బి.ఏ., బి.యల్

బెజవాడ  అని వ్రాయుడు

దిగవల్లి వేంకటశివ రావుచే రచియింపబడిన ఆంధ్ర వ్యాసములు

## పోతన వేమనల యుగము

చెన్నపురి రాజధానికళాశాలవారి వలన 1922సం వత్సరమున రు 150 లు బహుమానము పొందిన ఆంధ్రవ్యాసము. పోతన వేమనల జీవితము, కృతులు, ఆ కాలమునాటి ఆంధ్ర దేశచరిత్రయు గల విమర్శకవ్యాసము. భారతియు, ఆంధ్రపత్రికయు, ప్రశంసించినవి. వెల రు0—8—0

## హిందూధర్మశాస్త్రసంగ్రహము

అవిభక్తకుటుంబ యజమానియు తండ్రియు స్త్రీలును చేయు ఋణములు, అన్యాక్రాంతములను గూర్చి ప్రస్తుతము అమలులో నున్న హిందూలా (హైకోర్టు ప్రీవీ కౌన్సిలు తీర్పులతో సహా) ఆంధ్రవ్యాసము. వెల రు0—4—0

వలయువారు:—దిగవల్లి వేంకటశివరావు, బి.ఏ.,బి.యల్.,

బెజవాడ

అని వ్రాయుడు